# జాతీయ పునర్నిర్మాణం: ట్రేడ్ యూనియన్ పోరాటాలు

(అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు రజతోత్సవ మహాసభకు
సమర్పింపబడిన నివేదిక)

ఎస్. ఎ. డాంగే

అనువాదం:

కంభంపాటి సత్యనారాయణ

విశాలాంధ్ర ప్రచురణ
విజయ

# విషయ సూచిక




| విషయం | | పేజీ |
|---|---|---|
| తొలిపలుకు | .... | 5 |
| 1. సోషలిజం సాధించిన విజయాలు | .... | 17 |
| 2. ఆర్థిక స్వాతంత్ర్యం కొరకు పోరాటం | .... | 34 |
| 3. వేతనాలు, పని, కోర్కెలు | ... | 66 |
| 4. సాంఘిక భద్రత | .... | 105 |
| 5. ట్రేడ్‌యూనియన్ ఐక్యత : కొన్ని సమస్యలు | .... | 123 |
| 6. కార్మిక తగాదాలు, పోరాటాలు | .... | 187 |
| 7. నిర్మాణం | .... | 209 |
| 8. ముగింపు | .... | 212 |


## అనుబంధాలు


1. అనుబంధం — i

   వివిధ పరిశ్రమలలో వచ్చిన లాభాల సూచీపత్రం

2. అనుబంధం — ii

   అధికధరల అలవెన్సులలో వ్యత్యాసాలు

3. A. అనుబంధం iii

పారిశ్రామిక తగాదాలు (1921 నుండి 57 వరకు)

3. B. అనుబంధం iv

పారిశ్రామిక తగాదాలు (1921 నుండి 57 వరకు)

4. అనుబంధం v

'ట్రేడ్ యూనియన్లు - వలస విధాన అంత్యదశ'-లోని కొన్నిభాగాలు.

# తొలిపలుకు

అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు రజతోత్సవం 1957 డిసెంబరు 25 నుంచి 29 వరకు ఎర్నాకుళంలో జరిగింది. ఆ మహా సభకు నేనొక నివేదిక సమర్పించాను. ప్రతినిధులు దాన్ని రెండు రోజులు చర్చించారు. అన్ని రాష్ట్రాలకు చెందిన, అన్ని ప్రధాన పరిశ్రమలకు చెందిన ప్రతినిధులు యీ చర్చలో పాల్గొన్నారు. చర్చానంతరం నేను ముగింపు ఉపన్యాసమిచ్చాను. దానిమీద నివేదికలోని "ప్రధాన నిర్ధారణలను, ప్రతిపాదనలను" ఆమోదిస్తూ సమావేశం ఒక తీర్మానం చేసింది.

చర్చలన్నిటిని దృష్టిలో ఉంచుకొని ఆ నివేదిక సంస్కరింప బడింది. అందులోని ప్రధాన నిర్ధారణలను, ప్రతి పాదనలను యధాతధంగా ఉంచి, అవసరమైన చోట్ల వాటిని స్పష్టీకరించడం జరిగింది. చివర సంఖ్యా వివరాలతో కొన్ని అనుబంధాలు చేర్చబడ్డాయి. 1957 అక్టోబరులో నాల్గవ ప్రపంచ ట్రేడ్ యూనియన్ మహాసభ లీప్జిగ్‌లో జరిగినప్పుడు నేను ప్రపంచ ట్రేడ్ యూనియన్ సమాఖ్యయొక్క కార్యవర్గం తరఫున సమర్పించిన నివేదికలోని కొన్ని భాగాలు కూడ అనుబంధంలో చేర్చబడ్డాయి. వాటికీ, ఎర్నాకుళం నివేదికలో వివరంగా చర్చింపబడిన కొన్ని ప్రధాన రాజకీయ–ఆర్థిక సమస్యలకు సంబంధం ఉంది. లీప్జిగ్ నివేదిక ప్రత్యేకంగా పుస్తకరూపంలో ప్రచురింప బడింది. అందులోని కొన్ని భాగాలు మాత్రమే యిప్పుడు పాఠకుల సౌకర్యార్థం యివ్వబడ్డాయి.

డిసెంబరు సమావేశం తర్వాత కొన్ని ముఖ్యమైన పరిణామాలు జరిగాయి. వాటిని ఇక్కడ పేర్కొనడం అవసరం.

జీవిత భీమా నిధుల కుంభకోణాన్ని గురించిన చాగ్లా కమిషన్ తీర్పు ప్రకటింప బడింది. దానితో ముంద్రా వ్యవహారమనే పేరు వ్యాప్తిలోకి వచ్చింది. చాగ్లా కమిషన్ తీర్పు ఫలితంగా, భారత ప్రభుత్వంయొక్క ఆర్థిక మంత్రి శ్రీ టి. టి. కృష్ణమాచారి రాజీనామా యిచ్చారు. ఈకుంభకోణం సందర్భంలోనే ప్రధాన ఆర్థికకార్యదర్శి హెచ్.ఎమ్. పటేల్ వగైరా ఉన్నతోద్యోగుల ప్రవర్తనను గురించి విచారించడానికొక అధికార విచారణ సంఘం నియమింప బడింది.

ముంద్రా వ్యవహారంవల్ల బయట పడిన విషయాలేమిటి? పెద్ద పెద్ద గుత్తపెట్టుబడిదారులు తమ స్వాధీనంలో ఉన్న ధనాన్ని, ఫ్యాక్టరీలను,వ్యాపార సంస్థలను ఉపయోగించుకొని, దేశ ఆర్థిక వ్యవస్థపై తమ ప్రాబల్యాన్ని ఎలా పెంచుకుంటారో అది స్పష్టం చేసింది. అందుకోసం వారు మంత్రుల్ని, పెత్తందారీ ఉద్యోగుల్ని, రాజ్యాంగయంత్రాన్ని ఎలా వినియోగించు కుంటారో చూపెట్టింది. సోషలిస్టు సమాజ నిర్మాణాన్ని గురించి ఎవరెన్ని కబుర్లు చెబుతూ న్నప్పటికీ రాజ్యాంగ యంత్రం, షేర్ మార్కెటు, పెద్ద పెద్ద బ్యాంకులు, గుత్తపెట్టుబడిదార్లు, అంతా ఒండొకరితో సన్నిహిత సంబంధాలు కలిగి యుంటూ ఏ విధంగా పెట్టు

బడిదార్ల ప్రయోజనాలను కాపాడుకొంటారో అది విశద పరచింది.

రాజ్యాంగ యంత్రంలోని అవినీతిని, దౌర్జన్యాన్ని ప్రజలు నిత్యమూ అనుభవిస్తూనే ఉన్నారు. నిరంతరం తమ జీవితాలను శాసిస్తున్న పెట్టుబడిదారుల ప్రాబల్యాన్ని వారు సహించలేకున్నారు. అట్టి ప్రజాసామాన్యంలో నిబిడీకృతంగా ఉన్న క్రోధం ముంద్రా వ్యవహారంతో పైకి ఉబికింది. జాతీయ పెట్టుబడిదారీ వర్గం యొక్క నిజ స్వరూపం—ముఖ్యంగా అందులో భాగమైన గుత్తపెట్టుబడిదారుల నిజ స్వరూపం, ప్రభుత్వంలోను పాలకవర్గ పార్టీ అయిన కాంగ్రెసులోను ఉన్న ఆ వర్గ ప్రతినిధుల నిజస్వరూపం — ముంద్రా వ్యవహారంతో చక్కగా బయట పడింది.

అయితే ప్రజల, ముఖ్యంగా కష్టజీవుల క్రోధాగ్ని ద్వేష భావం సంఘటిత రూపం ధరించలేదు; దేశవ్యాపితమైన నిరసన చర్యలు, ప్రదర్శనలు జరగలేదు. అయినప్పటికీ ప్రజలు ధైర్యంతో లంచగొండి తనాన్నీ, ఆశ్రిత పక్షపాతాన్నీ తీవ్రంగా గర్హించారు. ఉదాహరణకు బెంగాల్ ప్రభుత్వంలో పేరుకున్న లంచగొండితనానికి నిరసనగా ఒకమంత్రి రాజీనామా యివ్వడం, దాన్ని పురస్కరించుకొని రాష్ట్ర శాసన సభలో పెద్ద తుపాను బయల్దేరడం అందరికీ తెలిసిన విషయమే. ప్రతి రాష్ట్ర శాసన సభా యీరోజున లంచగొండితనానికి సంబంధించిన ఆరోపణలతో దద్దరిల్లిపోతోంది.

కాంగ్రెసుపార్టీయొక్క, కాంగ్రెసు ప్రభుత్వాలయొక్క రాజకీయ, నైతిక ప్రతిష్ఠ నేడు దెబ్బతింది. ఇది దేశానికి, అభ్యుదయ శక్తులకు ఎంతో లాభదాయకం.

ట్రేడ్ యూనియన్ రంగంలో ముంద్రా వ్యవహారం వల్ల ఒక మేలు జరిగింది. కార్మికులు పారిశ్రామిక న్యాయస్థానాలముందు, వేతనాల బోర్డులముందు తమ హక్కులను గురించి ప్రస్తావించినప్పుడల్లా కంపెనీ యజమానులు తమ వాదనను బలపరచుకోనేందుకుగాను ధృవీకరింపబడిన ఆదాయ వ్యయపట్టికలను చూపుతూ ఉంటారు. వాటిలోని అంకెలను పవిత్రమైన వాటిగా చిత్రిస్తూ ఉంటారు. కాని ముంద్రా వ్యవహారంవల్ల అదంతా ఒక నాటకమని స్పష్టమైంది. పరిశ్రమలను అభివృద్ధిచేసే, విస్తృత మొనర్చే పేరుతో యజమానులు పెద్ద పెద్ద మొత్తాలను రిజర్వు నిధులలో కలిపివేసి కార్మికుల కోర్కెలను నిరాకరించడానికి దాన్నొక సాకుగా చూపుతూ వచ్చారు. వాటి అసలు ఉద్దేశం పెట్టుబడిదారులకు లాభాలు సంపాదించి పెట్టడమేనని యిప్పుడు తేలిపోయింది. కార్మికులకు ఎక్కువజీతాలు చెల్లించగల స్తోమతు తమకు లేదంటూ యజమానులు చెప్పేమాటలు పెట్టుబడిదార్ల దోపిడీని కప్పిపుచ్చేందుకు ఉద్దేశింపబడిన తాత్విక ముసుగు మాత్రమే. పెట్టుబడి దారీ వర్గంయొక్క ఆర్థిక–రాజకీయ యంత్రాంగాన్ని గురించిన అవగాహన కార్మిక వర్గంలో పెంపొందాలంటేను, కార్మిక వర్గం తన ప్రయోజనాల

కొరకు యజమానులతో యింకా చక్కగా సంప్రతించేటట్లు వాదించేటట్లు పోరాడేటట్లు చేయాలంటేను మనం యీ విషయాలన్నిటిలోను వారి చైతన్యాన్ని వృద్ధి చేయవలసి యుంటుంది.

ముంద్రా వ్యవహారంవల్ల మరో ఫలితంకూడా కలిగింది. ప్రైవేట్ గుత్తపెట్టుబడిదారీ వర్గాలకు చెందిన అభివృద్ధి నిరోధకులు పరిశ్రమల జాతీయకరణ విధానాన్నెదుర్కొనేందుకు బాగా ధైర్యం కలిగింది. అఖిల భారత వాణిజ్య మండలి మార్చి (1958) నెలలో సమావేశమైనప్పుడు ప్రభుత్వరంగంలోని పరిశ్రమలన్నిటినీ—ముఖ్యంగా జీవిత భీమా కార్పొరేషన్ని — తిరిగి ప్రైవేట్ వ్యాపారస్తుల కిచ్చివేయవలసిందని సూటిగా డిమాండు చేసింది. ఒకవైపు ప్రధాని నెహ్రూ తన బడ్జెటు ఉపన్యాసంలో లక్షాధికారులూ, కోటీశ్వరులూ బూటకపు కానుకలద్వారా మరణ సుంకాలను ఎగవేస్తున్నారనీ, దేశంపట్ల వారు తమ ధర్మాన్ని నిర్వర్తించడంలేదనీ స్పష్టంగా తెలియజేస్తూంటే, వాణిజ్య మండలికి చెందిన లక్షాధికారులు, కోటీశ్వరులు దాదాపు పన్నులన్నింటినీ రద్దుచేయవలసిందని కోరుతూ తీర్మానాలుచేశారు. దీన్నిబట్టి భారతదేశపు గుత్తపెట్టుబడిదారులు ప్రభుత్వ పారిశ్రామిక, వాణిజ్య రంగంమీద ఎదురుదాడి చేస్తున్నట్లు స్పష్టమవుతుంది. అన్నిటికంటె ముందు జీవిత భీమామీద వారు దాడి ప్రారంభించడానికి కారణం లేకపోలేదు. పెట్టుబడిదారీ

విధానం అమలులోవున్న ఏ దేశంలోనైనా పన్నులు, నోట్లు ముద్రణంతర్వాత అతిసులభంగాను,సురక్షితంగాను విస్తారమైన ధనాన్ని పెట్టుబడుల కోసం సమకూర్చిపెట్టే సాధనం జీవిత భీమా నిధులు. సరకులను పెద్దయెత్తున ఉత్పత్తి చేసి, వాటిని మార్కెట్టులో అమ్మి, విషమ పరిస్థితులకు కూడా సిద్ధపడి, చాలకాలం తర్వాత ధనాన్నికూడ బెట్టడానికిపడే అవస్థలన్నీ దీనివల్ల తప్పుతాయి.

నేనీ నివేదికను సమర్పించిన తర్వాత మరో ముఖ్య పరిణామంకూడా జరిగింది. యిదివరలో 'సంక్షోభం నెమ్మదిగా అడుగు వేస్తూ' నడిచేది. దాని ప్రభావంకూడా స్పష్టంగా వుండేది కాదు. (ఈ విషయాన్ని సెప్టెంబరులో జరిగిన వర్కింగ్ కమిటీ సమావేశం ప్రస్తావించింది.) కాని యిప్పుడు దాని ప్రభావం స్పష్టంగా కనిపిస్తూంది. అమెరికాలో సంభవించిన ఆర్థిక మాంద్యంవల్ల సుమారు 50 లక్షల మంది కార్మికులు నిరుద్యోగు లయారు. ఈ యేడు బడ్జెటును ప్రవేశపెడుతూ ఆర్థిక మంత్రి భారత దేశంలో కూడ "ఉచ్ఛదశ అంత మయిందని" సెలవిచ్చారు; ఆర్థిక మాంద్యంయొక్క ఫలితాల నెదుర్కోడానికి సిద్ధంగా ఉండవలసిం దంటూ ఆయన మనల్ని హెచ్చరించారు.

ఎల్లప్పుడూ పెట్టుబడిదారీ ఆర్థిక సంక్షోభాలకు మొట్టమొదట బలిఅయ్యేది కార్మికులూ, వారిజీతాలూ, వారి ఉపాధులూను. భారత దేశం విషయంకూడ యింతే. వేత

నాల బోర్డుల పనిని ఆపుజేయ వలసిందనీ, కొత్త బోర్డులను నియమించ వద్దనీ పెట్టుబడిదారీ పత్రికలప్పుడే గోలచేయడం ప్రారంభించాయి.

గుత్త పెట్టుబడిదార్ల కోర్కెల నెల్లప్పుడూ యీ దేశ్చె కేంద్ర ప్రభుత్వం యీ విజ్ఞప్తిని సానుభూతితో ఆలకిస్తోంది. కార్మిక మంత్రిత్వ శాఖ తేయాకు పరిశ్రమకు వేతనాల బోర్డును నియమించడాని కంగీకరించ లేదు. జెమ్షెడ్‌పూర్, బర్న్‌పూర్ యినుము-ఉక్కు కర్మాగారాలలో పనిచేసే కార్మికులు బ్రహ్మాండమైన ప్రదర్శనలు జరిపినప్పటికీ, ప్రభుత్వం వారి సమస్యను పరిష్కరించడానికి ట్రిబ్యునల్‌నిగాని వేతనాల బోర్డునుగాని నియమించ లేదు.

వర్కింగ్ జర్నలిస్టులకు (పాత్రికేయులు) జీతాలను పెంచవలసిన అవసరం ఉందని వేతనాలబోర్డుచేసిన నిర్ణయం చెల్లదంటూ యిటీవల సుప్రీంకోర్టు చెప్పిన తీర్పు గుత్తపత్రికాధిపతులకు బాగా సహాయపడింది. ఎక్కువ జీతాలు చెల్లించగలశక్తి పత్రికాధిపతులకు లేదని సుప్రీంకోర్టు భావించింది. యజమానులు సంపాదించిన విపరీత లాభాలను గురించి నిజమైన పరిశీలనలు జరపకుండానే యీతీర్పు చెప్పబడింది.

కార్మికులమీద మరికొన్ని దాడులుకూడా జరిగాయి. బెంగుళూరులో హిందుస్థాన్ విమాన నిర్మాణ కేంద్రం అధికారులు జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు పేరుతో

వ్యవహరించే యూనియన్ విచ్ఛిన్నకుల సహాయం తీసుకొని కార్మికుల కోర్కెలను యీడేర్చడానికి నిరాకరించారు. ఈ సంస్థపై యాజమాన్యంగల ప్రభుత్వం కర్మాగారాన్ని మూసి వేసేందుకు, వందలాది కార్మికులను అరెస్టు చేసేందుకు ఒప్పు కుంది. ఈ చర్యకు నిరసనగా ఆ ప్రాంతంలోని ఫ్యాక్టరీలలో పనిచేసే కార్మికులందరూ ఒకరోజు సమ్మె చేశారు. బర్న్ పూర్, కుల్టీలలోని పెద్ద పెద్ద కంట్రాక్టు కంపెనీల యజమా నులు 20,000 మంది కార్మికుల సమ్మెకు కారణమయారు. మార్టిన్ బర్న్ కంపెనీ యజమానులు ఉత్పత్తి బోనసును తగ్గించినందుకు నిరసనగా స్మెల్టర్స్ సమ్మె చేశారు. తర్వాత ఆ తగాదా పరిష్కరింపబడింది. బీహారు, బెంగాలు ప్రభు త్వాల అధిపతులు కాంగ్రెసు, జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు నాయకులతోను, పోలీసు ప్రధానాధికారులతోను ఒక సమావేశం జరిపి, అ. భా. ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు నాయకత్వాన సంఘటితమవుతున్న గని కార్మికులమీద, యినుము — ఉక్కు కార్మికులమీద నిర్బంధ విధానం అమలు జరిపే సమస్యపై చర్చలు జరిపారు. మామూలుగా అవలం బింపబడే పోలీసు అరెస్టులు, రౌడీదాడులు విచ్చలవిడిగా ఉప యోగింపబడుతున్నాయి.

ఈవిధంగా కార్మికులమీద ఒకవైపు నిర్బంధ విధానం అమలుజరపబడుతూంటే, మరోవైపు వేలాది గని కార్మికుల ప్రాణాలకు రక్షణ యిచ్చేఏర్పాట్లు రద్దు చేయబడుతున్నాయి.

ఇటీవల చీనాకురి, సెంట్రల్ బౌరా బొగ్గు గనులలో 205 గురు కార్మికులు మరణించడానికి కారణం యిదే.

ఈవిధంగా ప్రైవేట్ యజమానులు, ప్రభుత్వం బాహాటంగా క్రమశిక్షణను ఉల్లంఘించడం ఎక్కువవుతూంటే, దాన్ని అరికట్టడానికి బదులు ప్రభుత్వం హింద్ మజ్దూర్ సభ చేత, అ. భా. ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు చేత శిక్షణను సంబంధించిన నియమావళిని అంగీకరింప జేసేందుకు చాల ఆదుర్దా కనబరచింది. (అదివరకు యీ రెండు సంస్థలు పై నియమావళిని అంగీకరించలేదు.) ప్రభుత్వం అందులోని మూడు అంశాలను స్పష్టీకరించిన తర్వాతనే ఆ రెండు సంస్థల ప్రతినిధులు గత ఉపసంఘ సమావేశంలో నియమావళిని ఆమోదించారు. మొదటి అంశం, సమ్మె హక్కును నిరాకరించకుండా ఉండడం; రెండవ అంశం, నియమావళిలో రాజీ చేసుకొనేందుకు, తమ కోర్కెలను నివేదించుకొనేందుకు, పరిష్కారం చేసుకొనేందుకు గల అవకాశాలు అన్ని యూనియన్లకు ఉండడం; అలా ఉండకపోతే అవి నియమావళికి కట్టుబడియుండ నక్కర లేదు. మూడవ అంశం, నియమావళిని ప్రైవేట్ రంగానికీ, పబ్లిక్ రంగానికీ కూడ వర్తింపజేయడం. ఈ షరతులను యజమానులందరూ సద్భావంతో పాటించినట్లయితే, ట్రేడ్ యూనియన్లు ఒక అడుగు ముందుకు వేసినట్లే. వారలా పాటిస్తారా అనేదే సమస్య. త్వరలో అది కూడా తెలుస్తుంది.

మరో ముఖ్యపరిణామం ట్రేడ్ యూనియన్ ఐక్యతకు సంబంధించినది. అందరికీ అంగీకార యోగ్యమైన కోర్కెల ప్రణాళికనొకదాన్ని తయారుచేసి, దాన్ని అన్ని ప్రభుత్వాలకు శాసన సభలకు సమర్పించేందుకు, దానివెనుక కార్మికులందరినీ సమీకరించి దేశవ్యాపితంగా సభలు—ఊరేగింపులు జరిపేటందుకు హింద్ మజ్దూర్ సభ అన్ని ట్రేడ్ యూనియన్ సమాఖ్యల ప్రతినిధులతో ఒక సమావేశం జరిపింది. మార్చి 27 వ తేదీని దేశమంతటా కార్మికులు ఐక్య ప్రదర్శనలు జరిపారు. అందరికీ అంగీకారయోగ్యమైన కోర్కెల ప్రాతిపదికమీద కార్మికవర్గం ఐక్య కార్యాచరణకు పూనుకోవడం సాధ్యమని ఆ ప్రదర్శనలు రుజువు చేశాయి. ఈ ఐక్య భావం కార్మిక వర్గాన్ని మరింతగా సంఘటిత పరుస్తుంది. ఆర్థిక మాంద్యంవల్ల కలిగే విపత్తునుంచి కాపాడుకోడానికి, కార్మికుల ప్రజల కోర్కెలను తృణీకరించి తమ లాభాలను పెంచుకొనేందుకు యజమానులు చేసే దాడుల నెదుర్కొ గలశక్తి దీనివల్ల కార్మికులకు లభిస్తుంది.

ఎర్నాకుళం మహాసభ తర్వాత జరిగిన పరిణామాలను బట్టి, యింతవరకు మనం నడుస్తున్న మార్గంనుంచి వైదొలగవలసిన అగత్యమేమైనా ఉందా? లేదు. ఈ దశలో మనం జరిపిన సంప్రతింపులు (ఫలించినవీ, ఫలించనివీకూడా) నడిపిన సమ్మెలు తదితర పోరాటాలు అ. భా. ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు అనుసరించే ద్వివిధ మార్గంయొక్క ప్రాశస్త్యాన్ని

సుజువు చేస్తున్నాయి. ఆ మార్గాన్ని గురించి ఎర్నాకుళం నివేదిక యిలా తెలియ జేసింది :

"సంక్షోభం నెమ్మదిగా అడుగువేసుకుంటూ వస్తున్న సమయంలో మనం సమావేశమవుతున్నాం. ప్రభుత్వం అభివృద్ధి ప్రణాళికలకు కేటాయించిన మొత్తాలను తగ్గించుకో వలసి వస్తుందన్నమాటలు వినిపిస్తున్నాయి. అలా జరిగితే, అందరికన్న ముందు బాధపడవలసినవారు కార్మికులు, పేదలైన మధ్యతరగతి ప్రజలూను. భారత దేశాన్ని ఆర్థికంగా అభివృద్ధి చేసుకోవడమనేది తక్షణమే అందరూ నిర్వర్తించవలసిన జాతీయ కర్తవ్యం. ముఖ్యంగా ట్రేడ్ యూనియన్లు యీ కర్తవ్యాన్ని ఎంతో బాధ్యతతో నిర్వర్తించ వలసి యుంటుంది. కాని పై విధంగా జరిగితే యీ అభివృద్ధి కార్యాలు నిలిచి పోతాయి.

"అదే సమయంలో మరో విషయాన్నికూడా మనం గుర్తించాలి. ఈ అభివృద్ధి కష్టజీవుల పొట్టలు కొట్టకుండా సాధింప బడేటట్లు చూడాలి. అందుచేత మనం ద్వివిధ మార్గమవలంబించాలి. మొదటిది ఆర్థికాభివృద్ధికి దోహదం చేయడం; రెండవది యీఆర్థికాభివృద్ధిలో కష్టజీవుల ప్రయోజనాలను కాపాడ్డం.

"ఇందుకు పోరాటపు ఎత్తుగడలను గురించి జాగ్రత్తగా ఆలోచించాలి. అవి యీ రెండు లక్ష్యాలను సాధించగలిగే ట్లుండాలి. అవి కష్టమైన ఎత్తుగడ లేనన్న విషయం సందేహం లేదు. కార్మికులు కోరే ప్రతి కోర్కెను బలపరచేందుకు సమ్మె జరపాలనడమూ తప్పే; సమ్మెలన్నిటినీ నిషేధించడమూ తప్పే. దీన్నే మనం ఈయేడు సెప్టెంబరులో జరిగిన వర్కింగ్ కమిటీ సమావేశంలో ఇలా స్పష్టీకరించాం:

- సంఘటితులమై ఐక్యతను సాధిద్దాం;
- ప్రదర్శనలు జరిపి నిరసన ప్రకటిద్దాం;
- సంప్రదింపులుజరిపి ఒడంబడికలు కుదుర్చుకుందాం;
- వానివల్ల ఫలితం కలుగకపోతే శాంతియుతంగాను, చిట్టచివరి మార్గంగాను సమ్మె చేదాం.

"ఈ అవగాహన యిప్పటికీ సరియైనదే."

న్యూఢిల్లీ,
28 మార్చి, 1958

ఎస్. ఏ డాంగే.

# 1.

# సోషలిజం సాధించిన విజయాలు

## 1. నూతన అవకాశాలు

ప్రపంచంలో అత్యంత ప్రధానమైన పరిణామాలు జరుగుతూన్న సమయంలో మనం సమావేశ మవుతున్నాం. అవి సమాజాభివృద్ధికీ, మానవ నాగరికతకూ గొప్ప అవకాశాలను కల్పిస్తున్నాయి. కాని రెండో వైపున భారత దేశం లోను, సామ్రాజ్యవాద దేశాల్లోను లక్షలాది కష్టజీవుల్ని అనేక బాధలకు లోనుజేసే ఘటనలుకూడా జరుగుతున్నాయి. కారణమేమంటే, అపారమైన నూతన ఉత్పత్తి సాధనాలింకా ప్రజల పరం కాలేదు; లక్షలాది కార్మికుల సంఘటిత శక్తికి అవింకా లోబడ లేదు.

ఈరోజున ప్రపంచంలోని ప్రతి వ్యక్తినీ ఒక అద్భుతమైన ఘటన ఆశ్చర్య సముద్రంలో ముంచింది. మన ఊహకు అందని మహావేగంతో భూమిచుట్టూ రెండు స్పూత్నిక్కులు తిరుగుతున్నాయి. ప్రకృతివలెనే మానవుడుకూడా రెండు చంద్రమండలాలను సృష్టించి ఆకాశంలోకి విడిచి పెట్టాడు.

ఈ అద్భుత ఘటన 1957 అక్టోబరులో జరిగింది. దాని ప్రభావం శాస్త్ర విజ్ఞానంమీద, తత్వ శాస్త్రంమీద, రాజకీయాలమీద, ఆర్థిక పరిణామాలమీద, మానవునికి సంబంధించిన ప్రతి విషయంమీద ప్రసరిస్తోంది.

మొట్టమొదటి పరమాణువు ఛేదింపబడినప్పుడు అది జపాన్‌లోని రెండు మహానగరాలను భస్మంచేసి లక్షలాది ప్రజల్ని నాశనం చేయడాని కుపయోగపడింది. కాని మొట్ట మొదటి ఖండాంతర రాకెట్ మానవునికి శాంతి సౌఖ్యాలను చేకూర్చే స్పుత్నిక్‌ని ఆకాశంలోకి పంపడానికి వినియోగ పడింది. అది ప్రపంచ ప్రజలకు ఆనందం, యుద్ధోన్మాదులకు దుఃఖం కలిగించింది. మాటిమాటికీ యుద్ధమనే మారణ హోమంలో ప్రపంచాన్ని భస్మం చేస్తామంటూ బెదరించే అమెరికన్ సామ్రాజ్యవాదులు ఖండాంతరరాకెట్‌నీ, స్పుత్నిక్‌నీ చూడగానే కళ్ళు తేలవేశారు.

ఎందువల్ల ? సామ్రాజ్య వాదుల చేతుల్లో మొట్ట మొదటి ఆటంబాంబు సామ్రాజ్యవాదులకే వినియోగపడ్డం వల్ల, మొట్టమొదటి ఖండాంతర రాకెట్ సోషలిస్టు దేశాల్లో అగ్రగామియైన సోవియట్ యూనియన్ చేతుల్లో ఉండడం వల్ల అది మానవజాతి యొక్క శాంతి ప్రయోజనాలకు ఉప యోగపడింది. దానివల్ల మానవుని శాస్త్రవిజ్ఞానమేకాదు, సోషలిస్టు శాస్త్రవిజ్ఞానం అపారంగా అభివృద్ధిచెందింది. కను కనే అది మానవుని శాంతి ప్రయోజనాలకు దోహదకారిగా ఉంది.

సామ్రాజ్యవాదదేశాల పత్రికలు చదివే వారందరికీ యీ వ్యత్యాసం కనిపిస్తుంది. స్పుత్నిక్ ఆకాశ వీధులలో విడిచిపెట్టబడక పూర్వం అమెరికన్ సామ్రాజ్య వాదులు

మధ్యప్రాచ్యంలో యుద్ధసంక్షోభం సృష్టించుతున్నారు. కాని సోవియట్ తన ఖండాంతర రాకెట్‌ని ఉపయోగించేటప్పటికి యుద్ధోన్మాదుల దర్పం అణిగింది. స్పుట్నిక్ అరబ్బు దేశాల్ని, వెనుకబడియున్న సమస్త దేశాల్నీ పశ్చిమ రాజ్యాల తళుకు బెళుకులనుంచి దూరంచేసింది.

•

ఖండాంతర రాకెట్టు, స్పుత్నిక్కు సోషలిస్టు దేశం యొక్క అధీనంలో ఉండడంవల్ల కార్మిక వర్గమూ ప్రపంచ ప్రజలూ మరో ముఖ్యమైన పాఠం నేర్చుకున్నారు. 40 సంవత్సరాల క్రిందట ఆర్థికంగా వెనుకబడియున్న రష్యా దేశాన్ని కార్మికవర్గం కేవలం సోషలిస్టుసిద్ధాంతం - ఆచరణ అనే ప్రాతిపదికపై మాత్రమే పరిపాలించడం ప్రారంభించింది. ఆ పరిస్థితి యిప్పుడు లేదు; శాస్త్రవిజ్ఞానంలోను, సాంకేతిక స్థాయిలోను, పారిశ్రామికాభివృద్ధిలోను అత్యంత బలీయమైన సామ్రాజ్యవాద దేశాల్నికూడా తలదన్నే స్థితికి సోవియట్ యూనియన్ నేడు వచ్చింది. రెండుసార్లు సామ్రాజ్యవాదుల దురాక్రమణకు, ఆర్థిక దిగ్బంధానికి ప్రచ్ఛన్న యుద్ధానికి గురి అయినా, 200 సంవత్సరాల్లో పెట్టుబడిదారీ దేశాలు సాధించజాలని అభివృద్ధిని సోవియట్‌యూనియన్ 40 సంవత్సరాల్లో సాధించగలిగింది. కార్మిక వర్గం అధికారంలో ఉన్న ఒకదేశం ఎంత వేగంగా అభివృద్ధిచెందగలదో తెలుసుకోడానికిది చక్కని తార్కాణం. ఇంగ్లండ్, అమెరికాల పాలకులు సైతం తమ దేశాల్లో ఇంజనీర్ల సంఖ్య, సాంకేతిక నైపుణ్యం సోవియట్‌లోకన్న ఎందువల్ల యింకా వెనుకబడియున్నవో

తెలుసుకోవలసిన అవసరం ఉందంటున్నారు. దీన్నిబట్టి కార్మికవర్గ ప్రపంచ మెలా పురోగమిస్తోందో పెట్టుబడిదారీ ప్రపంచ మెలా తిరోగమిస్తోందో తెలుసుకోవచ్చు.

భారత దేశస్థులమైన మనమీద కూడా యీ పరిణామాల ప్రభావం కనిపిస్తోంది; వాటికి మనం దూరంగా ఉండడం అసంభవం. భారత ప్రజలు, ప్రభుత్వం కూడా వాటి ప్రాధాన్యతను అర్థంచేసుకొని తదనుగుణ్యంగా వ్యవహరిస్తున్నారు.

ఈనాడు మనదేశం శాంతిమార్గ మవలంబించడానికి నిశ్చయించుకొంది. మన ప్రజలు, ప్రభుత్వం కూడా యుద్ధోన్మాదుల శిబిరంలో ప్రవేశించడానికి నిరాకరించారు. మన దేశంయొక్క విదేశాంగ విధానాన్ని రూపొందిండడంలో ప్రధానపాత్ర వహించిన నెహ్రూపండితుడు ప్రధాన మంత్రి హోదాలో తన యావచ్ఛక్తినీ శాంతిని కాపాడ్డానికి వినియోగిస్తున్నారు. స్పుత్నిక్కు ఆకాశం మీదికి విడిచి పెట్టబడిన తర్వాత మళ్ళా ఆయన అగ్రరాజ్యాలకొక విజ్ఞప్తి చేస్తూ ఆటంబాంబు పరీక్షలను నిలిపివేయమనీ, సమిష్టి చర్చలకు పూనుకోమనీ హెచ్చరించారు. ఉత్తర అట్లాంటిక్ రాజ్యాలు యూరపులో సమావేశమవుతున్న తరుణంలో ఆయన మరొక సారి యుద్ధకూటముల నిర్మాణాన్ని నిరసించారు.

రెండవ అత్యంత ప్రధానమైన ఘటన, ఐక్యరాజ్య సమితిలో సభ్యత్వంగల 82 దేశాలూ శాంతియుత సహజీవనం

గూర్చి తీర్మానించడం. దాన్ని ప్రతిపాదించినది ఇండియా, స్వీడన్, యుగోస్లావియా దేశాలు. 1954 ఏప్రిల్‌లో చైనా-భారతదేశాలు మొట్టమొదటిసారిగా రూపొందించిన పంచశీలాలు దానికి ప్రాతిపదిక. ఈనాడు యావత్ప్రపంచం సహజీవన సూత్రాన్ని అంగీకరించింది. పై తీర్మానం చారిత్రక పరిణామ క్రమంయొక్క చివరిదశ.

## 2. కూలిపోతున్న వలస విధానం

మరొక అత్యంత ప్రధానమైన పరిణామం రోజురోజుకూ వలసవిధానం పతన మవుతూండడం. వలసవిధానం యింత వరకు సామ్రాజ్యవాదానికి పెట్టని కోటగా ఉంటూవచ్చింది. ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలలో కోట్లాది ప్రజల్ని పీల్చి పిప్పిచేసేందు కది ఉపయోగపడుతూవచ్చింది.

రెండు శతాబ్దాల క్రిందట యూరప్ అమెరికాలు ఆధునిక ఉత్పత్తి పద్ధతుల ద్వారా పెట్టుబడిదారీ విధానాన్ని పెంపొందించినప్పుడు పారిశ్రామికంగా ఆ దేశాలెంతో అభివృద్ధిచెంది ఐశ్వర్యవంతమయాయి. కాని పాత ఉత్పత్తి పద్ధతుల ద్వారా చాలకాలం అభివృద్ధిచెంది ఐశ్వర్యవంతమయిన ఆసియా దేశాలు మాత్రం వెనుకబడిపోయాయి.

యూరపియన్ దేశాల పెట్టుబడిదారులు ఆసియా, ఆఫ్రికా దేశాల ప్రజల్ని కొల్లగొట్టుకొని పాదాక్రాంత మొనర్చుకున్నారు; వారి సంపదను అపహరించారు; యూరప్‌లోని, ముఖ్యంగా ఇంగ్లండ్‌లోని పెట్టుబడిదారీ పరి

శ్రమలకు ముడిపదార్థాలను చౌకగా కాజేసేందుకు వారిచేత కండలు కరిగించి పనిచేయించారు; తమ ఫ్యాక్టరీలలో తయారైన సరకులను యీ దేశాలమీద రుద్ది విపరీతమైన లాభాలు సంపాదించారు. నూతన నాగరికతాభివృద్ధి మానవుని శ్రమనూ కష్టాలనూ తగ్గించడానికి బదులు కొద్దిమంది దోపిడీగాండ్రకు, పెట్టుబడిదార్లకు మాత్రమే సకల సంపదలు చేకూర్చింది. ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలలోని కోట్లాది ప్రజల్ని యూరప్ అమెరికా ఖండాలలోని అభివృద్ధిచెందిన దేశాలకు ఊడిగంచేసే బానిసలుగా తయారుచేసింది.

ఆ చరిత్ర అంతటినీ నేను వర్ణించబోవడం లేదు. దాని ఫలితమేమిటో మనందరం ఎరుగుదుం. ఉత్పత్తికి అవకాశాలు అపారంగా పెరిగాయి. యావత్ప్రపంచం— దాని మార్కెట్లు, వస్తు సంపద — ఒకేఒక మార్కెట్ క్రిందికి, పెట్టుబడిదారీ మార్కెట్ క్రిందికి వచ్చింది. అయినా పెట్టుబడిదారీ విధానం తడవకొకమారు అధికోత్పత్తి వల్ల సంభవించే ఆర్థిక సంక్షోభాలతో మొదటినుంచీ ఉక్కిరి బిక్కిరవుతూంది. ప్రతి పెట్టుబడిదారీదేశం తన దోపిడీ ఫలితాల్ని కాపాడుకొనేందుకు గాను తనతో పోటీచేసే దేశంకన్న పైచేయి సంపాదించడానికి ప్రయత్నిస్తూవచ్చింది. ఈ విధంగా పెట్టుబడిదారీ దేశాలు మార్కెట్లకోసం, వలస దేశాలకొరకు లాభాలకొరకు 1914 — 1939 మధ్య ఒకదానిమీద ఒకటి యుద్ధాలకు దిగాయి.

సామ్రాజ్యవాదులు వలస దేశాల ప్రజల్ని మరింత క్రూరంగా దోచుకొనేందుకు సరికొత్త ఉత్పత్తి సాధనాలను, పెట్టుబడిదారీ పద్ధతులను ప్రవేశపెట్టవలసి వచ్చింది. ఫలిత మేమంటే, వలస దేశాల్లోకూడ పెట్టుబడిదారీ వర్గం, కార్మిక వర్గం కొత్తగా ఆవిర్భవించాయి. ప్రజల్లో నూతన చైతన్యం, జాతీయ చైతన్యం, విదేశీయుల పీడననుంచి విముక్తి చెందాలనే ఆకాంక్ష క్రమంగా ప్రబలంగా జొచ్చాయి. సామ్రాజ్యవాదం సంక్షోభంలో యిరుక్కున్నప్పుడల్లా యివి ప్రస్ఫుటంగా రూపొందసాగాయి. ఆసియా దేశాలు తమ సంపదను తాము అభివృద్ధిచేసుకొనేందుకు సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా సంపూర్ణ స్వాతంత్ర్యంకొరకు పోరాడ నారంభించాయి. ఈవిధంగా సామ్రాజ్య వాదులు పరాధీన దేశాల్లో జాతీయ విముక్తి ఉద్యమాల తాకిడి నెదుర్కో వలసి వచ్చింది.

## 3. సంక్షోభంయొక్క రహస్యమూ, సోషలిస్టు లక్ష్యమూ

ఈ సందర్భంలో మనమొక విషయాన్ని విస్మరించ కూడదు. ప్రపంచంలో పెట్టుబడిదారీ విధానం కార్మిక వర్గాన్ని దోపిడీ చేయడం ద్వారానే అభివృద్ధి చెందింది; ఆసియా ఆఫ్రికా దేశాలను సామ్రాజ్యవాదులు బానిస శృంఖలాల్లో బంధించ గలిగారంటే యూరపియన్ కార్మిక వర్గాన్ని పీడించడం ద్వారానే అది సాధ్యమయింది.

మొట్టమొదట కార్మిక వర్గం వలస ప్రజల మాదిరిగానే అతి హీనంగా చూడబడింది. కాని త్వరలో వారు పెట్టుబడి దారుల దాడినుంచి ఆత్మరక్షణ చేసుకొనేందుకు ప్రతి ఘట నకు పూనుకో నారంభించారు. ట్రేడ్ యూనియన్లను నిర్మిం చుకోడం ఎలాగో నేర్చుకున్నారు. సమ్మెలు నడిపారు. తక్కువ పని గంటల కోసం, ఎక్కువ జీతాలకోసం, ప్రభుత్వ చట్టాలద్వారా కార్మిక హక్కుల రక్షణ కొరకు వీరోచిత పోరాటాలు జరిపారు. ఈ పోరాటాల, త్యాగాల ఫలితంగా కార్మికవర్గం తనస్థితి గతులను యిదివరకుకంటె కొంత చక్క జేసుకో గలిగింది.

అయితే యిలా కొన్ని విజయాలను సాధించినప్పు డల్లా పెట్టుబడిదార్లు తమలాభాలను పెంచుకొనేందుకు కొత్త ఉపాయాలను కనిపెడుతూంటారని కార్మికులు త్వరలోనే తెలుసుకో గలిగారు. పని గంటలు తగ్గింప బడినప్పుడల్లా పెట్టుబడిదార్లు పనివేగాన్నీ, జీతాలు పెంచబడినప్పుడల్లా పనిభారాన్నీ హెచ్చిస్తూ వచ్చారు. సాంకేతికాభివృద్ధి కొత్తస్థాయికి చేరుకున్నప్పుడల్లా పెట్టుబడిదార్లు తమ సంప దను విపరీతంగా అభివృద్ధి చేసుకొంటూ వచ్చారు. రాజ్యాంగ యంత్రంయొక్క, న్యాయశాస్త్రంయొక్క, పోలీసు సిబ్బంది యొక్క సహాయంతో వారు ట్రేడ్ యూనియన్లను, సమ్మె లను అణుస్తూ వచ్చారు. ఆ సాధనాలన్నీ పెట్టుబడిదార్ల అధీ నం క్రింద ఉన్నవే. చివరకు ఎలాంటి పరిస్థితి ఏర్పడిందంటే,

కేవలం సమ్మెలు మాత్రమే - అవి దేశవ్యాపితంగా జరిగినప్పటికీ, అన్ని పరిశ్రమలకూ వ్యాపించినప్పటికీ - పెట్టుబడిదారీ విధానంయొక్క శక్తిని ఓడించలేక పోయాయి. ఇదివరకు వలెనే యిప్పుడుకూడా పెట్టుబడిదారీ సమాజాన్ని ఆర్థిక సంక్షోభాలు ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయి. ప్రతి సంక్షోభం అంతకు పూర్వం కార్మికవర్గం సంపాదించిన విజయాలన్నిటినీ వమ్ము చేయడం చూస్తున్నాం.

ఈ అనుభవాన్ని ఆధారం చేసుకొని కార్మిక వర్గం ఆర్థిక సంక్షోభాల రహస్య మేమిటో, తన బాధలన్నిటికీ మూలమేమిటో తెలుసుకోడం ప్రారంభించింది. అంటే పెట్టుబడిదారీ సమాజం యొక్క నియమాలను తెలుసుకో నారంభించిందన్నమాట. మేధావులలో కొందరు కార్మికపక్ష మవలంబించి, ఆ వర్గానికి తోడ్పడనారంభించారు. త్వరలోనే కార్మిక వర్గం సంక్షోభాల రహస్యాన్ని తెలుసుకుంది. ఐశ్వర్యమంతా ఒకవైపు, దారిద్ర్యమంతా రెండోవైపు పోగుపడ్డానికి కారణమేమిటో అర్థం చేసుకొంది. పెట్టుబడిదారు కార్మికుణ్ణి రోజూ లేక ప్రతి వారం లేక ప్రతి నెలా కొంత కూలికి కొనుక్కొంటూంటే కార్మికుడు ఎల్లప్పుడూ తన కీయబడిన దానికంటె ఎక్కువ విలువను సృష్టిస్తాడన్న విషయాన్ని వారు తెలుసుకున్నారు. ఈ అదనపు సంపదయే పెట్టుబడిదార్ల లాభాలన్నిటికీ మూలం. కార్మికుడు తన శ్రమద్వారా ఉత్పత్తి చేసిన దానికీ, జీతం రూపంలో తాను సంపాదించినదానికీ గల వ్యత్యాసమే దోపిడీకంతకూ మూలం. అతడు సంపాదించే

రోజు కూలితో ఒక పౌను గోధుమలు లభిస్తే, యజమానికి రెండు లేక మూడు లేక నాలుగు పౌన్ల గోధుమలతో సమానమైన విలువను ఉత్పత్తి చేసి పెడుతున్నాడు. అతడు పనిచేసే గంటల సంఖ్యను బట్టి, అతడు ఉపయోగించవలసిన పరికరాల్ని బట్టి అది ఆధారపడియుంటుంది.

కార్మికుడు ఈ దోపిడీరహస్యాన్ని తన జీవితానుభవంలోనే తెలుసుకోగలిగాడు. అతడు పనిచేసే ప్రతి గంట, జీవించే ప్రతిరోజు యీ రహస్యాన్ని అవగతంచేసుకుంటూ వచ్చాడు. ఆర్థిక సంక్షోభాల ఆంతర్యమేమిటో తెలుసుకోడానికవసరమైన పరిజ్ఞానం అతనికి లభించింది. ఒకవైపు సరకులు విడుదల కాకుండా మేటలు వేస్తూంటే, రెండోవైపున కష్టించి పని చేయడానికీ ఆ సరకుల్నే కొనుక్కోడానికీ సిద్ధంగా అసంఖ్యాకమైన ప్రజలున్నారు. ఐతే కొనుక్కొనే అవకాశాలుమాత్రం వారికి లేవు. కారణమేమంటే, పెట్టుబడిదార్లు లాభంలేనిదే ఏ సరకునూ అమ్మరు; ఏ వ్యక్తినీ పనికి కుదుర్చుకోరు. ఈ పరిస్థితినుంచి బయట పడాలంటే కార్మికులు తాత్కాలికంగా తమ స్థితిగతుల్ని బాగుపరచుకోడానికే గాక, ఒక నూతన ఆశయంకొరకు – సోషలిజం కొరకు – పోరాడ్డం అవసరమని కూడ తెలుసుకుంటున్నారు. ఎందువల్లనంటే సోషలిజంలో ఉత్పత్తిసాధనాలు వ్యక్తుల సొంతఆస్తిగా ఉండవు; శ్రమజీవుల, బుద్ధిజీవుల కష్ట ఫలితం కొద్దిమంది యజమానుల ప్రైవేట్ సొత్తుగా కాక ప్రజలందరి సమిష్టి సొత్తుగా ఉంటుంది. మానవ సమాజాన్ని యీ సరికొత్త ప్రాతిపదికపై పునర్నిర్మించడమే

కార్మిక వర్గంయొక్క—కార్మిక సంఘాల, కార్మికవర్గ పార్టీల—మహదాశయం. ఈ విధంగా సామ్రాజ్యవాదం రెండు రంగాలమీద యుద్ధం చేయవలసివచ్చింది. ఒకవైపు సామ్రాజ్యవాద దేశాల్లో కార్మిక వర్గం సోషలిజం కొరకు పోరాడనారంభించింది. మరోవైపు పరాధీనదేశాల్లో ప్రజలు స్వాతంత్ర్యం కొరకు జాతీయ విప్లవోద్యమాలను నడపసాగారు.

ఇవన్నీ మనకు చాల స్పష్టంగా, తేటతెల్లంగా కనిపించవచ్చు. ఈనాడు మనకవి స్వాభావికంగానే, సవ్యంగానే కనిపించవచ్చు. కాని 40 సంవత్సరాల క్రిందట అవి అంత స్వాభావికంగా కనబడలేదు.

40 సంవత్సరాల క్రిందట మనదేశంలో "హోంరూల్" "స్వపరిపాలన" అనే శబ్దాలు సైతం నిషిద్ధములే. 1920 లో అఖిలభారత ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు స్థాపింపబడినప్పుడు "సోషలిజం," "రాజకీయ స్వాతంత్ర్యం" అనే శబ్దాలు మరీ విష్ఫూరంగా పరిగణింపబడేవి. అప్పటికీ యిప్పటికీ ఎంత మార్పు ! ఈ పురోగమనాన్ని సాధించడానికి ఎన్ని త్యాగాలు చేయవలసివచ్చింది !

ఈరోజున అన్ని ట్రేడ్‌యూనియన్లు, అన్ని దృక్పథాలకు చెందిన కార్మిక సంఘాలు రాజకీయాల్లో పాల్గొంటున్నాయి. అందరూ స్వాతంత్ర్యాన్ని కాపాడుకోడం తమ పవిత్ర ధర్మంగా భావిస్తున్నారు. అందరూ సోషలిజాన్ని తమ ధ్యేయంగా అంగీకరిస్తున్నారు. అంతర్జాతీయ ఐక్యతను,

ప్రపంచశాంతిని వాంఛించని వారంటూ దేశంలో యీరోజున లేరు. యుద్ధోన్మాదుల చర్యలను అందరూ అసహ్యించుకొంటున్నారు. మనలో ప్రతి ఒక్కరం, లేదా అధిక సంఖ్యాకులం ఏదో ఒక అంతర్జాతీయ సంస్థలో — ప్రపంచ ట్రేడ్ యూనియన్ సమాఖ్య లేదా ఐ.సి.ఎఫ్.టి.యు. —ఉన్నాం. అన్ని దేశాల ట్రేడ్ యూనియన్లు ఈ రోజున సోవియట్ యూనియన్‌కి, చైనాకు, తదితర సోషలిస్టు దేశాలకు మే దినోత్సవ సందర్భంలో సుహృద్భావ సందేశాలను పంపడం పరిపాటయింది.

ఈ విధంగా మన దేశంలో ట్రేడ్ యూనియన్ ఉద్యమం ఆశయాల, సిద్ధాంతాల విషయంలో ఒక బ్రహ్మాండమైన శక్తిగా వ్యాప్తి చెందింది.

ట్రేడ్ యూనియన్ ఉద్యమం, కార్మికోద్యమం యిట్టి సమిష్టి ఆశయాలను కలిగియుండి రోజురోజుకు అభివృద్ధి చెందుతూంటే, దాని ఐక్యతను విచ్ఛిన్నం చేస్తున్న దేది? ఆ ఆశయాల సాధనకు కార్మికవర్గం యావత్ప్రపంచంలోను, భారత దేశంలోను ఎందువల్ల ఐక్యం కాలేకపోతూంది?

## 4. వినాదాలదశనుండి ఆచరణదశకు

40 సంవత్సరాల క్రిందట సోషలిజం కేవలమొక సిద్ధాంతం మాత్రమే; ప్రచారక నినాదంమాత్రమే. ఎక్కడా అది వాస్తవరూపం ధరించ లేదు.

40 సంవత్సరాల క్రిందట వలస దేశాల స్వాతంత్ర్యం కేవల మొక ఉద్యమం మాత్రమే; ఎక్కడా అది కార్యరూపం ధరించ లేదు.

40 సంవత్సరాల క్రిందట మొదటి ప్రపంచ యుద్ధంలో సామ్రాజ్యవాదులు లాభాలకోసం ప్రపంచాన్ని తిరిగి తమలో తాము పంచుకోడానికి ఒకళ్ళగొంతు లొకరు కోసుకొంటున్న సమయంలో రష్యన్ కార్మికవర్గం విప్లవంద్వారా మొట్ట మొదటి సోషలిస్టు రాజ్యాన్ని స్థాపించింది.

40 సంవత్సరాల క్రిందట, మొదటి ప్రపంచ యుద్ధం తర్వాత ఆసియా, మధ్య ప్రాచ్య దేశాల ప్రజలు చైనా, ఇండియా, ఈజిప్టు, ఇండొనేషియా, టర్కీ మొదలైన దేశాల్లో స్వాతంత్ర్యం కొరకు బ్రహ్మాండమైన పోరాటాలు సాగించారు.

మన దేశంలో జరిగిన స్వాతంత్ర్య పోరాటాలు రక్తపు టేరుల్లో ముంచివేయబడ్డాయి. కాని సోవియట్ ప్రభుత్వాన్నెవరూ నాశనం చేయలేకపోయారు.

సోషలిస్టు రాజ్యమైన సోవియట్‌యూనియన్ కార్యకలాపాలన్నిటితోను, రాజకీయవిధానాలన్నిటితోను కొందరేకీభవించక పోవచ్చు. కాని, ప్రపంచమందలి మొట్టమొదటి సోషలిస్టు రాజ్యం స్వాతంత్ర్యం కొరకు వలస దేశాల ప్రజలు (ఉదా: చైనా, టర్కీ వగైరా) సాగించిన పోరాటా

లకు గొప్ప సహాయం చేసిందనడంలో ఎవరికీ అనుమానం లేదు. అంతేకాదు. పెట్టుబడిదారీ విధానం లేకుండానే ఆ దేశం పారిశ్రామికంగా అభివృద్ధిచెందింది; సోషలిస్టు విధానం అమలుజరుగుతూండడంవల్ల నిరుద్యోగం, ఆర్థిక సంక్షోభాలు నిర్మూలింపబడ్డాయి. కష్టజీవులకు పనిచేసే హక్కు, విశ్రాంతి తీసుకొనే హక్కు, విద్య నభ్యసించే హక్కు, సాంస్కృతికంగా అభివృద్ధిచెందే హక్కు సిద్ధించాయి. సోషలిస్టు వ్యవస్థ వాస్తవరూపం ధరించింది. వీటన్నిటినీ ప్రపంచం గమనిస్తోంది.

పెట్టుబడిదారీ విమర్శకులు దుష్టబుద్ధితో సోవియట్ యూనియన్‌లోని కొన్నిలోపాలను ఎత్తిచూపుతూన్నప్పటికీ, ఆ దేశంలో పెట్టుబడిదారీ దేశాల్లో మాదిరిగా తగినన్ని లాభాలు రావడంలేదన్న కారణంతో ఫ్యాక్టరీలను మూసివేసే మిల్లు యజమానులు లేరు; నిస్సహాయులైన కౌలుదార్లను భూమినుంచి తొలగించే భూస్వాములు లేరు; తిండికోసం, ఉపాధికోసం పొట్ట చేతబట్టుకొని తిరిగే లక్షలాది నిరుద్యోగులు లేరు.

సామ్రాజ్యవాదులు మరోసారి 1939 లో ప్రపంచ యుద్ధాన్ని తీసుకొచ్చారు; కాని మరోసారి విఫలమనోరథులయారు. సోషలిస్టు ప్రపంచం మరింత పెద్దదయింది.

అంతేకాదు. రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత వలస, పరాధీన దేశాల ప్రజలు స్వాతంత్ర్యం కొరకు మరింత తీవ్రంగా పోరాడ నారంభించారు. చైనా, ఇండియా, ఇండొనే

షియా, ఉత్తర వియత్నాం, ఉత్తర కొరియా దేశాలు, ఆఫ్రికాఖండంలో అనేక దేశాలు విదేశీ పాలనకు స్వస్తిచెప్పి దాస్యశృంఖలాలను ఛేదించుకున్నాయి. ఇంకా అనేక దేశాలు స్వాతంత్ర్యం కొరకు పట్టుదలతో పోరాడాయి. పరాధీన దేశాల ప్రజల్లో అధికసంఖ్యాకులు కార్యరూపంలో స్వాతంత్ర్యం సంపాదించుకున్నారు. ఆర్థికంగా వెనుకబడియున్న అనేక దేశాలు అంతకంతకు అధికంగా స్వాతంత్ర్యం సాధించుకోడం, కోటానుకోట్ల ప్రజలు సామ్రాజ్య వాదుల పిడికిలి నుంచి విముక్తి చెందడం వలన విధానాని కొక పెద్దదెబ్బ; మానవజాతి విముక్తికి పెద్ద తోడ్పాటు.

అయితే, ఓటమితిన్న సామ్రాజ్యవాదులు ఊరక కూర్చోరు. బాండుంగ్ మహాసభలో (1955) స్వతంత్ర ఆసియా అనే సింహం గర్జించడం చూచి వారు హడలెత్తారు. గాయపడ్డ అడవి మృగంవలె కండ్లెర్రచేసి స్వాతంత్ర్యోద్యమాలమీద ఎదురుదాడి ప్రారంభించారు. కొత్తగా కొన్ని దేశాలు సంపాదించుకున్న స్వాతంత్ర్యాన్ని అపహరించేందుకు సాయుధ పోరాటాలకుకూడా వారు తలపడ్డారు. ఉదా: బ్రిటిష్, ఫ్రెంచి సామ్రాజ్యవాదులు ఈజిప్టును తిరిగి బానిస దేశంగా చేసుకొనేందుకు జరిపిన ప్రయత్నం. బ్రిటిష్, అమెరికన్ పాలకులు మధ్యప్రాచ్యంలో లభించే నూనె గనులమీద పెత్తనం చెలాయిస్తూ లాభాలు సంపాదించడానికి గాను ఆ దేశాల రాజకీయ స్వాతంత్ర్యాన్ని అపహరించజూస్తున్నారు. సోషలిస్టు దేశాలమీద యుద్ధం ప్రకటించడానికి,

ఆసియా దేశాల ప్రజల్ని బానిస శృంఖలాల్లో బంధించడానికి వీలుగా మధ్యప్రాచ్యంలో యుద్ధ స్థావరాలను నిర్మించ యత్ని స్తున్నారు. ఆల్జీరియాకు స్వాతంత్ర్య మీయడానికి నిరా కరిస్తున్నారు. సిరియాలో యుద్ధ భీభత్సం కలిగించడానికి వారు ప్రయత్నించారు. మలయాకు స్వాతంత్ర్య మిచ్చినప్పటికీ దాన్ని తమ చెప్పుచేతల్లో ఉంచుకోవచ్చునని వారు ఆశిస్తు న్నారు. లాటిన్ అమెరికాలో అమెరికన్ సామ్రాజ్యవాదుల అడుగులకు మడుగులొత్తే నియంతృత్వ ప్రభుత్వాలను ప్రజల మీద రుద్దజూస్తున్నారు; కొన్ని దేశాల్లో వారి ప్రయత్నాలు ఫలించాయి. పోర్చుగీసువారు బ్రిటన్ అమెరికాల సహాయం తో మన గోవాను మనకీయడానికి నిరాకరిస్తున్నారు. భారత దేశం స్వతంత్ర దేశంగా ఉండడం కొందరు వలస రాజ్యాధి పతుల కిష్టంలేదనీ, వారు దాన్ని బలహీనపరచ జూస్తున్నా రనీ యీమధ్య నెహ్రూపండితుడు హెచ్చరించవలసివచ్చింది. కాశ్మీర్ సమస్యపైననో మరో సమస్యపైననో వారు ఇండి యా—పాకిస్తానమధ్య ఉద్రిక్తతను పెంచజూస్తున్నారు.

ఆల్జీరియన్ ప్రజలు వీరోచితంగా స్వాతంత్ర్య సమరం కొనసాగిస్తున్నారు. ఇండొనేషియాలో సైనిక కుట్రలను పురి గొల్పడం ద్వారాను, పశ్చిమ ఇరియన్ దీవిని కేంద్రప్రభుత్వం నుంచి లాక్కోవడం ద్వారాను ఆ దేశాన్ని విచ్ఛిన్న మొనర్చ దలచుకున్న డచ్చి సామ్రాజ్యవాదుల్ని సంఘటిత కార్మికవర్గం ప్రతిఘటిస్తోంది.

ఈ ఒక్క విషయాన్నిబట్టే వలస రాజ్యాధిపతులు శాంతియుతంగా తమ పెత్తనాన్ని వొదులుకోడానికి సిద్ధంగా లేరనీ, వలస విధానానికి వ్యతిరేకంగా పోరాడవలసిన అవసరం ఎంతో ఉందనీ స్పష్టమవుతుంది. పశ్చిమ ఇరియన్ పై ఇండొనేషియాకు గల హక్కును, ఆల్జీరియన్ ప్రజల స్వాతంత్ర్య వాంఛను భారత కార్మికవర్గం, ప్రజలు హృదయ పూర్వకంగా బలపరుస్తున్నారు. అదేవిధంగా, అమెరికన్ గుత్త పెట్టుబడిదార్ల నాయకత్వం క్రింద ఉన్న వలస రాజ్యాధి పతులకు వ్యతిరేకంగా అరబ్బు దేశాల ప్రజలు, ఆఫ్రికా ప్రజలు సాగిస్తున్న పోరాటాలను కూడా వారు బలపరుస్తున్నారు.

ఆసియా—ఆఫ్రికా దేశాల్లోని ట్రేడ్ యూనియన్లు దేశభక్తులందరి సహకారంతోను, వలస దోపిడీనివ్యతిరేకించే వారందరి తోడ్పాటుతోను ఒకరి ప్రయోజనాల నొకరు ప్రత్యక్షంగా కాపాడుకొనడం ద్వారా ఆసియా—ఆఫ్రికా దేశాల ప్రజలమధ్య గాఢమైన స్నేహ సహకారాలను పెంపొందించాలి. భారత దేశంలో అన్ని దృక్పథాలకు చెందిన ట్రేడ్ యూనియన్లు యీ ఉమ్మడి కర్తవ్యాన్ని నిర్వర్తించేందుకు కలిసి పనిచేయాలి. అఖిలభారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు యీ విషయంలో తన బాధ్యతను తాను నిర్వహిస్తుంది.

—o—

# 2.

# ఆర్థిక స్వాతంత్ర్యం కొరకు పోరాటం

## 5. తొలి చిక్కులు, సమస్యలు

బ్రిటిష్ సామ్రాజ్యవాదులు తమ హయాంలో భారత దేశాన్ని ఆర్థికంగా వెనుకబడియున్న దేశంగా, చాల బీద దేశంగా అట్టిపెట్టారు. ఈ పరిస్థితినుంచి బయటపడ్డానికి స్వతంత్ర భారతదేశం తన ఆర్థిక వ్యవస్థను అభివృద్ధి చేసుకోవలసిన అవసరం ఏర్పడింది. ఆర్థికంగా వెనుకబడియున్న దేశాలన్నీ స్వాతంత్ర్యం తర్వాతపరిష్కరించుకోవలసిన సమస్య యిది. దీన్ని పరిష్కరించడంలో కార్మికవర్గం, ట్రేడ్‌యూనియన్లు తమ కర్తవ్యాన్ని సక్రమంగా నిర్వర్తించవలసియుంది. ఎందుచేతంటే, యీ సమస్యను పరిష్కరించడంలో మనమొక సంఘటిత శక్తిగా పనిచేయకపోతే, కార్మికవర్గమూ ప్రజలూ సోషలిజంవైపు పురోగమించడం అసంభవం. దేశ స్వాతంత్ర్యమే ప్రమాద భరితంగా పరిణమించవచ్చు.

నేటి ప్రపంచంలో ఏ దేశమైనా సరే ఆర్థిక స్వాతంత్ర్యం ద్వారానే రాజకీయ స్వాతంత్ర్యాన్ని పటిష్ఠ మొనర్చకోగలుగుతుంది. లేకపోతే, రాజకీయ స్వాతంత్ర్యం నామమాత్రంగానే ఉంటుంది. ఈ విషయాన్ని మనదేశం చక్కగానే గుర్తించింది. దీన్ని పరిష్కరించడానికి మనం కృత

నిశ్చయులమైయున్నాం. కాని దురదృష్టవశాత్తు దీని పరిష్కారం అనేక చిక్కులతో నిండియుంది. మన ట్రేడ్ యూనియన్ ఉద్యమంలో అత్యంత బలీయమైన సంస్థగా రూపొందిన అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు యీ చిక్కులను దృష్టిలో ఉంచుకొని, వాటిని అధిగమించడానికి కృషిసల్పవలసియుంది.

ఈ చిక్కుల యొక్క స్వభావ మెట్టిది? వాటి మూల మేమిటి?

ప్రప్రథమంగా అన్నిచిక్కులకు మూలం విదేశీపాలకులు మన దేశాన్ని ఆర్థికంగా వెనుకబడి యుండేటట్లు చేయడం. అందుచేత యీనాడు మనముందున్న సమస్య ఆహారం, ముడిపదార్థాల ఉత్పత్తి కొరకు వ్యవసాయాన్ని అభివృద్ధి చేయడం; దేశాన్ని పారిశ్రామికంగా పెంపొందించడం.

కాంగ్రెసు ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన క్రొత్త రోజుల్లో కాశ్మీర్ పై దాడి, సంస్థానాధీశుల కుట్రలు, కాందిశీక సమూహాలరాక మొదలైన ఘటనల ద్వారా సామ్రాజ్య వాదులు మన దేశంలో అభివృద్ధి నిరోధకుల దాడులకు కేంద్రాలను సృష్టించడానికీ, తద్వారా స్వాతంత్ర్యం స్థిరపడకుండా చేయడానికీ ఎన్నో ప్రయత్నాలు చేశారు. ఈచిక్కులన్నిటితో బాటు భూస్వాములు, అభివృద్ధి నిరోధకులైన ధనవంతులు విపరీతమైన లాభాలు సంపాదించేందుకు ప్రజలకు జీవితావసర వస్తువులు లభించకుండా చేశారు; వాటి ధరలను

విపరీతంగా పెంచివేశారు. ప్రభుత్వం యీ స్వార్థపరుల సల హాలమీద ఆధారపడుతూ, కంట్రోళ్ళతో కొంతకాలం, కంట్రోళ్ళ రద్దుతో కొంతకాలం నాటకమాడుతూ వచ్చింది; ఆవిధంగా ప్రజా జీవితం తారుమారవడానికి అవకాశమి చ్చింది. ఈ ఒడుదుడుకు పరిస్థితుల్ని చక్కదిద్దడానికి రమా రమి నాలుగు సంవత్సరాలు పట్టింది.

ప్రభుత్వం ప్రణాళికా బద్ధమైన ఆర్థిక వ్యవస్థను గురించి ప్రస్తావించడం ప్రారంభించింది. దీనితోబాటు కాం గ్రెసు అనేక చోట్ల సాధారణ ఎన్నికల్లో ఘోర పరా జయాలు పొందటంవల్ల, కార్మిక వర్గం - రైతాంగం తమ హక్కుల కొరకు అభివృద్ధి నిరోధక విధానాలకు వ్యతిరేకంగా పోరాడ్డంవల్లకూడా విధానాల్లో మార్పులు సంభవించాయి. ప్రభుత్వం వెనుకబడియున్న వ్యవసాయాన్ని అభివృద్ధిచేసేం దుకుగాను భూస్వామ్య విధానాన్ని రద్దుచేసి భూసంస్కరణ లను అమలు జరుపుతామనీ, పారిశ్రామికాభి వృద్ధికి పథకాలు తయారు చేస్తామనీ వాగ్దానం చేసింది.

ప్రథమ పంచవర్ష ప్రణాళికయొక్క ఫలితాలు మనంద రికీ తెలుసు.

మొదటినుంచీ ప్రథమ పంచవర్ష ప్రణాళిక ఉద్దేశం పారిశ్రామికాభి వృద్ధికాదు. మొత్తం పెట్టుబడులలో 100 కి 33 వంతులు వ్యవసాయానికీ నీటి పారుదల స్కీములకూ

కేటాయింప బడింది; పరిశ్రమలకు, గనులకు 100కి 7 వంతులు మాత్రమే! ప్రథమ ప్రణాళికలో ఒక్క యినుము - ఉక్కు కర్మాగారం కూడా లేదు.

కొరియా యుద్ధం మూలంగా ప్రపంచంలోని పారిశ్రామిక వేత్తలందరూ పెద్ద పెద్ద లాభాలు సంపాదించడం వల్ల, దేశంలో వర్షాలు సకాలంలో కురిసి పంటలు పండడం వల్ల మొదటి ప్రణాళికా కాలంలో పరిస్థితి అసలు ఉన్న దానికంటె కొంచెం మెరుగ్గా కనిపించింది; నిజంగా లభించిన విజయాలకన్న ఎక్కువ విజయాలు లభించినట్లు కనిపించింది. మన జాతీయాదాయం 100 కి 18 వంతులు పెరిగినమాట వాస్తవమే. కాని అందులో ఎక్కువభాగం సకాలంలో వర్షాలు కురిసి పంటలు అధికంగా పండటంవల్ల, ప్రణాళికా బద్ధమైన ఆర్థిక వ్యవస్థవల్ల లభించిందే. గణనీయమైన భాగం సంఖ్యా వివరాలను నైపుణ్యంతో తయారు చేయడం వల్ల లభించింది!

ముఖ్యమైన ఫలితమేమంటే, యుద్ధకాలమంతా అమలు జరిగిన రేషనింగు రద్దుచేయబడింది. యుద్ధకాలంలో బట్టలు, పంచదార మొదలైన అనేక సరకుల ఉత్పత్తి పడిపోయింది; ఆ పరిస్థితి ప్రథమ ప్రణాళికా కాలంలో తొలగి పోయినప్పటికీ, 1939 నాటి ఉత్పత్తి స్థాయిని చేరుకొనేందుకు మాత్రమే మనం ప్రయత్నించాం. అసలే అది దారిద్ర్యానికి చిహ్నమైన సంవత్సరం. అందుచేత ఇంకా ఉన్నత

స్థాయిలో, సక్రమ మార్గంలో ప్రణాళికను రూపొందించ వలసిన అవసరం ఏర్పడింది. రెండవ ప్రణాళికలో పారిశ్రామికాభివృద్ధికి ప్రాధాన్యమివ్వాలని సూచింప బడింది.

## 6. రెండవ ప్రణాళికయొక్క ప్రధాన లక్షణాలు

పెట్టుబడుల విషయంలో రెండవ ప్రణాళిక మొదటి దానికంటె రెట్టింపు పెద్దది. మొదటి ప్రణాళిక క్రింద రు. 2,400 కోట్లు ఖర్చుపెట్టగలిగితే, రెండవదానికి రు. 4800 కోట్లు ఖర్చు నిర్ణయింపబడింది. ఇదిగాక ప్రైవేట్ పెట్టుబడుల క్రింద వేరే మొత్తాలున్నాయి. పరిశ్రమలకు, గనులకు మొదటి ప్రణాళికా కాలంలో 100 కి 7 మాత్రమే ఖర్చు చేయబడితే, రెండవదానిలో 100 కి 19 వంతులు ఖర్చుపెట్టడానికి నిశ్చయింపబడింది.

మొదటి ప్రణాళికకూ, రెండవ ప్రణాళికకూ అనేక ప్రధానాంశాల్లో భేదం ఉంది. రెండవ ప్రణాళిక దృక్పథానికి సంబంధించినంతవరకు మొత్తంమీద దేశానికి ప్రయోజనకారి అని చెప్పవచ్చు.

దాని మొదటి లక్షణం పెట్టుబడిలో పెద్ద మొత్తం ప్రభుత్వ రంగానికి వినియోగింపబడ్డం. కొత్త పెట్టుబడుల్లో అధిక భాగం ప్రభుత్వ పరిశ్రమల నిర్మాణానికి వినియోగింప బడతాయి.

రెండవ లక్షణం: ఇంతవరకు భారీఇంజనీరింగు, యంత్ర నిర్మాణం, యినుము-ఉక్కు బొగ్గుగనులు, నూనె గనుల పరి శోధన వంటి కీలక పరిశ్రమల్లోని కర్మాగారాలు చిరకాలనుంచి పూర్తిగా ప్రైవేట్ గుత్తయజమానుల, విదేశీ గుత్తాధి పతుల స్వాధీనంలో ఉన్నాయి. ఇకమీాదట యీా రంగంలో కొత్తగా స్థాపింపబడే కర్మాగారాలు ప్రభుత్వ యాజమాన్యం క్రింద ఉంటాయి.

మూడవ లక్షణం: ఈ అభివృద్ధి పథకాలకు కావల సిన వాణిజ్య సౌకర్యాలు, యంత్ర సామగ్రి, ఋణాలు సంపా దించడంలో కేవలం పాశ్చాత్య పెట్టుబడిదారీ దేశాలమీాదనే ఆధారపడ్డం ఉండదు; సోషలిస్టు దేశాలనుంచి కూడా— ముఖ్యంగా సోవియట్ యూనియన్ నుంచి-వాటిని సంపా దించడానికి ప్రయత్నాలు జరుగుతాయి.

నాల్గవ లక్షణం: భూములకు గరిష్ఠ పరిమితి నిర్ణ యించడం, వాటిని పంచిపెట్టడం లాంటి భూసంస్కరణలను అమలు జరపడం.

ఐదవ లక్షణం: దీనంతటికీ ప్రాతి పదికగా సోషలిస్టు నమూనా సమాజాన్ని స్థాపించడమే దేశంయొక్క ఆశయ మని పార్లమెంటు నిర్ణయించడం.

ఈ ఐదు లక్షణాలను హర్షించని వారెవరుంటారు? వీటిని సమగ్రంగాను, చిత్తశుద్ధితోను అమలు జరిపితే, మన

ఆర్థిక వ్యవస్థయొక్క వెనుకబాటు తనాన్నీ వలసస్వభావాన్నీ నిర్మూలించడంలో, దేశాన్ని అభివృద్ధి మార్గాన పెట్టడంలో ఒక అడుగు ముందుకు వేసిన వారమవుతాం.

## 7. రెండు తరహాల విమర్శకులు

అయితే మనం ప్రణాళికను విమర్శిస్తాం కూడా. మొదటి విమర్శన ఏమంటే, ప్రస్తుతం అధికారం చెలాయిస్తున్న కాంగ్రెసు ప్రభుత్వంలో అధిక భాగం గుత్తపెట్టుబడిదార్ల పలుకుబడి క్రింద ఉంది. అట్టి ప్రభుత్వానికి యీ అన్ని లక్షణాలను కార్యరూపంలో పెట్టగల శక్తి, కోరిక ఉన్నాయా ?

భారతీయ పెట్టుబడిదారీవర్గపు మనస్తత్వంగలిగిన, వారి ఆశలనే ప్రతిబింబిస్తున్న పార్టీ పెట్టుబడిదారీ విధానాన్ని రద్దు చేసి సోషలిస్టు చర్యల నెలా తీసుకోగల్గుతుంది ? కొన్ని కర్మాగారాలను జాతీయ మొనర్చినంత మాత్రాన అది సోషలిజం అనిపించుకోదు. నిజానికి కార్మికవర్గం యొక్క, ప్రజాస్వామ్యవాదులందరి యొక్క సాంఘిక రాజకీయ ఆధిపత్యం లేనప్పుడు అట్టి యాజమాన్యంవల్ల పెట్టుబడిదారీ విధానం అభివృద్ధిచెందడం మాత్రమే జరుగుంది.

గుత్తపెట్టుబడిదార్ల పలుకుబడి క్రింద, సారథ్యం క్రింద ఉన్న పార్టీ ఆర్థిక సహాయంకొరకు భారతదేశ దృష్టిని ఎందుకు సోషలిస్టు దేశాలవైపు మరల్చుతుంది ? తద్వారా పశ్చిమ రాజ్యాలలో చిరకాలంగా తనకు భాగస్వాములుగా ఉన్న

పెట్టుబడిదార్లతోన, వాణిజ్య వేత్తలతోను గల సంబంధాల నెందుకు ప్రశ్నించుకొంటుంది?

ఇవి సరియైన ప్రశ్నలే; అడగవలసిన ప్రశ్నలే. ఐతే, లక్షలాది కార్మికులు యిలాంటి ప్రశ్నలు అడుగుతున్నారంటే కారణ మేమిటి? రెండవ ప్రణాళికలో పై అయిదు ముఖ్య లక్షణాలు ఉండబట్టే వారు యిలాంటి ప్రశ్నలు అడుగుతున్నారు. ఆ లక్షణాలు అక్కడ ఉండడం వల్లనే, ప్రజలూ కార్మిక వర్గమూ వాటిని అమలు జరపమని డిమాండు చేయడానికి అవకాశం కలిగింది. వాటిని భగ్నం చేయదలచుకున్న వ్యక్తి ప్రజల ప్రయోజనాలను భగ్నంచేసిన వాడవుతున్నాడు. అట్టి వానిని ప్రజావ్యతిరేకిగా పరిగణించడానికి అవకాశం లభించింది.

ఐతే, ప్రణాళికను విమర్శించేది మనమేకాదు. దాన్ని కోతపెట్టాలనేవారు దేశంలో కొందరు ఉన్నారు; వారు దాన్ని గొంతెమ్మ కోర్కెల పుట్టగా చిత్రిస్తున్నారు; వారు కోరేది మొత్తం ప్రణాళిక భగ్నమవడం. ఈ విమర్శకులు మితవాద, అభివృద్ధి నిరోధక వర్గాలకు చెందినవారు.

వారు ఏ ప్రధానాంశాల్ని విమర్శిస్తున్నారు? పైన పేర్కొన్న అయిదు ముఖ్యలక్షణాలనే వారు ప్రధానంగా విమర్శిస్తున్నారు. సరిగ్గా మనం ఆహ్వానిస్తున్న వాటినే వారు ఖండిస్తున్నారు.

ఈవిధంగా, ఒక వర్గం అభివృద్ధి నిరోధకులైన గుత్త పెట్టుబడిదార్ల తరఫున, వారి విదేశీ ప్రోత్సాహకుల తరఫున ఉండి మొత్తం ప్రణాళికనే నాశనం చేయదలచుకొంటే, మన విమర్శనలు యీ విచ్ఛిన్నకులకు వ్యతిరేకంగా ప్రణాళికను బలపరచేందుకు ఉద్దేశింపబడ్డాయి.

ఈ సమస్యను అఖిలభారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు కార్యవర్గం చాలసార్లు చర్చించి, తన దృక్పథాన్ని పై విధంగా ఎట్టి అనుమానాలకు తావులేకుండా తెలియజేసింది.

## 8. విమర్శకుల దృక్పథాల్లో వ్యత్యాసం

పైన పేర్కొన్న అయిదు లక్షణాలూ ఆర్థికంగాను, రాజకీయంగాను, సామాజికంగాను ఎంత ప్రాధాన్యంకలిగి యున్నాయో యిక్కడ నేను చర్చించ నవసరంలేదు.

బర్న్‌పూర్ ఐరన్ అండ్ స్టీల్ కంపెనీ యజమానుల్లో ముఖ్యుడైన ఒక వ్యక్తి భారతదేశానికి ఉక్కు అంతగా అవసరం లేదంటూ ఆశ్చర్యకరమైన ఒక కారణం చెప్పి, ఉక్కు కర్మాగారాల నిర్మాణాన్ని వదలుకోవలసిందని ప్రభుత్వానికి బహిరంగంగా విజ్ఞప్తిచేశాడంటే, అది కాకతాళీయంగా జరిగిన ఘటనకాదు.

ఈ కంపెనీ తన కార్యకలాపాలను విస్తృత పరచుకోడానికి ప్రభుత్వంనుంచీ, అమెరికన్లనుంచీ కూడ ఋణం సంపా

దించింది. రుమేనియా, సోవియట్ యూనియన్లనుంచి నూనె గనులను త్రవ్వే బృందాలు భారతదేశంలో అడుగుపెట్టిన వెంటనే బర్మాషెల్, స్టాండర్డ్ వాక్యూమ్ కంపెనీలు క్రొత్త నూనెగనులను త్రవ్వే విషయంలోను, శుద్ధి కర్మాగారాలను నిర్మించే విషయంలోను భారత ప్రభుత్వంతో త్వరితగతిని సంప్రదింపులు సాగించడంకూడా కాకతాళీయంకాదు. అంతకు ముందు పై కంపెనీలు యిందుకు అంగీకరించకపోవడమో, చాల నెమ్మదిగా మాత్రమే పనిచేయడమో జరిగేది. భారత ప్రభుత్వం స్వయంగా బొగ్గు గనులను త్రవ్వించడానికి నిశ్చయించుకొని యంత్రాలను సప్లై చేయవలసిందని సోవియట్ యూనియన్‌ని అడిగినప్పుడు మాత్రమే బొగ్గుగనుల గుత్తాధిపతులు ఉత్పత్తిని పెంచడానికి అంగీకరించడం కూడా కాకతాళీయంకాదు. జర్మన్లు నిర్మించవలసిన రూర్కేలా ఉక్కు కర్మాగారం యిప్పటికీ నమూనాల దశలోనే ఉండిపోవడం, బ్రిటిష్‌వారు నిర్మించవలసిన దుర్గాపూర్ ఉక్కు కర్మాగారం బ్యాంకు ఋణాల కోసం ఎదురు చూస్తూండడం, రెండో వైపున సోవియట్ నిర్మిస్తున్న భిలాయ్ ఉక్కు కర్మాగారం అతివేగంగా నిర్మింపబడుతూ అనుకున్న సమయానికి ముందు పూర్తి అయే సూచనలు కనిపించడం —యివి కేవలం ద్రవ్యసంబంధమైన, సాంకేతిక సంబంధమైన విషయాలే కావు.

ఇందుకు కారణం ఒకటే. భారత దేశం ఆర్థికంగా స్వతంత్రమార్గంలో పురోగమించడం అంటేను, తమ పెత్తనం నుంచి బయటపడ్డమంటేను పెట్టుబడిదారీ దేశాలకు సుత

రామూ ఇష్టంలేదు. సోవియట్ యూనియను, తదితర సోష లిస్టు దేశాలు అలాకాదు. అవి లాభాలు సంపాదించే పెట్టు బడిదారీ దేశాలుకావు. వెనుకబడియున్న దేశాలన్నీ అభి వృద్ధి చెందడమంటే వాటికి సంతోషం. అందుకు అవి సహా యంకూడ చేస్తాయి. తత్ఫలితంగా కార్మికవర్గము, కష్టజీవు లైన ప్రజాసామాన్యము త్వరితంగా సోషలిజంవైపు, ఐశ్వ ర్యాభివృద్ధి వైపు పురోగమించవచ్చునని ఆ దేశాలు నమ్ము తాయి. కొత్తగా స్వాతంత్ర్యం సంపాదించుకున్న దేశాలు పారిశ్రామికాభివృద్ధి కొరకు, ఆర్థిక స్వాతంత్ర్యం కొరకు తీసు కునే ప్రతిచర్య సామ్రాజ్యవాదాన్ని బలహీనపరుస్తుంది; ప్రజాస్వామ్యాన్ని శాంతిని బలపరుస్తుంది; ఉత్తరోత్తరా ప్రపంచ సోషలిజానికి కూడ దోహదమిస్తుంది.

ఈవాస్తవాన్ని మితవాద విమర్శకులు గమనిస్తున్నారు. కనుకనే ప్రభుత్వ యాజమాన్యం క్రింద భారీపరిశ్రమలు అభి వృద్ధి చెందకుండా నిరోధించేందుకు వారు సకలప్రయత్నాలు చేస్తున్నారు. అతివాదవిమర్శకులు దీన్ని గమనించాలి. ప్రభుత్వరంగంలో భారీపరిశ్రమలు ఇంకా చక్కగా అభివృద్ధి చెందేందుకు సర్వవిధాలా ప్రయత్నించాలి.

## 9. పెట్టుబడిదారీదేశాల సహాయంలోని లోపం

దీని అర్థం ఇంగ్లండు, అమెరికాలవంటి పెట్టుబడిదారీ దేశాలనుంచి మనం సహాయం తీసుకోకూడదని కాదు. మన

ఆర్థిక వ్యవస్థ అభివృద్ధి చెందాలంటే, పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన అన్ని దేశాలనుంచి మనం యంత్రసామగ్రిని తెప్పించుకోవాలి. ఐతే, వలస రాజ్యాధిపతుల పెత్తనంక్రింద వెనుకబడియున్న స్థితిలో ఉంచబడిన మనదేశం ఒకేసారి ఆ యంత్రసామగ్రికి, సాంకేతిక పరికరాలకు, నిపుణుల సర్వీసుకు ధనం ఏకమొత్తంగా చెల్లించలేము. అందుచేత మనం అప్పులివ్వమని అడుగుతున్నాం.

కాని వలసరాజ్యాధిపతులు తాము నిర్ణయించిన షరతులకు అంగీకరిస్తేనే అప్పులిస్తామంటున్నారు. వారి యుద్ధకూటములలో మనల్ని చేరమంటున్నారు. మన ఆర్థిక వనరుల మీద ఆధిపత్యం కావాలంటున్నారు. క్లుప్తంగా చెప్పాలంటే, తిరిగి తమకు దాస్యం చేయమంటున్నారు.

వారి సహాయం మనకు అంతగా తోడ్పడదనడానికి మరో కారణంకూడా వుంది. వారు విపరీతమైన లాభాలను సంపాదించే దృష్టితో తమ సరకులకు సర్వీసులకు చాలా ఎక్కువ ధరలు నిర్ణయిస్తున్నారు. అంతేకాదు. మనం వారికి ధనం చెల్లించవలసి వచ్చినపుడు మనమిచ్చే రూపాయలను వారు తీసుకోరు. కారణ మేమంటే వారు మనకు సప్లైచేసే సరకులకు బదులు మనదేశంనుంచి తమకు కావలసిన సరకులు కొనుక్కొన చూస్తారు. అందువల్ల మన విదేశీ మారకం సంక్షోభంలో పడుతుంది.

మరొకవిషయమేమంటే పెట్టుబడిదారీదేశాలు మన దేశంలో భారీపరిశ్రమల నిర్మాణానికి—ముఖ్యంగా ప్రభుత్వ రంగంలో—అప్పులివ్వడానికి యిష్టపడవు. తమవద్ద విడుదల కాకుండా మిగిలిపోయిన గోధుమలు, పత్తి మొదలైన సరకులను మాత్రమే అమ్మడానికి సంసిద్ధత చూపుతారు. యంత్ర నిర్మాణ పరికరాలను ఇవ్వడానికి ఇష్టపడవు. ప్రధానంగా తమ వర్గ మిత్రులైన ప్రయివేటు పెట్టుబడిదార్లకు మాత్రమే అప్పులివ్వడానికి- అంటే ప్రయివేటు లాభాల సంపాదనకు—అప్పులివ్వటానికి ఇష్టపడతారు. ఉదా: తాతా, మార్టిన్ బర్న్, బిర్లా మొదలైనవారికి అప్పులిచ్చారు.

పై కారణాలవల్ల సోవియటు యూనియను తదితర సోషలిస్టు దేశాలనుంచి భారత ప్రభుత్వం ఋణసహాయం, తదితర విధాలైన సహాయం అర్థించవలసివచ్చింది. భారత ప్రభుత్వం చిరకాలంనుంచి పెట్టుబడిదారీ దేశాలతో వ్యాపార సంబంధాలను కలిగియుండడం వల్ల మొదట్లో సాధ్యమైనంత వరకు సోషలిస్టు దేశాలతో వర్తక సంబంధాలు పెట్టుకోకుండా దూరంగా వుండడానికి ప్రయత్నించింది. కాని పెట్టుబడిదారీ దేశాలు—ముఖ్యంగా బ్రిటను అమెరికా దేశాల బ్యాంకర్లు—మన దేశంయొక్క అభివృద్ధిని ఆటంకపరుస్తూండడంవల్ల, రెండో వైపున సోషలిస్టు దేశాలు హానికరమైన షరతులు విధించకుండా స్నేహపూర్వకమైన షరతులతో సహాయంచేయడానికి అంగీకరించడంవల్ల ఆ దేశాలు నిజాయితీతో నిజంగా వుపయోగపడేటట్లు సకాలంలో సహాయంచేస్తాయన్న విశ్వా

సం మన దేశ ప్రజలకు కలిగింది. ఈవిషయం ప్రభుత్వం, పెట్టుబడిదారీవర్గం కూడ అంగీకరించవలసివచ్చింది. అట్టి సహాయం వలసరాజ్యాధిపతుల, మితవాద విమర్శకుల ప్లానులను తల్లక్రిందులు చేస్తోంది.

## 10. ప్రణాళిక విఫలమైతే......

ఐతే రెండవ పంచవర్ష ప్రణాళిక పెద్ద చిక్కుల్లో పడిందనీ, దాన్ని సంకుచితపరచడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయనీ, మొదట్లో అనుకున్న విధంగా అది నేడు లేదనీ అందరికీ తెలుసు. ఇట్టి పరిస్థితుల్లో దాన్ని మనం ఏవిధంగా బలపరచాలి? తమ దుష్టప్రయోజనాలను ఈడేర్చుకొనేటందుకు ప్రభుత్వయంత్రాన్ని సైతం ఉపయోగించుకోగల శక్తిగలిగిన విచ్ఛిన్నకుల్ని ఎదుర్కోవడం ఎల్లాగ? (ఉదా: ముంద్రా వ్యవహారం)

ఎ.డి. ష్రాఫు అను ప్రఖ్యాత బ్యాంకరు, పారిశ్రామికవేత్త మన విదేశ మారకానికి నష్టం తెచ్చిపెట్టే దిగుమతులను గురించి ఇలా తెలియచేశాడు:

"క్రిందటి సంవత్సరం భారత ప్రభుత్వం దిగుమతులకు లైసెన్సులివ్వడంలో విచక్షణారహితమైన, అవకతవకలతో కూడిన విధాన మవలంబించడంవల్ల దేశంలో చాల ప్రమాదకరమైన పరిస్థితి ఏర్పడింది... లైసెన్సులలో వ్యాపారం ప్రారంభమైంది."

[ టైమ్సు ఆఫ్ ఇండియా: 10-12-57 ]

అయితే ష్రాఫ్ బ్యాంకరు. అందుచేత తన వర్గానికి పెత్తనం గల బ్యాంకులలో ఏమి జరుగుతోందో కూడ అత



నికి తెలిసివుండాలి. మితవాద విమర్శకుడుగా అతడు మనల్ని నేర్చుకోమంటున్న గుణపాఠమేమిటో చూద్దాం:

"ఏ సిద్ధాంతంమీద ప్రణాళిక అంతా ఆధారపడివుందో అది — అనగా సోషలిస్టు తరహా సమాజస్థాపన—చూడ్డానికి మాత్రమే అందంగా వుంటుంది తప్ప ఉపయోగంమాత్రముండదని ఈపాటికి ప్రణాళికాకర్తలూ, దాన్ని బలపరచేవారూ గుర్తించివుండాలి."

[ టైమ్సు ఆఫ్ ఇండియా: 10–12–57 ]

కాని దాన్ని నిరుపయోగంచేస్తున్నది ప్రాఫ్ వర్గానికి చెందిన వారేనని మనం మరచిపోకూడదు !

మనమొక విషయం జ్ఞాపకముంచుకోవాలి. ప్రణాళిక భగ్నమవడంవల్ల నష్టపడేది పాలకవర్గపార్టీయేకాదు. మొత్తం దేశానికే అపారమైన నష్టం కలుగుతుంది. అది భగ్నమైతే అందుకు రాజకీయ బాధ్యత అధికారంలో వున్న కాంగ్రెసు పార్టీదే అవుతుంది. ఇందులో సందేహ మేమీలేదు. కాని బాధలుమాత్రం అనుభవించవలసింది అందరూను. బహుశా కొన్ని అతివాద పార్టీలకు దాని వైఫల్యంవల్ల కొంత లాభం కలుగవచ్చు. కాని గుత్తపెట్టుబడిదారుల్ను ప్రజల ప్రయోజనాలకు వ్యతిరేకంగా చేసే కుట్రలను మనం ఓడించి ప్రణాళిక యొక్క అత్యంత ప్రయోజనకరమైన, కీలకమైన అంశాలను కాపాడగలిగితే, అంతకన్న ఎక్కువలాభం పొందగల్గుతాం.

నేడు మన ఆర్థిక వ్యవస్థ ఎందువల్ల సంక్షోభంవైపు ప్రయాణం చేస్తోందో ఆ కారణాలన్నిటిలోకి వెళ్ళేందుకు



మనకు వ్యవధిలేదు. ఈ చిక్కులు అభివృద్ధిని సూచిస్తున్నాయనీ, అందుచేత మంచివేననీ కొందరు అభిప్రాయపడుతున్నారు. ఈ చిక్కులకు దారితీస్తున్న ప్రధాన కారణాలను పరిశీలిద్దాం.

## 11. అభివృద్ధిని ఆటంకపరిచే శక్తులు

ప్రణాళికా కర్తలు చేస్తున్న ముఖ్యమైన ఫిర్యాదు ఏమిటంటే విదేశాలనుంచి అప్పులరూపంలో వస్తుందనుకున్న పెట్టుబడి ధనం రావడంలేదని; వస్తూన్నదాని విలువ పెరిగిపోయిందని. ప్రణాళికకు ఎంతో అవసరమైన ఈ దిగుమతులలో కొన్నిటిని భర్తీ చేయగల ఎగుమతుల ఖరీదు, వాటి ప్రమాణం తగ్గిపోతున్నాయి. అందుచేత ఎన్నో విద్యుచ్ఛక్తి స్కీములు, రవాణా స్కీములు, ఎరువుల ఫ్యాక్టరీలు మొదలైన వాటిని తగ్గించుకోవలసి వచ్చింది. ఇదివరకే ప్రారంభింపబడినవి మాత్రం కొనసాగుతాయి.

విదేశీ వనరుల విషయంలో ఒకవిషయం ప్రజలకు స్పష్టంగా తెలియజేయబడటంలేదు. అదేమంటే, ఆంగ్లో అమెరికన్ కూటమికి చెందిన దేశాల నుంచి సహాయం ఆశించినంతగా రావడంలేదు; వచ్చింది అస్తవ్యస్తంగా, సరియైన ప్లానుగాని కంట్రోలుగాని లేకుండా వినియోగింపబడుతూంది; ప్రైవేటు రంగంలోని గుత్త పెట్టుబడిదారులు ఆ యా శాఖలకు సంబంధించిన మంత్రుల ప్రత్యక్ష సహాయంతో ఆంగ్లో

అమెరికన్ కూటమియొక్క సహాయాన్ని విస్తారంగా పొందుతున్నారు. ప్రణాళికాసంఘం తన సమీక్షలో ఇలా తెలియచేసింది :

"1955_56 లో దిగుమతుల విలువ రు. 751 కోట్లు వుంటే, 1956_57 లో రు. 1077 కోట్లకు పెరిగింది. ...దిగుమతులలో ఈ పెరుగుదల ప్రభుత్వ రంగంలోను ప్రయివేటు రంగంలోను కూడ కనిపిస్తోంది. ప్రభుత్వ రంగంలో దిగుమతులు 1955_56లో రు. 139 కోట్లు వుంటే 1956_57 లో రు. 281 కోట్లకు పెరిగింది. ప్రయివేటు రంగంలో రు 612 కోట్ల నుంచి రు 796 కోట్లకు పెరిగింది."

ఇక్కడ మనం గుర్తించవలసిన విషయ మేమంటే, ప్రణాళికలో ప్రభుత్వరంగంమీద పెట్టుబడులను అంతకంతకు అధికంగాను త్వరితంగాను వినియోగించవలసియుండగా, ప్రయివేటురంగంలో దిగుమతులు ప్రభుత్వరంగంలోకన్న ఎక్కువయాయి. రెండవది: ప్రభుత్వరంగంలో దిగుమతులు రు. 281 కోట్ల వద్ద తారట్లాడుతూండగా, ప్రయివేటు రంగంలో దిగుమతులు రు. 796 కోట్లకు పెరిగాయి. ప్రభుత్వ రంగలో అధికభాగం రక్షణశాఖకు సంబంధించిన నౌకలు, ఆయుధాలు, విమానాలు మొదలైనవేనని జ్ఞాపక ముంచుకుంటే, ఉత్పత్తి కార్యాలకు ఉపయోగపడే దిగుమతులవిలువ ఇంకా తక్కువగా వుంటుందని సులభంగా తెలుసుకోవచ్చు.

దీన్నిబట్టి మన విదేశీమారకం ప్రభుత్వ రంగంకన్న ప్రయివేటు రంగానికే ఎక్కువగా ఉపయోగపడుతూందని

స్పష్టంకాగలదు. దీని అర్థం ప్రయివేటు రంగంయొక్క ఏ కార్యకలాపాలూ ప్రణాళికకు తోడ్పడ్డం లేదని కాదు; వెను వెంటనే ప్రయివేటు రంగాన్ని పూర్తిగా నిర్మూలించాలని కూడ కాదు. ఈనాడు పెట్టుబడిదారీ ప్రయివేటు రంగం ఎంత బలంగా వుందో, ప్రభుత్వరంగం ఎంత బలహీనంగా వుందో తెలుసుకోడానికి మాత్రమే ఇది సహాయకారి కాగలదు.

కనుకనే భారత ప్రభుత్వంయొక్క ఆర్థిక మంత్రి ఈ మధ్య ప్రభుత్వ పరిశ్రమలకు ఋణాలను సంపాదించే ఉద్దేశం తో విదేశాలకు వెళ్ళినప్పుడు ప్రయివేటు రంగంలోవున్న పరి శ్రమలకు చాలా సహాయం చేసే ఒప్పందాలతో తిరిగి వచ్చాడు. అతడు ప్రభుత్వరంగానికి అన్యాయం చేశాడని, ప్రయివేటు రంగాన్ని కాపాడాడని కొందరు వ్యాఖ్యానిం చారు కూడ.

ప్రయివేటు రంగానికిచెందిన పరిశ్రమల్లో 1955–56 లో రు. 85 కోట్లు, 1956–57 లో రు. 160 కోట్లు పెట్టుబడి అదనంగా లభించింది. 1957–58 లో 270 కోట్ల రూపాయలు లభిస్తుందని ప్రణాళికాసంఘం తన సమీక్షలో తెలియజేసింది. గోప్యంగావుంచబడిన పెట్టుబడులు ఈ లెక్కలలోకి రావు.

## 12. ప్రజా ద్రవ్య అపహరణ

విదేశీ గుత్త పెట్టుబడిదారుల తరువాత ప్రయివేటు రంగానికి చెందిన దేశీయ పెట్టుబడిదారులు ప్రణాళికను ఆటంక

పరుస్తూ, ప్రజల్ని అనేకబాధలకు లోనుచేస్తున్నారు. వారు పన్నులరూపంలో ప్రభుత్వానికి ఏటా చెల్లించవలసిన వందల కోట్ల రూపాయలు చెల్లించకుండా ఎగవేస్తున్నారు. ఇటు ప్రభుత్వం ధనికులైన పన్ను ఎగవేతగాండ్ర మీద దాడిచేయకుండా, లోటును భర్తీచేసి ప్రభుత్వానికి ధనం సమకూర్చేటందుకు ప్రజలమీద అధికంగా పన్నులు విధిస్తోంది. ఇలా వచ్చే ధనంలో చాలభాగం మళ్ళీ యీ పన్ను ఎగవేతగాండ్రకే చేరుతూంది. పెట్టుబడిదారులుచేసే చట్టా వ్యాపారంవల్ల, అధిక లాభాలకోసం సరకుల ధరలను పెంచుతూండడంవల్ల అధిక సంఖ్యాకులైన జనసామాన్యం బ్రతుకు దుర్భరమవుతూంది. వారి జీవనవ్యయ ప్రమాణం హెచ్చిపోతూంది. ప్రజల ధనాన్ని వారు కొల్లగొట్టుకుంటున్నారు. ఉదాహరణకు టాటాకంపెనీ నడుపుతూన్న రైలు ఇంజన్ల ఫ్యాక్టరీలో ఇంజన్ల ధరలు పెంచబడ్డాయి. జీవిత భీమానిధుః ముంద్రా కంపెనీ షేర్ల కొనుగోలులో దుర్వినియోగమయ్యాయి. ఇండియన్ ఫైనాన్సు కార్పొరేషన్, సోనేపూరు గ్లాసుపరిశ్రమ, నేపా కాగితపు మిల్లు మొదలైన సంస్థలలో అనేక కుంభకోణాలు జరిగాయి. భాక్రా నంగల్ డామ్‌కి సంబంధించిన సామాగ్రి అపహరింపబడినప్పటికీ, బొంబాయి ప్రభుత్వపు గొట్టపు బావుల స్కీము విఫలమైనప్పటికీ నేరస్తులు శిక్షింపబడ లేదు. ప్రయివేటు పరిశ్రమలు దేశశ్రేయస్సుకోసం పాటుబడాలంటే యిలాంటి అనివార్యమైన కొన్ని ఘటనలు జరగక తప్పదంటూ కొందరు సంజాయిషీ కూడ చెబుతున్నారు.

ముంద్రా షేర్ల కొనుగోలులో జరిగిన కుంభకోణం వంటివి ఇంగ్లండులాంటి బూర్జువా ప్రజాస్వామ్య దేశాల్లో జరిగినప్పటికీ, మంత్రి వర్గం తప్పక కూలిపోయి వుండేది. కాని మన దేశంలో కొందరు మంత్రులు పార్లమెంటులో ఉపన్యసిస్తూ ఆ ఘటనను చాల తేలికగా నవ్వివా రేశారు. (ఈ వాక్యాలు వ్రాసే నాటికి ఛాగ్లా కమిషన్ యింకా నియమింపబడలేదు -రచయిత) సోషలిజం అంటేను, సంఘశ్రేయస్సు అంటేను, ప్రణాళిక అంటేను వారికెంత అభిమానముందో పైవాటినిబట్టి తెలుసుకోవచ్చు.

## 13. భూసంస్కరణలు పూజ్యం

నేటి పరిస్థితిలోని మూడవ ప్రమాదం ఆహారధాన్యాల సప్లై తగినంతగా లేకపోవడం. ఇందుకు ప్రధాన కారణం అనుకోని తలంపుగా వరదలు రావడం, వర్షాలు కురియకపోవడం వంటి ప్రకృతి విపత్తులేనని ప్రభుత్వం చెపుతోంది. ఇది పాక్షిక సత్యం మాత్రమే. కాని పెద్ద పెద్ద పెట్టుబడిదారీ వ్యాపారస్తులు, బియ్యం మిల్లుల యజమానులు, భూస్వాములు ప్రజల బాధలను, ఆహార ధాన్యాల కొరతను ఆధారం చేసుకొని విపరీతంగా ధనార్జన చేయడంలేదా? ఇది కూడ ప్రకృతి విపత్తేనా? ప్రభుత్వం పరిస్థితియొక్క ప్రమాదాన్ని తెలుసుకునేటట్లు చేయడానికి ప్రజలు ఎన్నో ఆకలి యాత్రలు చేయవలసివచ్చింది; ఎందరో చనిపోవలసివచ్చింది. 1957 బడ్జెటు సమావేశం ప్రారంభమయ్యేముందు పార్లమెంటులో

ప్రభుత్వ సభ్యులు ప్రమాదకర పరిస్థితులు లేవనీ, ప్రజలు ఎక్కువ తిండి తింటూండడంవల్ల జీవన ప్రమాణాలు పెరగడం వల్ల మాత్రమే కొరత ఏర్పడిందనీ సిగ్గులేకుండా సంజాయిషీలు చెప్పారు. ప్రభుత్వం అనుసరిస్తున్న సోషలిస్టు సిద్ధాంతం ఈ విధంగా వుంది! ప్రధానమైన వైఫల్యం వర్షాభావంకాదు. రైతులకు వాగ్దానంచేసిన భూసంస్కరణలను అమలుజరపక పోవడం, భూములనుంచి వారిని వెళ్ళగొట్టకుండా రక్షణ ఇవ్వ లేకపోవడం, సహకార వ్యవసాయ సంస్థల నిర్మాణానికి పెట్టు బడులు సాధన సామగ్రి ఇచ్చి తోడ్పడకపోవడం, పన్నుల భారం తగ్గించకపోవడం, చట్టా వ్యాపారులనుంచి పెట్టుబడి దారీ మార్కెట్లునుంచి నిరంకుశాధికారులనుంచి వారిని కాపాడకపోవడం — ఇవే ప్రధాన కారణాలు. సమగ్రమైన భూసంస్కరణలను అమలుజరపనిదే కమ్యూనిటీ డెవలప్ మెం టును గురించి పెద్ద పెద్ద కబుర్లు చెప్పడంవల్ల ఆహార సమస్య పరిష్కారంకాదు. అదే ప్రధాన పరిష్కార మార్గం అయిన ట్లైతే, 1957 జూన్ నాటికి ఆస్కీము క్రిందికి 2,96,000 గ్రా మాలు, 17 కోట్ల 20 లక్షల ప్రజలు వచ్చారని రు. 74 కోట్లు ఖర్చుచేయబడ్డాయని చెప్పే రిపోర్టులనుబట్టి ఆహార సమస్య గణనీయంగా పరిష్కారమైనట్లే భావించుకోవలసి వస్తుంది. కాని అలా జరగలేదు. ట్రేడ్ యూనియన్లు రైతులతో చేతులు కలిపి ప్రభుత్వంలోని పెట్టుబడిదారీ భూస్వామ్య వర్గా లచే నిరోధింపబడుతూన్న భూసంస్కరణల కొరకు కృషిచేయ వలసియుంది. భూసంస్కరణలను అమలుజరిపే అధికారం

రైతు సంఘాలకు ఇవ్వకపోతే, ఆ అధికారాలను గ్రామ సీమల్లోని ధనికవర్గం కాజేయకుండా ప్రభుత్వం రక్షించకపోతే, భూసంస్కరణలు కేవలం నామమాత్రంగానే ఉండిపోతాయి; కొద్ది ప్రాంతాల్లో కొంత ఉపయోగం కలిగినా, విస్తారంగా యివ్వబడు గ్రాంట్లవల్ల కొద్దిమంది వ్యక్తులు ధనవంతులు కావడానికి మాత్రమే అవి ఉపయోగపడతాయి.

ప్రణాళికా సంఘం తన సమీక్షలో ఇలా తెలియజేసింది.

"మొదటి ప్రణాళికా కాలంలో దేశంలో మొత్తంమీద పెద్ద ప్రాజెక్టులవల్ల, మధ్యరకం ప్రాజెక్టులవల్ల అదనంగా 63 లక్షల ఎకరాల భూమిని సాగులోకి తీసుకురావచ్చు ననుకొంటే, 40 లక్షల ఎకరాలు మాత్రమే అదనంగా సాగులోకి వచ్చాయి. ముఖ్యంగా బీహారు, బొంబాయి, యు.పి, పశ్చిమ బెంగాలు రాష్ట్రాలలో ఇరిగేషను సౌకర్యాలను అనుకున్న దానికంటె తక్కువగా వినియోగించుకోవడం జరిగింది. ఇందుకు వేర్వేరు కారణాలున్నాయి. మనం నేర్చుకోవలసిన ప్రధాన గుణపాఠం ఏమంటే ఇరిగేషను సౌకర్యాలను త్వరితంగా ఉపయోగించుకొనేందు కవసరమయే చర్యలకు ప్రభుత్వం ఇంకా ప్రాధాన్యం యివ్వాలి. 1955-57 లో ఫలితాలు హీనంగా వున్నందున వీటికి మరింత ప్రాధాన్యం యివ్వవలసి యుంటుంది. రెండవ పంచవర్ష ప్రణాళికలో 120 లక్షల ఎకరాల భూమిని సాగులోకి తీసుకురాగల అవకాశం ఏర్పడుతుందని అంచనా వేయబడింది. ఇందులో 22 లక్షల ఎకరాలను 1956-57 లో సాగులోకి తీసుకురావచ్చునని ఆశిస్తే 6½ లక్షల ఎకరాలు మాత్రమే (బొంబాయి, కాశ్మీరు తప్ప) అదనంగా సాగులోకి వచ్చాయి."



ట్రేడ్ యూనియన్లు ఈ సమస్యపై ప్రత్యక్షంగా శ్రద్ధ తీసుకోవలసిన అవసరం ఉంది. కారణం ఏమంటే ఆహార రంగంలో సంభవించే ప్రతి వైఫల్యం వెంటనే ధరలపైన ప్రభావం కలుగజేస్తుంది. తత్ఫలితంగా మన జీతాల విలువ పడిపోతుంది.

# 14. నిరంకుశాధికారవర్గం, దాని పాత్ర

నాల్గవ అడ్డంకి రాజ్యాంగ యంత్రంలోని నిరంకుశాధికారవర్గం పెత్తనంచేయడం, ప్రజలకు నిజమైన నిర్వాహణాధికారం లేకపోవడం. ప్రణాళికను అమలుజరపవలసిన బాధ్యత అంతా ఉద్యోగబృందానికే వదలివేయబడింది. అప్పుడప్పుడు వారు ప్రజల "సహకారాన్ని" కోరుతూన్నట్లు, ప్రజా ప్రతినిధులతో "సంప్రతిస్తూన్నట్లు" నటిస్తూంటారు. నిరంకుశాధికార బృందంలో కొందరు మంచివాళ్ళు దేశాభిమానులు ఉన్నారు. వారు స్వాతంత్ర్యం తరువాత దేశంయొక్క ఆర్థికవ్యవస్థను అభివృద్ధిచేయడానికి కుతూహల పడుతూంటారు. కాని కొద్దిమంది వ్యక్తుల మంచితనంవల్ల ప్రజల చొరవ వృద్ధిచెందదు. ప్రజలు చొరవచేసుకోనిదే పెట్టుబడిదారీ భూస్వామ్య వర్గాల పలుకుబడి ఎక్కువ ప్రబలంగావుంటుంది. వారు స్వప్రయోజనాల కొరకు రాజ్యాంగ యంత్రాన్ని వినియోగించుకుంటారు. క్రిందినుంచి ప్రజల చొరవ లేకపోవడంవల్ల, నిరంకుశాధికారుల చర్యలను ప్రభుత్వం బలప్రయోగం ద్వారాను, శాసననాల ద్వారాను రక్షిస్తూండడం వల్ల అవినీతి అభివృద్ధిచెందుతూంది;

ప్రభుత్వం పోలీసు ప్రభుత్వంగా వ్యవహరిస్తుంది. ఇందువల్ల అభివృద్ధి ఆగిపోతుంది; ప్రజల అవసరాలు తీరవు.

## 15. ట్రేడ్‌యూనియన్ల కర్తవ్యం

ఈ ఆటంకాలను అధిగమించడం ఎలాగు? ఈవిషయం లో ట్రేడ్ యూనియన్ల కర్తవ్యం ఏమిటి ?

మొట్టమొదట ట్రేడ్‌యూనియన్లు నేటి పరిస్థితి యొక్క అవసరాల్ని ప్రజలకు తెలియజెప్పడం మీద తమ దృష్టిని కేంద్రీకరించాలి. కాంగ్రెసు పార్టీచే నడుపబడుతున్న ట్రేడ్‌యూనియన్లు పంచవర్ష ప్రణాళికను గురించి, అది సాధించిన విజయాలను గురించి స్తోత్రపాఠాలు పాడుతూంటాయి. ప్రజల్ని కాంగ్రెసు ప్రభుత్వం వెనుక, దాన్ని బలపరచే వర్గాల వెనుక సమీకరించడానికి పనిచేస్తూంటాయి. ఈ విధంగా కార్మికజన సామాన్యం తమ హక్కులను, ప్రజల హక్కులను రక్షించేందుకు తీసుకోవలసిన చొరవను నిరోధిస్తాయి.

కొన్ని ట్రేడ్ యూనియన్లు మొత్తం ప్రణాళిక లేదా కొన్ని లోపభూయిష్టమైన భాగాలు పెట్టుబడిదారుల కుట్ర మాత్రమేనని, ప్రజల్ని మోసపుచ్చేందుకే అవి ఉద్దేశింపబడ్డాయని ఖండించి ఊరుకుంటాయి. ఇది అతివాద పదజాలంచాటున వ్యక్తమయే ఒకపాక్షికమైన అవాస్తవికధోరణి. ఇది మితవాద అభివృద్ధి నిరోధకులకు చక్కగా ఉపయోగ

పడుతుంది. ప్రజాబాహుళ్యం ఖచ్చితమైన లాభాలు పొంద కుండా చేసేందుకు వారి చోరవను వక్రమార్గంలో పెడుతుంది.

అఖిలభారత ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసుకు అను బంధింపబడిన యూనియన్లన్నీ ఈ రెండు ధోరణులను నిరాక రించవలసియుంది. పంచవర్ష ప్రణాళికను విదేశీ గుత్తపెట్టుబడి దారుల, దేశీయ గుత్తపెట్టుబడి దారుల, రాజ్యాంగ యంత్రంలో వారి ప్రతినిధుల విచ్ఛిన్న చర్యలనుంచి కాపాడ్డం, దాన్ని జయప్రదంగా అమలు జరపడం ఎంతో అవసరమని ప్రజలకు మనం తెలియచెప్పవలసియుంది. ఈ బాధ్యతను మనం సక్రమంగా నెరవేర్చాలి.

ఈ సందర్భంలో మనం విదేశీ నూనె కంపెనీ యజ మానుల, తేయాకుతోటల యజమానుల, బొగ్గుగని యజ మానుల చర్యలను బహిర్గతం చేయవలసిన అవసరంవుంది. ప్రభుత్వం ఈ వలసదోపిడీదార్లతో చేసుకొనే ప్రతిఒప్పం దాన్ని, మనఆర్థిక వ్యవస్థను బలహీనపరచేటందుకు బలవం తంగావారు రుద్దే ప్రతిషరతును ప్రజలముందు మనం బహి రంగమొనర్చాలి. ఆ సంస్థలను జాతీయమొనర్చాలని లేదా వాటిగుత్తాధికారాల్ని అదుపులోపెట్టాలని డిమాండుచేయాలి. ఈ కర్తవ్యాన్ని మనం మొత్తం జాతీయప్రయోజనాల్ని దృష్టిలోవుంచుకుంటూ మనవలస వ్యతిరేకపోరాటంలో భాగం గా నిర్వర్తించాలి.

ప్రభుత్వ నిధులు అపహరింపబడకుండా మనం జాగరూకత వహించాలి; అవినీతిచర్యలను అరికట్టాలి. ప్రభుత్వరంగానికి చెందిన ఆస్తి మొత్తం ప్రజలందరి జాతీయ సొత్తు; అందుచేత దానిని ఎవరూ అపహరించకుండా కాపాడాలి.

ముఖ్యంగా ప్రభుత్వరంగంలో మనం సర్వీసు నిబంధనల ప్రకారం నైపుణ్యంతో పనిచేయవలసి వుంటుంది. ప్రభుత్వరంగానికి చెందిన ఆర్థిక వ్యవస్థ యింకా సోషలిస్టు ఆర్థికవ్యవస్థగా మారకపోయినప్పటికీ, ప్రజలనుంచి వసూలుచేయబడిన ధనంనుంచి, ప్రజాధనంనుంచి అది నిర్మింపబడింది. ప్రభుత్వరంగంలోని అదనపు ధనంలో ఒకభాగం కొద్దిమంది ధనికుల ప్రైవేట్ డివిడెండ్లకు ఉపయోగింప బడుతున్నప్పటికీ, కార్మికులు తమ అసమ్మతిని ప్రకటించినప్పుడు లేదా తిరుగబడే చిహ్నాలు కనిపించినప్పుడు రాజ్యాంగయంత్రం బలప్రయోగం ద్వారా వారిని అదుపులోఉంచి పెట్టుబడిదార్లు చెప్పినట్లల్లా చేసేటట్లు ఒత్తిడిపెడుతూన్నప్పటికీ ప్రభుత్వరంగంలోని అదనపు ధనమంతా పూర్తిగా ప్రయివేట్ డివిడెండ్లకే వినియోగింపబడ్డంలేదు. అలాంటప్పుడుకూడా, ప్రభుత్వరంగాన్ని పార్లమెంటరీ కంట్రోలులో ఉంచినప్పుడు ఆ అదనపు ధనాన్ని పన్ను తగ్గింపు, విద్య, ప్రజలందరి స్థితిగతులను చక్కపరచడం మొదలైన వాటికి వినియోగించేటట్లు చేయవచ్చు. మన అదనపు శ్రమ ప్రభుత్వానికే చెందుతుంది. అందుచేత మనం దాన్ని పన్నులనుంచి మినహాయించాలని, యింకా విస్తృత

మొనర్చాలనీ, యితరవిధాలైన సౌకర్యాలను కలుగజేయా లని గట్టిగా డిమాండుచేయవచ్చు.

ట్రేడ్‌యూనియన్ కార్యకర్తలు ప్రయివేటు రంగంలోను ప్రభుత్వ రంగంలోను కూడ పరిశ్రమలకు సంబంధించిన ద్రవ్యవిధానాన్ని, సాంకేతికవిద్యను నేర్చుకోవలసియుంది. లేనిచో వారు వర్క్సుకౌన్సిళ్లు, ట్రేడ్‌యూనియన్ కమిటీలు, పార్లమెంటుకమిటీల వంటి ప్రజాస్వామ్యసంస్థలద్వారా ప్రభుత్వరంగానికి చెందిన పరిశ్రమల నిర్వహణలో పాల్గొనడంగాని, తెలివితేటలతో పరిశీలనలు జరపడంగాని అసాధ్యమౌతుంది.

ఉదాహరణకు పెద్దపెద్దకర్మాగారాలలో మన ట్రేడ్‌యూనియన్లు సమిష్టికార్యాచరణ ద్వారా ఆహారధాన్యాల పంపకం, గృహనిర్మాణంవంటి సమస్యలను నిపుణతతో పరిష్కరించగలగాలి.

మనదేశంలో ట్రేడ్‌యూనియన్లు పంచవర్ష ప్రణాళిక విషయంలోను, ఆర్థికవ్యవస్థ విషయంలోను, విదేశీ స్వదేశీ గుత్తపెట్టుబడిదార్లతో జరపవలసిన పోరాటం విషయంలోను నిర్వర్తించవలసిన కొన్ని స్థూలమైన కర్తవ్యాలను సూచించడానికి నేను ప్రయత్నిస్తున్నాను.

# 16. పార్లమెంటులో ట్రేడ్‌యూనియన్ ప్రతినిధులు

ఈ కర్తవ్యాన్ని నిర్వర్తించడంలో ట్రేడ్‌యూనియన్లు ఈ రోజున పార్లమెంటులోను, రాష్ట్రశాసన సభల్లోను ఒక విశిష్టస్థానాన్ని, పలుకుబడిని సంపాదించాయి. గతఎన్నికలలో వివిధదృక్పథాలకు, సంస్థలకు చెందిన ట్రేడ్‌యూనియను నాయకులు పెద్దసంఖ్యలో ఎన్నుకోబడ్డారు. అఖిలభారత ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు పార్లమెంటులో 9 స్థానాలు, రాష్ట్రశాసనసభల్లో 32 స్థానాలు సంపాదించ గలిగింది. వీరంతా ప్రజల తరఫున, కార్మికవర్గం తరఫున పైన వివరించినట్లు ప్రభుత్వ విధానాలను విమర్శిస్తూ వచ్చారు. అ. భా. ట్రే. యూ. కాం., హింద్‌మజ్దూర్ సభ, స్వతంత్ర ట్రేడ్‌యూనియన్ సంస్థలు కలిసి శాసన సభల్లో ఉమ్మడి ప్రతిపాదనలను, విమర్శనలను రూపొందిస్తున్నాయి. వాయిదా తీర్మానాలు, ప్రశ్నలు, స్వల్పవ్యవధి చర్చలు, బిల్లులకు సవరణలు, తీర్మానాలు మొదలైనవాటి ద్వారా వారు కార్మికవర్గ దృక్పథాన్ని ట్రేడ్‌యూనియన్ల అభిప్రాయాలను యావద్భారత దేశానికి తెలియచేస్తున్నారు. మనం ఈ రోజున సంతోషంగా చెప్పుకోగల విషయం ఒకటుంది. ఒక రాష్ట్రంలో ఏర్పడ్డ ప్రభుత్వం—దాని అధికారాలెంత పరిమితమైనప్పటికీ—ప్రజలయొక్క, ట్రేడ్‌యూనియన్లయొక్క ప్రజాతంత్ర కోర్కెలను త్వరితంగాను, సక్రమంగాను ఈడేరుస్తోంది. ఈ

పార్లమెంటు రంగంలో మనం ఇంకా ఎక్కువ విజయాలు సంపాదించడానికి ప్రయత్నిద్దాం.

పైన పేర్కొన్న కర్తవ్యాలు కార్మికులలో కొంత విముఖత కలిగించవచ్చు. కారణమేమంటే మన ఆర్థిక విధానం యొక్క ప్రస్తుత దశలో అన్ని తరగతుల దోపిడీదారులు — ప్రయివేటు రంగానికి చెందినా పబ్లిక్ రంగానికి చెందినా — వాటిని తీవ్రంగా ఎదుర్కోవడం కనిపిస్తూంది. కార్మికులు తమ పని పరిస్థితులను, జీవిత పరిస్థితులను కాపాడుకోవడానికి తమ జీవితంలో ప్రతి నిమిషం పోరాడవలసిన అవసరం ఏర్పడుతూంది. ఆర్థిక వ్యవస్థ అభివృద్ధి చెందుతూన్నప్పుడు కూడ, దేశ సంపద పెట్టుబడిదార్ల లాభాలు హెచ్చుతూన్నప్పుడు కూడ కార్మికులకు న్యాయంగా రావలసిన భాగం నిరాకరింపబడుతూంది. అందుచేత వారు పంచవర్ష ప్రణాళికపట్ల ఉత్సాహం చూపలేకపోతున్నారు. ప్రభుత్వం కార్మికులఎడ అభివృద్ధికరమైన విధానం అవలంబిస్తున్నామని చెప్పుకుంటుందేకాని కార్మికులు కోరిన చిన్న చిన్న కోర్కెలను సహితం యిష్టపూర్వకంగా, స్వచ్ఛందంగా ఈడేర్చడం లేదు. ప్రతిసారి బలమైన ఒత్తిడి తీసుకురావలసి వస్తూంది. అయినప్పటికీ, ప్రణాళిక మూలంగాను ప్రపంచ పరిస్థితులవల్లను ఉత్పత్తి పెరుగుతూంది. తత్ఫలితంగా ట్రేడ్ యూనియన్లు ముందుకు పోగలుగుతున్నాయి; కొన్ని విజయాలను సాధించగలుగుతున్నాయి. ఇదివరకు కన్న ఎక్కువ అనుకూలమైన

స్థానాలను ఆక్రమించగలుగుతున్నాయి. ఈవిషయంలో వాటి స్థానం ఎట్టిదో పరిశీలిద్దాం.

## 17. సరియైన సంఖ్యావివరాల కొరత

పరిశ్రమల అభివృద్ధి విషయంలో తన ఆర్థిక విధానపు విజయానికి కొలబద్దగా పెట్టుబడులను, ఉత్పత్తిని తీసుకోవలసిందని ప్రభుత్వం ప్రజల్ని అడుగుతుంది. పెట్టుబడి దారుల దృష్టిలో ఈ కొలబద్ద వారు సంపాదించే లాభాలు. కార్మికులమైన మనం ఉత్పత్తి, లాభాలు, ధరలు పెరుగుతూన్న పరిస్థితుల్లో మనకు ముట్టే వేతనాలనుబట్టి, మనం మోయవలసిన పని భారాన్ని బట్టి దీనిని అంచనా కడతాం. వేతనాలకు, పనికి సంబంధించిన సమస్యలు మన జీవితంలో అత్యంత ప్రధానమైన సమస్యలు. వాటియెడల ట్రేడ్‌యూనియన్లు చాల శ్రద్ధవహించవలసియుంది.

గత ఏడు సంవత్సరాల్లోను — అనగా మొదటి పంచవర్ష ప్రణాళికయొక్క మొదటి 5 సంవత్సరాలలోను, రెండవ ప్రణాళికయొక్క మొదటి రెండుసంవత్సరాలలోను—కార్మికుల జీతాలు పెరిగాయా తరిగాయా అని ఎవరైనా ప్రశ్నిస్తే ఖచ్చితమైన సమాధానం చెప్పడం కష్టం. కారణమేమంటే, ఈ సమస్యపై ప్రభుత్వం తయారుచేసిన లెక్కలవలన మొత్తం భారతదేశంలోని వేతనాలను గురించి తెలుసుకోజాలం. జీతాల బట్వాడా చట్టాన్ని బట్టి ఒకానొక పరిశ్రమలో కార్మి

కులు ఏటా సంపాదించే సగటు జీతాల మొత్తం తెలుసుకో వచ్చుగాని, దానికీ మొత్తం ఉత్పత్తికీ గల సంబంధం తెలియదు. జీవన వ్యయ సూచీపత్రంగాని కొనుగోలు ధరల సూచీపత్రంగాని కుటుంబాల జీవన వ్యయ ప్రమాణానికి సంబంధించినంతవరకు నేటి పరిస్థితిని సరిగాను, సంపూర్ణంగాను తెలియజేయవు. ధరలను గురించి, ఖర్చులను గురించి తెలియ జేసే లెక్కలతో కూడుకొని యుండడమేకాక, కార్మికులు తమ హక్కులను ప్రకటించుకోకుండా నిరోధించడానికే అవి తయారు చేయబడ్డాయని కొన్ని ట్రేడ్ యూనియన్లు ఆరో పించాయి. ప్రభుత్వం దఫాలవారీగా ఈ సూచీపత్రాలలో మూలసంవత్సరాల్ని మారుస్తూ వుంటుంది. ఆవిధంగా మార్చడంవల్ల సిసలైన తేడాలు తెలియవు. కార్మికులుకోరే జీతాల పెంపుదలను యజమానులు వ్యతిరేకించడానికి అవి సాధనాలుగా ఉపయోగపడతాయి. ప్రస్తుతం కొనుగోలుధరల సూచీపత్రాలను తయారుచేయడంలో మూడు మూలసంవత్స రాలు ఉపయోగింపబడుతున్నాయి. అవి 1939, '44, '49.

దేశంయొక్క అన్ని పరిశ్రమల్లోను, అన్ని వృత్తుల లోను, అన్ని సర్వీసులలోను చెల్లింపబడే వేతనాల మొత్తం ఎంతో తెలుసుకోడానికి సంఖ్యావివరా లింతవరకు తయారు చేయబడలేదు. జీతాల బట్వాడా చట్టంప్రకారం చెల్లించవల సిన మొత్తాల జాబితానుబట్టి కొన్ని వివరాలు తెలుస్తాయి. ఈమధ్యనే పరిశ్రమల నికర ఉత్పత్తి ఎంతో తెలియజేసే వివ రాలు కొన్ని ప్రచురింపబడ్డాయి. వాటిని బట్టి ఉత్పత్తియొక్క

విలువలో కార్మికుల వేతనాలు ఎంతభాగమో, పెట్టుబడి దారుల లాభాలు ఎంతభాగమో తెలుస్తుంది. కాని యిట్టి సంఖ్యావివరాలు 29 పరిశ్రమలకు మాత్రమే తయారుచేయ బడ్డాయి. అయినప్పటికీ ధోరణి ఎలావుందో వాటినిబట్టి కొంత వరకు తెలుసుకోవచ్చు. ప్రభుత్వం ప్రకటించిన లాభాల సూచీపత్రాన్నిబట్టి కూడా కొంతవరకు యిది స్థూలంగా తెలుస్తుంది.

—:x:—

# 3. వేతనాలు, పని, కోర్కెలు

## 18. వేతనాలలో పెరుగుదల

మన కందుబాటులో ఉన్న సమాచారాన్ని ఆధారంగా చేసుకొని ఆలోచిస్తే, పారిశ్రామిక రంగంలోని ప్రధాన విభాగాలలో వేతనాలు 1947 తర్వాత యీ క్రింది విధంగా పెరిగినట్లు తెలుసుకోవచ్చు:

సగటు సాలుసరి జీతం: ఒక్కొక్క కార్మికుడు సంపాదించినది (రూపాయలలో)

| 1947 | '50 | '51 | '52 | '53 | '54 | '55 |
|---|---|---|---|---|---|---|
| 702.4 | 965.8 | 1028.9 | 1108.7 | 1108.7 | 1108.1 | 1170.0 |

పై లెక్కలు జీతాల బట్వాడా చట్టం ప్రకారం చెల్లింపబడిన మొత్తాలను ఆధారంగా చేసుకొని తయారుచేయబడ్డాయి.

(ఇండియన్ లేబర్ గెజెట్: సెప్టెంబరు '57)

వీటినిబట్టి చూస్తే కార్మికులు జరిపిన పోరాటాలవల్ల వారి వేతనాలు 702.4 నుండి (1947) 1108.7 కి (1952) పెరిగినట్లు స్పష్టమవుతూంది. ఆ తర్వాత మూడు సంవత్సరాల్లోను యించు మించు ఎట్టి మార్పు లేదనే చెప్పవచ్చు. మళ్ళా 1955 లో 1108.1 నుండి 1170.0 వరకు పెరిగినట్లు స్పష్టమవుతుంది.

సామ్మురూపంలో కార్మికులకిచ్చే వేతనాలు 1947 – 55 మధ్య యీ క్రింది విధంగా మార్పుచెందాయి. (1951 లో యిచ్చిన వేతనాలు 100 అనుకుంటే):

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1947 | 1949 | 1950 | 1951 | 1952 | 1953 | 1954 | 1955 |
| 71.0 | 95.4 | 93.7 | 100 | 108.1 | 107.7 | 107.6 | 116.0 |

దీనంతటినిబట్టి మనకొక విషయం స్పష్టమవుతుంది. యుద్ధకాలంలో కోతకోయబడిన జీతాలను తిరిగి పొందడానికి, తమ స్థితిగతులను చక్కబరచుకోడానికి కార్మికులు దృఢనిశ్చయంతో పోరాడారు; కొన్ని ముఖ్యమైన విజయాలు సంపాదించారు.

అయితే ధరలసంగతి, కార్మికుల జీవనవ్యయం సంగతి కూడా తెలుసుకోకపోతే పై వివరణ వాస్తవానికి విరుద్ధంగా తయారవుతుంది.

ప్రతి కార్మికునికి తనచేతిలో పూర్వంకన్న ఎక్కువ డబ్బు ఉందని తెలుసు. కాని ఆ డబ్బుతో పూర్వంకన్న తక్కువ సరుకులు లభిస్తున్నాయనీ, అందుకు కారణం పెట్టుబడి దారులు జీవితావసరవస్తువుల ధరలను పెంచడమేననీ కూడ అతనికి తెలుసు.

ఈ విషయాన్ని మనం దృష్టిలో ఉంచుకొంటే మనకు కనిపించేది ఏమిటి ?

యుద్ధకాలంలో కోతకోయబడిన జీతాలను కార్మికులు తిరిగి రాబట్టుకోడమే కాక, ధరలపెరుగుదలతో సమానంగా జీతాలను పెంచుకోగలిగారని కూడా మనకు బోధపడుతుంది. అంతేకాదు. కార్మికులకు ద్రవ్యరూపంలో యిచ్చే వేతనాలు పెరగడమేగాక, ప్రధానంగా పెద్దతరహాకు చెందిన సంఘటిత పరిశ్రమల్లో అసలువేతనాలుకూడ (అసలువేతనమంటే డబ్బు రూపంలో యిచ్చే వేతనానికి మార్కెట్లో లభించే సరకుల మొత్తం—అను.) పెరిగినట్లు స్పష్టమవుతుంది.

| సంవత్సరం | | ఆలిండియా విని మయదారుల ధరల సూచిక (1939 - 100) | అసలువేతనాల సూచిక (1939 - 100) |
|---|---|---|---|
| 1947 | ... | 323 | 78.4 |
| 1948 | ... | 360 | 84.4 |
| 1949 | ... | 371 | 91.7 |
| 1950 | ... | 371 | 90.1 |
| 1951 | ... | 387 | 92.2 |
| 1952 | ... | 379 | 101.8 |
| 1953 | ... | 385 | 99.9 |
| 1954 | ... | 371 | 102.7 |

స్వాతంత్ర్యం లభించిన తర్వాత మొదటి పంచవర్ష ప్రణాళికవల్ల కార్మికులకు లభించిన మేలల్లా వారి జీవన ప్రమాణాన్ని 1939 నాటి స్థాయికి తీసుకెళ్ళడమేనని కొందరు అనవచ్చు. అదివాస్తవంకాదు. దాని అర్థమల్లా ఒకటే. మన

వీరోచిత పోరాటాలన్నీ మనలను 1939 నాటి స్థాయికి తీసుకెళ్లా యన్న మాట! కాని నిజంగా మనం కొన్ని విజయాలను సాధిం చాం. యుద్ధకాలంలో యజమానులచే విపరీతంగా తగ్గించి వేయబడినజీతాలను మనం తిరిగి రాబట్టుకోగలిగాం; యుద్ధం తర్వాతకూడా నిలబడివున్న విపరీత ధరలతో సమానంగా మన జీతాలను హెచ్చించుకోగలిగాం. భారతీయ బడా పెట్టుబడిదా రులు అధికారాన్ని హస్తగతంచేసుకున్న తర్వాత స్వార్థపూరిత మైన లాభార్జనకోసం కార్మిక వర్గాన్ని ప్రజల్నీ వారు పీల్చి పిప్పి చేయడానికి వెనుకంజ వేయలేదు. కాని ఆ దాడిని కార్మికు లెదుర్కొన్నారు.

కార్మికుల విజయంలోని అసలు రహస్యం తెలుసుకోవా లంటే, ఆ విజయాన్ని వారెలా సాధించారో, యితరవర్గాలకు జరిగిన మేలుకూ యీ విజయానికీ గల సంబంధమేమిటో తెలుసుకోవాలి. అందుకు పూనుకొనేముందు కార్మికుల వేత నాలు ఏ రూపంలో, ఏ ప్రాతిపదికపై పెరిగాయో పరిశీలించ వలసియుంది.

## 19. యుద్ధకాలంలో పోగొట్టుకుని తిరిగి రాబట్టుకొన్న సౌకర్యాలు

మన దేశంలో కార్మికులకు జీతాలు అనేక రూపాల్లో చెల్లింపబడుతున్నాయి. ఉదాహరణకు మూలవేతనమంటూ ఒకటిఉంది. అది గంటల్ని బట్టీ, రోజుల్ని బట్టీ చెల్లింపబడవచ్చు; లేదా కంట్రాక్టుపద్ధతిని చెల్లింపబడవచ్చు. యుద్ధకాలంలో

ధరలు పెరిగినప్పుడు మూలవేతనానికి కొంత సొమ్ము చేర్చి కరువుభత్యం అనే పేరుతో యిచ్చేవారు. దాన్ని రొక్కం గానో మూలవేతనంలో కొంత శాతంగానో యిచ్చేవారు. కొన్ని ప్రాంతాల్లో కరువుభత్యంలో కొంతభాగం చౌకగానో ఉచితంగానో సప్లైచేసే జీవితావసర వస్తువుల రూపంలో చెల్లించేవారు. యజమానులు అంతకంతకు ఐశ్వర్యవంతు లవడం చూచి కార్మికులు తమకుకూడా "కానుకగా" కొంత భాగం పంచి పెట్టాలని డిమాండుచేయనారంభించారు. ఈ విధంగా ప్రతియేడూ కార్మికులకు బోనసు చెల్లించేపద్ధతి అమల్లోకి వచ్చింది. గత ఏడు సంవత్సరాల్లో కార్మికులు జీతాల పెంపుదల కోసం అనేక పోరాటాలు జరిపారు. అవి అన్నిరకాలైన జీతాలను సంబంధించి ఉన్నాయి. అంటే, మూలవేతనాలను పెంచాలనీ, ధరలపెరుగుదల కనుగుణ్యంగా కరువుభత్యాన్ని ఎక్కువచేయాలనీ, బోనసునుకూడా పెంచా లనీ డిమాండుచేస్తూ వచ్చారు.

యుద్ధం, యుద్ధానంతర కాలాల్లో కరువు భత్యం ఎక్కువ చేయాలనే డిమాండు, బోనసును పెంచాలనే డిమాండు ప్రాధాన్యం వహించాయి. రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభ మైనప్పుడు మొట్టమొదటి సారిగా బొంబాయి ప్రభుత్వం (శ్రీ మున్షీ నాయకత్వాన వర్తకులకు, పారిశ్రామికాధిపతులకు 100 కి 20 చొప్పున ధరలను పెంచుకోడానికి అనుమతి యిచ్చింది. భారత ప్రభుత్వం, యితర రాష్ట్ర ప్రభుత్వాలు 100 కి 10 చొప్పున మాత్రమే పెంచుకోడానికి అనుమతి

యిచ్చాయి. దీనిమీద బొంబాయి బట్టల మిల్లు కార్మికులు అధికధరల ఎలవెన్సు (కరువుభత్యం) కొరకు ఆందోళన చేశారు. కాని 100 కి 10 చొప్పున మాత్రమే యివ్వడానికి యజమానులంగీకరించారు. తక్షణమే 1940 మార్చిలో సాధారణ సమ్మె ప్రారంభమైంది. కాని వెంటనే మార్పేమీ జరగలేదు. అయితే, అధిక ధరల ఎలవెన్సును జీవనవ్యయ సూచికననుసరించి యివ్వడానికీ, ఏటా బోనసు చెల్లించడానికీ యజమాను లంగీకరించారు. ఇది ఒక దేశవ్యాపిత ఉద్యమానికి నాందీప్రస్తావన. యావద్భారతదేశంలోను కార్మికవర్గం అధిక ధరల ఎలవెన్సు కోసం, బోనసు కోసం ఆందోళన చేయడం ప్రారంభించింది.

అయితే ధరల పెరుగుదలతో సరిసమానమైన కరువుభత్యం ఎక్కడా లభించలేదు. అనేక పరిశ్రమల్లోను, పారిశ్రామిక కేంద్రాల్లోను పరిస్థితి యింతే. ట్రేడ్ యూనియన్లు బలహీనంగా ఉన్నచోట్ల, కార్మికులు ఐక్యతను సాధించి సమ్మెలు చేయనిచోట్ల యిది స్పష్టంగా కనిపించింది. ఉదాహరణకు కలకత్తాలో యిదే జరిగింది. బొగ్గుగనులు, తేయాకు తోటలు మొదలైన పరిశ్రమల్లో కూడ యిదే జరిగింది.

అన్ని ప్రదేశాల్లోను జీవన వ్యయం విపరీతంగా పెరిగినప్పటికీ, ఒక కేంద్రానికీ మరో కేంద్రానికీ మధ్య వ్యత్యాసం చాలా ఉందనే విషయం రెండవ అనుబంధం చూస్తే బోధపడుతుంది.

ఫలిత మేమంటే, అసలు వేతనాలు విపరీతంగా పడి పోయాయి. 1939 లో అసలు వేతనాలు 100 అనుకుంటే, 1946 నాటి కవి 100 కి 73.2 చొప్పున పడిపోయాయి. యుద్ధం వల్ల యజమానులు లాకవైపు విస్తారంగా లాభాలు గుంజుకొంటూంటే, యుద్ధభారమంతా కార్మికులమీద మోప బడింది.

## 20. యుద్ధానంతర వెల్లువ

యుద్ధం సమాప్త మవడంతో జాతీయ స్వాతంత్ర్యోద్యమ వెల్లువ విజృంభించింది. కార్మికులు దేశవ్యాపిత రాజకీయ సమ్మెల ద్వారా ఆఉద్యమాన్ని బలపరిచారు. జీతాలను పెంచడం, పని గంటలను తగ్గించడం మొదలైన ఆర్థిక కోర్కెలను కూడా వారు ముందుకు తెచ్చారు. కాంగ్రెసునాయకత్వంతో సహా సామ్రాజ్యవాద వ్యతిరేకులంతా కార్మికుల కోర్కెలను బలపరిచారు. యుద్ధకాలంలో జీతాలు తగ్గింపబడినందున, తత్ఫలితంగా కార్మికులెన్నో బాధలకు గురిచేయబడినందున యజమానులు వారి జీతాలను పెంచాలనే కోర్కెపట్లఅందరూ సానుభూతి ప్రకటించారు. అ.భా. కాంగ్రెసు కమిటీ ఆవిధమైన తీర్మానంకూడా ఒకటిచేసింది. అయితే సమ్మెలుచేయ వద్దని హెచ్చరించింది. ప్రభుత్వం రైల్వేకార్మికులతో సహా అన్ని తరగతుల ఉద్యోగుల కొరకు ఒక జీతాల కమిషన్ నియమించింది. రైల్వే కార్మికులకు కొంత తాత్కాలిక సహాయంచేసింది.

మొట్టమొదట జీతాల కమిషన్ ఒక చరిత్రాత్మక కర్త వ్యాన్ని నిర్వర్తించింది. ప్రభుత్వోద్యోగులందరికీ యిచ్చే జీతాలు ఒకే విధంగా ఉండాలనీ, దేశానికంతకూ కనీసజీతం ఒకటే ఉండాలనీ సిఫార్సు చేసింది.

ఇతర పరిశ్రమలకు కూడా ట్రిబ్యునల్స్, బోర్డులు నియమింపబడ్డాయి. 1946 నుంచి 1948 వరకు అధిక ధరల ఎలవెన్సుకోసం, దేశానికంతకూ కనీసజీతం ఒకటే ఉండాలని, బోనసు తప్పనిసరిగా చెల్లించాలని, ఒకేవిధమైన మూలవేతనం ఉండాలని కోరుతూ కార్మికులు బ్రహ్మాండమైన ఉద్యమాలను నడిపారు. వాటి ఫలితంగానే అధికధరల ఎలవెన్సు, బోనసు గణనీయంగా పెరిగాయి. మూలవేతనం కూడాకొన్ని చోట్ల హెచ్చింపబడింది. రైల్వేలు, ప్రభుత్వ సర్వీసులు, పోస్టు టెలిగ్రాఫ్ డిపార్టుమెంటు, బొగ్గుగనులు, బట్టలమిల్లులు, ఇనుము ఉక్కు కర్మాగారాలు—అంటే కార్మిక వర్గానికి ప్రధానరంగాలైన అత్యధిక పరిశ్రమల్లో — యీ విజయాలు లభించాయి. అసలు వేతనాల సూచిక 1946 లో 73.2 ఉంటే 1949 నాటికి 91.7 కి పెరిగింది.

కాని, అదేసమయంలో యజమానులు ప్రభుత్వ విధానాలను ఆసరాగా చేసుకొని దేశాన్ని నిర్దాక్షిణ్యంగా కొల్లగొట్టుకుంటూ వచ్చారు. ప్రభుత్వం మొదట అనేక సరకుల మీద కంట్రోళ్ళను రద్దుచేసి, ప్రజల్ని దోచుకొనేందుకు సకల అవకాశాలు చట్టావ్యాపారస్తులకిచ్చింది. ఎంతో దేశ

భక్తి, పవిత్రాశయాలు తమకుగలవని చెప్పుకొనే పెట్టుబడి దారులు ప్రజల్నెంత క్రూరంగా కొల్లగొట్టుకుంటూన్నారో చూచిన ప్రజలలో తీవ్రమైన ద్వేషం వ్యాపించింది. ఇదిచూచి ప్రభుత్వం, కాంగ్రెసు పార్టీ వెంటనే జోక్యం కలుగజేసు కున్నాయి. కంట్రోళ్ళు తిరిగి ప్రవేశపెట్టబడ్డాయి. ఆరోజులలో జరిగినసమ్మెలవివరాలు తెలుసుకోవాలంటే 3 (ఎ) అనుబంధం చూడండి.

తర్వాత, 1950 నుంచి పరిస్థితులు కొంతకాలం స్థిరపడ్డాయి. బోనసు, అధిక ధరల ఎలవెన్సు, మూలవేతనం మొదలైనసమస్యలపై చాలచోట్లతగాదాలు అపరిష్కృతంగా ఉన్నప్పటికీ మొత్తం మీద సమ్మెలఉధృతం బాగాతగ్గింది. ఆ రేండ్లు వరుసగా కొనసాగిన బ్యాంకు ఉద్యోగుల తగాదా యీదశలో ప్రత్యేక ప్రాధాన్యం వహించింది. ప్రధానంగా మధ్యతరగతి ఉద్యోగుల జీతాల సమస్య, వారి సంఘ నిర్మాణం యీ తగాదా మూలంగా ఒక కొత్త స్వరూపం తీసు కొన్నాయి. అనేక విషయాల్లో బ్యాంకు ఉద్యోగుల తగాదాకు ప్రత్యేక ప్రాధాన్యం వచ్చింది. ఈ తగాదాలో కార్మికులురాజ్యాంగ చట్టాన్ని చక్కగా రుచిచూచారు! ఆర్డినెన్స్ అంటే ఏమిటో వారు తెలుసుకున్నారు. బహుశా వారి ఎరుకలో అదే మొదటి ఆర్డినెన్స్. కేంద్ర ప్రభుత్వం బ్యాంకు యజమానుల తరఫున జోక్యం కలిగించుకొని, ట్రిబ్యునల్ సిఫార్సు చేసిన జీతాల పెంపుదలను నిరాకరించడం వారికి ప్రత్యక్షంగా కనపడింది. అంతేకాదు. కార్మిక మంత్రి రాజీ

నామా యివ్వడం, పనివారు సమ్మెచేస్తామని నోటీసు యివ్వడం, చివరి క్షణంలో జరిగిన రాజీ ఫలితంగా పనివారి కోర్కెలలో చాలవాటిని ప్రభుత్వం అంగీకరించడం జరిగింది. పనివారి కోర్కెలు నెరవేరడం, వారిలో నిర్మాణ బలం పెంపొందడం, పోరాటం దేశ వ్యాపిత స్వభావం కలిగియుండడం, అ. భా. బ్యాంకు ఉద్యోగుల అసోసియేషన్ నాయకత్వాన ఉద్యోగులు ఐక్యతను ప్రదర్శించగల్గడం— యీ కారణాలన్నిటివల్ల, బ్యాంకు ఉద్యోగుల పోరాటం ట్రేడ్‌యూనియన్ ఉద్యమానికి సంబంధించిన నూతన పరిణామాల్లో ఒక ప్రధాన స్థానం అలంకరించింది. జీతాల కమిషన్ ప్రభుత్వోద్యోగు లందరికీ దేశవ్యాపితంగా నెలకు రు. 30 కనీస వేతనం ఉండాలని సిఫార్సు చేస్తే, బ్యాంకు ఉద్యోగుల పోరాటం మధ్యతరగతి ఉద్యోగు లందరికీ యివ్వవలసిన జీతాల ప్రమాణం ఎంత ఉండాలో సూచించింది. అ. భా. బ్యాంకు ఉద్యోగుల అసోసియేషన్ ఒక స్వతంత్ర సంస్థ. అయినా నాగపూర్ మహాసభలో ఆ సంస్థను అ. భా. ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు, హింద్ మజ్దూర్ సభ, యునైటెడ్ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు బలపరిచాయి.

## 21. మొదటి పంచవర్ష ప్రణాళిక: వేతనాల స్థిరీకరణ విధానానికి ఓటమి

బ్యాంకు ఉద్యోగుల తగాదా మధ్యలో ఉండగా మొదటి పంచవర్ష ప్రణాళిక ఉత్పన్నమైంది. వేతనాల విష

యంలో ప్రభుత్వం అనుసరించ దలకున్న విధానాన్ని అది తెలియజేసింది. దాని సారాంశ మేమిటో చూదాం.

పంచవర్ష ప్రణాళిక అమలు జరిగే ఐదేండ్లలోను కార్మికుల వేతనాలు పెరక్కుండా నిలిపి వుంచాలని ప్రణాళికా రచయితలు తెలియజేశారు. ధరల పెరుగుదలను బట్టి వేతనాలను కూడా పెంచినట్లయితే నోట్లముమ్మరం అధికమవుతుందనీ, ప్రణాళికకు అది హానికలుగ జేస్తుందనీ స్పష్టంగా చెప్పబడింది.

బ్యాంకు ఎవార్డులో శాస్త్రిట్రిబ్యునల్ బహిరంగంగా వేతనాలను పెంచడానికి వీల్లేదని వాదిస్తూ, పంచవర్ష ప్రణాళికలోని యీ క్రింది వాక్యాలను ఉటంకించారు :

"ఇటీవలి సంవత్సరాల్లో ధరలు వేగంగా పెరుగుతూవచ్చాయి. పరిశ్రమల్లో లాభాలుకూడా గణనీయంగానే పెరిగాయి. సంఘటిత కార్మికులు ఎక్కువ వేతనాలను పొందగలిగారు. అయితే, నోట్ల ముమ్మరాన్ని అరికట్టాలంటే ప్రణాళికాకాలంలో లాభాలను, వేతనాలను కొంతవరకు అదుపులోపెట్టవలసిన అవసరముంది. ...ఈ క్లిష్టసమయంలో వేతనాలు పెరిగినట్లయితే సరకుల ఖరీదులుకూడా పెరిగి దేశంయొక్క ఆర్థికస్థిరత్వం దెబ్బతింటుంది."

వేతనాలను అదుపులో ఉంచాలనే యీ విధానం యించుమించు అన్ని సందర్భాలలోను, అన్నిచోట్ల సమ్మెలకు దారితీసింది. ధరలపెరుగుదలను బట్టి కరువుభత్యాన్ని కూడా పెంచేందుకు అంగీకరించిన ప్రధాన పరిశ్రమల్లో యజ

మానులు వారంతట వారే వేతనాలను పెంచారు. అక్కడ కూడ పోరాటాలు బోనసు సమస్యమీదే ఉత్పన్నమయాయి.

కార్మికులు తమంతట తాము ప్రభుత్వ విధానాన్ని వ్యతిరేకించ సాగారు. ఈ దశలో కార్మికులు మూలవేతనాల పెరుగుదలకోసం కాక, జీతాలనుబట్టి బోనసు చెల్లించాలనే డిమాండు కోసం పోరాడారు.

పారిశ్రామికాధిపతుల లాభాలను కూడా అదుపులో ఉంచాలన్న ప్రకటన కాగితంమీదనే ఉండిపోయింది. కార్మికులు నగదురూపంలో పొందే జీతాలు, వస్తురూపంలో పొందే జీతాలు కూడా పెరిగాయి. అయితే యిందుకు కారణం జీతాల రేట్లు అదివరకటికన్న హెచ్చడం కాదు; కార్మికుని ఉత్పాదకశక్తి పెరగడం, ఉత్పత్తి నిరంతరాయంగా హెచ్చుతూండడం మాత్రమే యిందుకు కారణం. ఎడతెగని పనివల్ల, ఉత్పాదకశక్తి పెరగటంవల్ల జీతాల రేట్లకన్న బోనసులకన్న వేతనాలు అధికంగా పెరిగాయి. ఇదీ, జీతాల పెరుగుదల వెనుకనున్న ఆంతర్యం. కార్మికుడు పూర్వంకన్న యెక్కువగా కష్టపడ్డంవల్ల ఎక్కువ జీతాలు సంపాదించుకోగలిగాడు. అంతేగాని అతని శ్రమశక్తి యొక్క ఖరీదు పెరగడంవల్ల కాదు. కార్మికుల అసలు జీతాలు 1939 తో పోల్చుకుంటే 1952 నాటికి 102.7 వరకు వచ్చాయి. యుద్ధకాలంలో మనం పొందిన నష్టాన్ని పూడ్చుకోగలిగాం; కొంచెం ఎక్కువకూడా సంపాదించుకోగలిగాం. ఈ విధంగా వేతనాలను అదుపులో ఉంచాలనే విధానం ఓడింపబడింది.

# 22. కార్మికునిచే ఉత్పత్తిచేయబడ్డ సంపదలో అతని భాగం

1950 తర్వాత ఫ్యాక్టరీల ఉత్పత్తి పరిమాణంలోను, విలువలోను కూడ పెరుగుతూనే ఉంది. కార్మికులు పెట్టుబడిదార్ల కోసం, దేశంకోసం తమ శ్రమశక్తిని వినియోగించారు. పరిశ్రమల నికర రాబడిలో కార్మికుల వేతనాలెంత భాగమో లాభాలెంత భాగమో పరిశీలించినట్లయితే, యీ క్రింది వివరాలు మనకు తెలుస్తాయి :

| | కోట్ల రూపాయలు | | |
|---|---|---|---|
| | 1950 | 1954 | 1955 |
| ఫ్యాక్టరీపరిశ్రమల నుండి నికరరాబడి | 528.6 | 732.6 | 775.5 |
| కార్మికుల వేతనాలు | 236.4 | 292.3 | 319.5 |
| పెట్టుబడిదార్ల లాభాలు | 292.2 | 440.3 | 456.0 |
| మొత్తం ఉత్పత్తి విలువలో వేతనాల శాతం | 44.7% | 39.9% | 41.1% |

సంపద యీ విధంగా పెరిగింది. కార్మికుడు సైతం కొద్దిగా ఎక్కువడబ్బు సంపాదించుకోగల్గుతున్నాడు. అయితే ప్రధానంగా అతని శ్రమవల్లనే సంపదవృద్ధి చెందినప్పటికీ, అందులో అతనిభాగం మాత్రం 44.7% నుంచి (1950) 41.1% కి (1955) పడిపోయింది.

కార్మికుని సంపాదన 1950 లో 100 అనుకుంటే 1954 నాటికి 123, 1955 నాటికి 135 అయింది. కాని పెట్టుబడి దార్ల సంపాదన 100 నుంచి (1950) 150 కి, ఆతర్వాత 156 కి పెరిగింది.

కార్మికుడు పూర్వంకన్న ఎక్కువపనిచేశాడు. అందు చేత పూర్వంకన్న ఎక్కువ సంపాదించాడు. కాని అతని కష్ట ఫలితంలో ఎక్కువభాగం యజమానికి, తక్కువభాగం అతనికి వచ్చింది.

కార్మికుని జీతాలకు రక్షణఅంటూ లేదు. యజమా నులు వాటిని కోతపెట్టడానికెల్లప్పుడూ ప్రయత్నిస్తూనే ఉంటారు. ట్రేడ్‌యూనియన్ ఉద్యమం సాగించిన పోరా టాల వల్ల, దానిబలంవల్ల, అప్రమత్తతవల్ల మాత్రమే కార్మి కుడు యీ సౌకర్యాలను సంపాదించుకోగలిగాడు. ప్రభుత్వం గాని, యజమానులు గాని యిష్టపూర్వకంగా దేన్నీ యివ్వ లేదు. ఎల్లప్పుడూ వారు కార్మికుల సౌకర్యాలను అపహరిం చాలనే చూస్తూఉంటారు. అందుచేత, ట్రేడ్‌యూనియన్లు తమ శక్తిని ప్రదర్శించకపోతే, కార్మికులు సంపాదించుకున్న అసలువేతనాలు స్థిరంగా ఉండవు. ఇదికూడా ఎల్లప్పుడూ సాధ్యంకాదు. ఇంగ్లండువంటి యితరపెట్టుబడిదారీ దేశాలలో ట్రేడ్‌యూనియన్లు బలంగా ఉన్నప్పటికీ అసలువేతనాలు పడిపోతూనే ఉన్నాయి.

పైనచెప్పినట్లు మనం తరచు కార్మికుల సగటువేతనా లను గురించీ,అఖిలభారత వేతనస్థాయిని గురించీ ఎంతమాట్లాడు

కొంటున్నా, యింతవరకు జీతాల ప్రమాణమంటూ లేదు. జీతాలరేట్లు పూర్తిగా అరాజకపద్ధతిలో ఉన్నాయి; అనేక సందర్భాలలో అవి తాత్కాలిక పరిస్థితుల్నిబట్టి ఉంటాయి. భారతదేశంలో యీ రోజున పెట్టుబడిదారీ పరిశ్రమలు, కార్మికవర్గం నలుమూలలకు విస్తరించాయి. దేశానికంతకూ వర్తించే జీతాలప్రమాణ మొకటి మనకెంతో అవసరం. దాని ప్రాతిపదికమీద నైపుణ్యంలోని వ్యత్యాసాలకు, పనిభారంలో ఉండే వ్యత్యాసాలకు కూడ స్థానం కల్పించాలి. అలాగే, పనిలో ఉండే ప్రమాదపరిస్థితులకు, ప్రాంతీయ - వైజ్ఞానిక - శీతోష్ణపరిస్థితులలోని వ్యత్యాసాలకు కూడా స్థానం కల్పించాలి. ఇందుకోసం ప్రభుత్వం వేతన పరిశీలక బృందాలను, వేతన సారధ్యసంఘాలను నియమించింది; వాటి ద్వారా కొన్ని పరిశీలనలు జరుపుతోంది.

దేశానికంతకూ ఒకే జీతాల ప్రమాణాన్ని నిర్ధారణ చేయవలసిన అవసరం సహజంగా పెట్టుబడిదార్లకు కనిపించదు. పెట్టుబడిదారు లెంతసేపూ సరకులు సాధ్యమైనంత చౌకగా ఉత్పత్తి కావాలనీ, లాభాలు సాధ్యమైనంత ఎక్కువగా రావాలనీ కోరుకుంటారు. ఇందుకు ఒకరిమీద ఒకరు పోటీచేసుకుంటారు. కార్మికులకు వేర్వేరు జీతాల రేట్లను నిర్ణయించి, వారిలో వారు ఉద్యోగాలకోసం పోటీపడేటట్లు చేస్తారు. కార్మికులు స్వీయానుభవం ద్వారా విషయాలు తెలుసుకొని, ట్రేడ్ యూనియన్లను స్థాపించుకొని, వాటి ద్వారా యీ అరాజకాన్ని నిర్మూలించ గలిగే వరకు

యీ పోటీ వారిలో వారికి ఉండనేఉంటుంది. ఒకే విధమైన పనికి ఒకే రేటున జీతం చెల్లించేపద్ధతి కార్మికులకు చాల మేలు కలిగిస్తుంది. కార్మికులు ఐక్యతను సాధించడానికి, ఏమైనా వ్యత్యాసాలుంటే తప్ప అన్నిప్రాంతాలలోను శ్రమకు ఒకే ఖరీదు లభించేటట్లు చేసుకోడానికి వీలుకలుగుతుంది.

దేశం నలుమూలలనుంచీ కార్మికులు బోనసుకోసం, జీతాల పెరుగుదల కోసం యజమానుల మీాద, ప్రభుత్వం మీాద ఒత్తిడిచేయడం చూచి ప్రభుత్వం 1950 లో ఒక ఏకీకృత విధానాన్ని సూచించేందుకు, ముఖ్యంగా అధికధరల ఎలవెన్సు, బోనసు సమస్యలపై అఖిలభారత లేబర్ అప్పిలేట్ ట్రిబ్యునల్‌ను నియమించింది.

## 23. లేబర్ అప్పిలేట్ ట్రిబ్యునల్, దానిరద్దు

ఈ ట్రిబ్యునల్ బోనసు సమస్యను యజమానుల దయా ధర్మాలకు విడిచిపెట్టకుండా కార్మికులకు కొన్ని సందర్భాలలో విధిగా బోనసు యిచ్చి తీరాలనీ, అది కార్మికుల హక్కు అనీ స్పష్టపరచింది. బోనసుఅంటే కొన్నాళ్లైన తర్వాత యజమాని కార్మికునికి చెల్లించవలసిన వేతనమని నిర్వచించింది; కార్మికుని వేతనం జీవనవేతనపు స్థాయికి చేరుకునేవరకు బోనసు చెల్లించవలసిన అవసరమున్నదని స్పష్టంచేసింది. అయితే, అదనపు సొమ్ములో కొంత భాగానైనా బోనసుకై కేటాయించకుండా అందులో అత్యధిక భాగాన్ని యజమాని కైవశం చేసుకొనేందుకు వీలుకలిగించే

ఫార్ములా ఒక దాన్ని అప్పిలేట్‌ట్రిబ్యునల్ తయారుచేసింది. అయితే అంతిమ నిర్ణయం చేసేటప్పుడు "సాంఘికన్యాయం" ఒక అంశంగా ఉండాలని చెప్పింది. అంటే అర్థం కార్మికుని పరిస్థితి బాగులేదనీ, దాన్ని చక్కదిద్దవలసిన అవసరం ఉన్న దనీ అంగీకరించిందన్నమాట. కాని యజమానులు చేసిన అప్పీలుపై సుప్రీంకోర్టు తీర్పుచెబుతూ, బోనసు చెల్లింపుకు సంబంధించినంతవరకు సాంఘిక న్యాయానికి తిలోదకా లిచ్చింది.

లేబర్ అప్పిలేట్ ట్రిబ్యునల్ తయారుచేసిన ఫార్ములా కార్మికులకన్న యజమానులకే ఎక్కువగా లాభిస్తుంది. అ. భా. జా. ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసుతోసహా ట్రేడ్ యూనియన్ ఉద్యమంలో అన్నితరగతులకు చెందిన వారు దాన్ని ఖండించారు. కాని విచిత్రమేమిటంటే, అ. భా. జా. ట్రే. యూనియన్ కాంగ్రెసు ఆ ఫార్ములాలోని షరతులకు అనుగుణ్యంగానే అహమ్మదాబాద్ మిల్లు యజమానులతో బోనసు విషయమై అయిదేండ్ల ఒడంబడిక మీద సంతకం పెట్టింది.

అప్పిలేట్ ట్రిబ్యునల్ నిర్ణయాలు, దానివల్ల జరిగిన కాలహరణం, దుబారా కార్మికుల్నికోపోద్రిక్తులనొనర్చాయి. చివరకు అ. భా. జా. ట్రేడ్ యూనియన్ కాంగ్రెసుతో సహా అన్ని ట్రేడ్‌యూనియన్ సంస్థలు చేసిన ఆందోళన ఫలితంగా లేబర్ అప్పిలేట్ ట్రిబ్యునల్ దేశానికంతకూ వర్తించే వేత

నాల స్కీమును, బోనసుపద్ధతిని తయారుచేయకముందే ప్రభుత్వం దాన్ని రద్దుచేసింది.

## 24. ఉత్పత్తి పెరుగుదలనుబట్టి వేతనాలను పెంచుతామనే వివాదం

1955, 56, 57 సంవత్సరాల్లో జీతాల పెంపుదలకొరకు, అదనపు కరువు భత్యం కొరకు ఆందోళన అధికమైంది. ఈ సారి కార్మికులు తమ దృష్టిని బోనసు సమస్యమీద కంటె జీతాల పెంపుదల, అదనపు కరువు భత్యం మీద కేంద్రీకరించారు. కారణ మేమంటే, ఆహార ధాన్యాల కొరత తీవ్రమైంది; ధరలు పెరిగాయి; ఉత్పత్తి, లాభాలు కొత్త శిఖరాల నందుకున్నాయి.

ఆహార ధాన్యాలకు సంబంధించి నంతవరకు అఖిలభారత టోకు ధరల సూచిక 304.5 నుండి (1955) 372.9 కి (1956) పెరిగింది. అంటే ఏడాదిలో 68 పాయింట్లు అధికమయిందన్నమాట. 1957 లో అది 416.8 కి పెరిగింది (1939 లో 100 అనుకున్నప్పుడు). ఈవిధంగా ధరలను అదుపులో ఉంచడానికి ప్రభుత్వం చేసిన ప్రయత్నాలన్నీ విఫలమయాయి. పారిశ్రామిక పట్టణాలలో జీవన వ్యయం టోకు ధరల సూచికలో ఉన్నదానికంటె ఉన్నతస్థాయిలో పెరిగింది.

దేశంలో పారిశ్రామికోత్పత్తి క్రింది విధంగా పెరిగింది :

| | | |
|---|---|---|
| 1951 | — | 100 |
| 1954 | — | 113 |
| 1955 | — | 122 |
| 1956 | — | 133 |
| 1957 (నవంబరు) | — | 148 |

ఇది రెండవ పంచవర్ష ప్రణాళిక అమలు జరుగుతూన్న కాలం. ఈ దశలో వేతనాలను అదుపులో ఉంచాలన్న విధానానికి బదులు కార్మికుల ఉత్పత్తిని బట్టి వేతనాలు చెల్లించాలన్న నినాదం కొత్తగా అమల్లోకి తేబడింది. ఉత్పత్తిశక్తి పెరిగితేనే వేతనాలను పెంచుతామని ప్రభుత్వం, యజమానులు కొత్తగా వాదించ నారంభించారు. కాని పర్యవసానం ఒక్కటే. నాటినుంచీ ప్రతి యజమాని తన పరిశ్రమలో ఉత్పత్తి శక్తి పడిపోతూందంటూ ఫిర్యాదుచేయడం ప్రారంభించాడు.

కార్మికులబాధ లెలా ఎక్కువౌతూవచ్చాయో తెలుసుకోవాలంటే 1954, '55, '56 సంవత్సరాల్లో సమ్మెలు, ఆ సమ్మెలవల్ల నష్టమైన పని రోజులు యెలా అధికమవుతూ వచ్చాయో తెలుకుంటే చాలు :

| సం. | | సమ్మెలు | కార్మికులు | నష్టమైన పనిరోజులు |
|---|---|---|---|---|
| 1954 | | 840 | 4,77,188 | 33,72,638 |
| 1955 | | 1166 | 5,27,767 | 56,97,848 |
| 1956 | | 1263 | 7,34,168 | 71,36,512 |
| 1957 | (నవం.వరకు) | 1885 | 10,20,854 | 57,54,961 |

నష్టమైన పనిరోజుల సంఖ్య 33 లక్షలనుంచి 57 లక్షలకు, ఆతర్వాత 71 లక్షలకు పెరగడం చిన్నవిషయం కాదు. కార్మికుల స్థితిగతు లంతకంతకు అధ్వాన్న మవుతూంటే ఎంత త్వరితంగా వారు కార్యరంగంలోకి ప్రవేశిస్తారో పై లెక్కలు తెలియజేస్తాయి. ఈ యేడు (1957)కూడా నష్టమైన పనిరోజులు 1956 లో కన్న తక్కువగా ఉన్నప్పటికీ తగాదాలసంఖ్య, వాటికిలోనైన కార్మికుల సంఖ్య 1956లో కన్న అధికంగా ఉంది.

## 25. 1955 నుంచి 1957 వరకు కార్మికులు సాధించిన ప్రధానవిజయాలు

ఈ మూడు సంవత్సరాల్లోను (1955, '56, '57) కార్మికులు అనేక ప్రధాన పరిశ్రమల్లో జీతాలు, కరువుభత్యం పెంచాలని డిమాండుచేయడం, ట్రిబ్యునల్స్ తదితర పరిష్కార సంఘాలు తమతీర్పులు చెప్పడం జరుగుతూ వచ్చింది.

వీటన్నిటిలోను ముఖ్యమైనది బొగ్గుగని కార్మికులు సాధించిన విజయం. వీరు 10 సంవత్సరాల తర్వాత జీతాలు, గ్రేడ్లు, కరువుభత్యపు రేట్లలో పెరుగుదలను సాధించుకో గలిగారు. జీతాలను ప్రమాణబద్ధ మొనర్చడానికి కొంత ప్రయత్నంకూడా జరిగింది. సుమారు 3, 60, 000 మంది కార్మికులకు యీ సౌకర్యాలు లభించాయి. అవి సరిగా అమలు జరుగుతూన్నదీ లేనిదీ పరీక్షిస్తూ ఉండడానికొక ఇంప్లిమెంటేషన్ కమిటీ నియమింప బడింది.

ఇలాగే తేయాకు కార్మికులు కూడా బోనసు, జీతాల పెంపుదలను గురించి యజమానులతో ఒడంబడిక కుదుర్చు కోగలిగారు. ఈ రెండు పరిశ్రమల్లోను చిరకాలంగా బియ్యం రూపంలో చెల్లించే కరువుభత్యం నగదు రూపంలోకి మార్చ బడింది.

ఇనుము - ఉక్కు పరిశ్రమలో కూడా కార్మికులకు పూర్వంకంటే ఎక్కువ బోనసు లభించింది. బర్న్ పూర్ ఇనుము - ఉక్కు కర్మాగారంలో కార్మికులకు చాల తక్కువ బోనసు చెల్లించేవారు. అట్టి పరిశ్రమలో క్రిందటి సంవత్స రం 10 రోజులకు బదులు 30 రోజులకు, ఈయేడు 65 రోజులకు బోనసు చెల్లించ డానికి యజమానులంగీకరించారు. జంషెడ్ పూర్ లోని టాటాయినుము కంపెనీకూడ కొన్ని సౌకర్యా లను కలిగించవలసి వచ్చింది. వేతనాల సమస్యపై ఈ యేడు జరిగిన మరొక ప్రముఖమైన కార్మికతగాదా పోస్టు - టెలిగ్రాఫ్ తదితర ప్రభుత్వోద్యోగులకు సంబం

ధించినది. ఇది 1957 ఆగస్టులో జరిగింది. తగాదాను పరిష్కరించుటకు నియమింపబడ్డ జీతాల కమిషన్ తాత్కాలిక సహాయం సిఫార్సు చేసింది. 1957 లో జీవన వ్యయం గణనీయంగా పెరిగింది. అది కొంతకాలం అలాగే నిలబడుతుందనిపించింది. దానివల్ల తక్కువ జీతాలు తెచ్చుకొనే ఉద్యోగుల బాధలు ఎక్కువయాయి. వాటి నివారణకు నెలకు రు. 5 చొప్పున కరువుభత్యం యివ్వాలనీ, దీనిని జూలై నుండి అమలు జరపాలనీ జీతాల కమిషన్ సిఫార్సు చేసింది.

అయితే విచిత్రమేమంటే, జూలై నుండి డిసెంబరు వరకు చెల్లించవలసిన (ఒక్కొక్క కార్మికునికి) రు. 30 నగదు రూపంలో కాక సేవింగ్స్ సర్టిఫికెట్ల రూపంలో చెల్లించాలని పే కమిషన్ చెప్పింది. కార్మికులకు నిజంగా నిల్వ చేసుకోగల శక్తే ఉన్నట్లయితే, వారు సమ్మెలకు దిగవలసిన అవసరమేమి వచ్చింది? పేకమిషన్ సహాయం చేయవలసిన అగత్యమేమి వచ్చింది? ఈ అదనపు కరువు భత్యాన్ని రైల్వే కార్మికులు, పోస్టు - టెలిగ్రాఫ్ పనివారు, వైమానికులు, పి. డబ్ల్యు. డి. కార్మికులు, రక్షణ శాఖోద్యోగులు, ప్రభుత్వ ప్రెస్సులలో పనిచేసేవారు - మొత్తం 16 లక్షల మంది - పొందుతారు. అంతకు ముందు వారు 1949 లో ఒక సారి (రు. 10), 1951 లో యింకొక సారి (రు. 5) అదనపు కరువు భత్యం సంపాదించుకున్నారు. అనేక యితర వృత్తుల వారు జీతాల్లో పెంపుదలను సాధించుకున్నారు.

ఈ విధంగా ఒకవైపు సంఘటిత కార్మికవర్గం అనేక పోరాటాలద్వారా సౌకర్యాలను పొందుతూంటే, చిన్నతరహా పరిశ్రమల్లోను, పెద్ద పెద్ద నిర్మాణకార్యాలలోను పనిచేసే కార్మికుల విషయం, కంట్రాక్టు కూలీల తదితర కార్మికుల విషయం వేరు. ఉత్పత్తి, లాభాలు పెరగడంవల్ల, నోట్ల ముమ్మరం వల్ల అందరి లాభాలూ హెచ్చాయి. అయినా సంఘటితులుకాని కార్మికులు, నిపుణులుకాని కార్మికులు ఎట్టి సౌకర్యాలూ పొందక పోవడమో, బహు నెమ్మదిగా మాత్రమే పొందడమో జరిగింది. ఈ తరగతికి చెందిన పరిశ్రమల్లో కార్మికులకు కనీస వేతనాలను నిర్ణయించడానికి మాత్రం ఒక ప్రయత్నం జరిగింది. అనేకపరిశ్రమలకు, వృత్తులకు సంబంధించిన కమిటీలు కనీసవేతనాలను నిర్ణయించాయి. కాని మాంగనీసు గనుల్లోను, ముడిలోహాలు దొరికే గనుల్లోను యిప్పటికీ కనీస వేతనాలివ్వడం లేదు. ఈ తరగతికి చెందిన పరిశ్రమల్లో జీతాలు అసలే పెరగక పోవడమో బహుస్వల్పంగా మాత్రమే పెరగడమో జరిగింది.

## 26. వేతనాలు పెరిగితే ధరలుకూడా పెరుగుతాయన్న వక్రసిద్ధాంతం

ప్రభుత్వం జీవితావసర వస్తువుల ధరలను అదుపులో పెట్టలేక పోయింది. నిజానికి ధరలపెరుగుదలకు ప్రోత్సాహమిచ్చింది. ఆహారధాన్యాలను కొని నిల్వచేసుకొనే వారికి బ్యాంకులు చాల తక్కువవడ్డీకి అప్పులిచ్చాయి. ఇది ఎట్ట

కేలకు ప్రమాదపరిస్థితిని తెచ్చిపెట్టింది. రెండవవైపున యజమానుల లాభాలు కూడా పెరిగాయి. కాని వార్షు - జీతాలను మాత్రం పెంచడాని కంగీకరించలేదు. దీని అర్థం, కార్మికుల అసలు జీతాలను తగ్గించ దలచుకున్నారన్న మాట. జీతాలను పెంచితే ధరలుకూడా పెరుగుతాయనీ, ధరలనుబట్టి జీతాలనూ, జీతాలనుబట్టి ధరలనూ పెంచుకొంటూపోనడంవల్ల కార్మికులకు, సమాజానికి తీరని హాని కలుగుతుందనీ బ్రహ్మాండమైన ప్రచారం బయల్దేరింది. దేశంలోని "ఆర్థిక నిపుణులం"తా దీనికి చేయూతనిచ్చారు.

అంతేకాదు. అ. భా. ట్రే. యూ. కాంగ్రెసుకు అనుబంధింపబడిన యూనియన్లు ఎక్కువ జీతాలకొరకు ఆందోళన రెచ్చగొడుతున్నాయనీ, సమ్మెలను కూడ పురిగొల్పుతున్నాయనీ ఆరోపించబడింది. అ. భా. ట్రే. యూనియన్ కాంగ్రెస్ ఈ ప్రచారానికి ఆగస్టు 4వ తేదీని పార్లమెంటులో చక్కనిజవాబు చెప్పింది. ఈ అన్ని సంవత్సరాల్లోను ధరలే మొదట పెరుగుతూవచ్చాయనీ, అంతకంతకు అవి పెరుగుతూనే ఉన్నాయనీ, జీతాలుమాత్రం వాటితో సమానంగా పెరగడం లేదనీ నిరూపింపబడింది. ప. యూరప్, అమెరికాలలోని ట్రేడ్ యూనియన్లు మన జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు వంటివి. అయినా, ఆ దేశాల్లో గుత్తపెట్టుబడిదార్లు కార్మికులజీతాలను తగ్గించడంద్వారా ఎక్కువ లాభాలను సంపాదించే విధానాన్ని కార్మికులెలా ప్రతిఘటిస్తున్నారో, జీతాల పెరుగుదల కొరకెలా పోరాడుతున్నారో మనం నిరూపించాం.

అమెరికాలో అన్నిటికంటె పెద్ద ట్రేడ్‌యూనియన్ సంస్థ అమెరికన్ ఫెడరేషన్ ఆఫ్ లేబర్. దాని తరఫున నడుపబడుతున్న మాసపత్రిక 1957 జూన్ సంచికలో యిలా వ్రాసింది :

"జీతాల పెరుగుదల వల్ల ధరలు కూడా పెరుగుతాయనీ, దానికి ప్రధాన కారణం జీతాలపెరుగుదలేననీ వాణిజ్య ప్రతినిధులు, రాజకీయ నాయకులు ప్రచారం చేస్తూన్నారు. ఇది వట్టిదని బ్యూరో ఆఫ్‌లేబర్ స్టాటిస్టిక్స్ వారి లెక్కలు స్పష్టంచేస్తూన్నాయి."

'బి. ఎల్. ఎ. స్టడీ' అను పత్రంలో యిలా ఉంది : "1956 కి ముందు ప్రతి సంవత్సరం ధరల ప్రమాణంకంటె కార్మికేతర వ్యయాల ప్రమాణం (అంటేలాభాలు, డిప్రీసియేషన్ తదితర వ్యయాలు) అధికంగా ఉంటూవచ్చింది." (అమెరికన్ ఫెడరేషన్ ఆఫ్ లేబర్ యొక్క ఆర్థిక విధానసంఘంచే ప్రచురింపబడుతున్న 'ఎకనామిక్ ట్రెండ్స్ అండ్ ఔట్‌లుక్'అను మాసపత్రిక నుంచి: 1957 జూన్).

బ్రిటిష్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు మరొక "బాధ్యతగల" సంస్థ. 1957 సెప్టెంబరులో బ్రిటిష్‌ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు మహాసభ ఒక తీర్మానంచేసింది. అందులో, నోట్లసొమ్మురాశిని ఎక్కువచేసే ఉద్దేశం ట్రేడ్ యూనియన్ కాంగ్రెసుకు లేదనీ, అయితే కార్మికుల జీవన ప్రమాణాలను తగ్గించివేసే విధానం తమ ఆమోదాన్ని పొంద జాలదనీ స్పష్టంచేసింది. తదనుగుణ్యంగా ఆ మహాసభ ధరలను లాభాలను అదుపులో ఉంచకుండా జీతాలను మాత్రమే అదుపులో ఉంచే సూత్రానికి తాము వ్యతిరేకమని మరొకసారి తెలియజేసింది. ధరలతో సమానంగా జీతాలు

కూడా పెరిగేందుకు అనువైన చర్యలు తీసుకుంటామని స్పష్టం చేసింది.

అ. భా. ట్రే. యూ. కాంగ్రెస్‌కూడ ప్రభుత్వానికి, యజమానులకు యిట్టి సమాధానమే చెప్పదలచుకుంది. ధరల పెరుగుదలకు కారణం మనంకాదు. ప్రభుత్వం జీవితావసర వస్తువులను నిర్ణీతధరల కందించ డానికి ఒప్పుకోకపోతే కార్మికుల కష్టాన్ని దోచుకోడంద్వారా యజమానులు సంపాదిస్తూన్న విపరీతలాభాలను ప్రణాళికకోసం ప్రజాశ్రేయస్సుకోసం ప్రభుత్వం వశపరచు కోకపోతే, పన్నుల భారంతో పేదల్ని బాధపెట్టడం మానకపోతే — ట్రేడ్ యూనియన్లు జీతాలకోసం పోరాడ్డం తప్పనిసరి అవుతుంది. యిప్పటికే అధ్వాన్నంగా ఉన్న తమ స్థితిగతులను మరింత అధ్వాన్నం చేసుకోడానికవి అంగీకరించవు.

## 27. జీతాలను సర్వత్రా పెంచాలనే డిమాండు

దేశంమొత్తంమీద జీతాలను పెంచేసమస్యను చర్చించవలసిందని మూడేండ్ల క్రిందట అ.భా.ట్రే.యూ. కాంగ్రెసు యజమానుల్నీ ప్రభుత్వాన్నీ అభ్యర్థించింది. అప్పటికున్న జీతాలు తక్కువగాఉండడంవల్ల, ఉత్పత్తి పెరుగుతూండడంవల్ల, లాభాలు – ధరలు కూడా పెరుగుతూండడం వల్ల సగటున 100 కి 25 చొప్పున జీతాలను పెంచవలసిందని డిమాండు

చేసింది.హింద్ మజ్దూర్ సభ, జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు కూడా మనతో ఏకీభవించాయి.

ఈ రెండు సంస్థలు భారతదేశంలోని యజమానుల సంస్థలతో కలిసి ఒక సంయుక్త సంప్రతింపుల సంఘాన్నేర్పర చాయి. ఇందులో అ. భా. ట్రే. యూ. కాంగ్రెసుకు ప్రాతినిధ్యంలేకుండా చేశారు. ఈ సంఘం అనధికార సంస్థ అయినప్పటికీ, ప్రభుత్వం దానికి త్రైపాక్షిక సంస్థలకిచ్చే హోదా యిచ్చింది. ఈ సంస్థద్వారా జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు, హింద్ మజ్దూర్ సభ యజమానులతో జయప్రదంగా ఒప్పందాలు చేసుకున్నట్లు తెలుస్తోంది. లోగడ త్రైపాక్షిక స్థాయీసంఘం సమావేశమైనప్పుడు పారిశ్రామిక తగాదాల చట్టంలోని 33 (ఎ) సెక్షన్‌కి సవరణ ప్రతిపాదింపబడింది. దాని ప్రకారం ట్రిబ్యునల్ యెదుట ఏదైనా తగాదా విచారణలో ఉన్నపుడు యజమానులు కార్మికుల్ని రిట్రెంచి చేయడానికి లేదా డిస్మిసు చేయడానికి అధికారం కలిగి యుంటారు. ఈ సవరణను అ. భా. ట్రే. యూ. కాంగ్రెసు వ్యతిరేకించింది. కాని పైసంయుక్త సంప్రతింపుల సంఘం తన ఆమోదం తెలియజేసింది. వెంటనే ప్రభుత్వం యీసవరణను కార్యరూపంలో పెట్టింది. కార్మిక వర్గానికి యిది చాల హానికరంగా పరిణమించింది. కాని జీతాల పెంపుదల విషయం వేరు. మొదట సంప్రతింపుల సంఘం యీ సమస్యపై మౌనం వహించింది. కాని కార్మికుల్లో ఆందోళన ఎక్కువవడం చూచి జాతీయ ట్రేడ్‌యూనియన్

కాంగ్రెస్, హింద్ మజ్దూర్ సభ అందులో పాల్గొన నారంభించాయి. దీన్ని యజమానులు నిరసించారు. 1957 జనవరి 19 వ తేదీని సమావేశమైన సంయుక్త సంప్రతింపుల సంఘం తన మినిట్స్‌లో యిలా వ్రాసుకొంది:

"పారిశ్రామిక సంబంధాల స్థితిగతులను పర్యాలోకించే సందర్భంలో యజమానుల ప్రతినిధులు ఒక విషయానికి విచారం తెలియజేశారు. ఒక వైపు సంయుక్త సంప్రతింపుల సంఘం జీతాలను క్రమబద్ధమొనర్చే సమస్యను పరిష్కరించడానికి క్రిందా మీదా పడుతోంటే, మరోవైపు కార్మికుల ప్రతినిధులు జీతాల పెంపుదల కొరకు యితర రూపాల్లో ఆందోళన చేయడం ప్రారంభించారు. ఈ విధంగా, సంప్రతింపుల సంఘం సృష్టించిన మంచి వాతావరణాన్ని పరస్పర విశ్వాసాన్ని వారు పాడు చేసిన వారయారు.

"ఇటీవల కార్మికులు జీతాలను పెంచవలసిందని డిమాండు చేయడం వల్ల యజమానులు పొరబాటుగా అర్థంచేసుకొని యుంటారని కార్మికుల ప్రతినిధులు చెప్పారు. అట్టిచర్య సంప్రతింపుల సంఘంపట్ల అవిశ్వాస ప్రకటనగా పరిగణింపబడ కూడదని వారన్నారు. సంయుక్త సంప్రతింపుల సంఘమంటే తమకు సంపూర్ణ విశ్వాస మున్నదని చెప్పారు. అయితే సంప్రతింపుల సంఘాన్ని శక్తివంత మొనర్చవలసియుండనీ, పారిశ్రామిక సంబంధాల్లో అది తన ప్రాబల్యాన్ని రుజువుచేసుకోవలసి యుండనీ వారన్నారు. అలా జరిగే వరకు కార్మికులు యితర చట్టసమ్మత పద్ధతులకు దిగడంతప్ప వేరుమార్గం లేదన్నారు."

(ఇండియన్ లేబర్ గెజెట్ : 1957 ఫిబ్రవరి; పేజీ 645)

ప్రభుత్వం 1957 సెప్టెంబరులో కార్మిక ప్రతినిధుల సమావేశాన్ని ఏర్పాటు చేసినప్పుడు అ. భా. ట్రే. యూ. కాంగ్రెసు యీసమస్యను ముందుకు తెచ్చింది. కాని యెవరూ

దీన్నిలోతుగా పరిశీలించడం గాని యావద్భారత సమస్యగా దీన్ని ఆలోచించడంగాని చేయలేదు. ఇట్టి వైఖరి సహజంగా కార్మికుల్లో తమకోర్కెలకై పోరాడి తీరాలనే అభిప్రాయాన్ని కలిగిస్తుంది.

కాని యింతవరకు కార్మికులు యీసమస్యపై సమిష్టిగా పోరాడ్డం సాధ్యపడలేదు. వివిధ ట్రేడ్ యూనియన్లు, ట్రేడ్‌యూనియన్ సమాఖ్యలు తమంతటతాము పోరాడి కొన్ని సౌకర్యాలను పొందాయి.

గత అనుభవంనుంచి మన కొక విషయం బోధపడుతుంది. కార్మికులందరి జీతాలను 100 కి 25 చొప్పున పెంచాలని మనం నిర్దిష్టంగాను, ఖచ్చితంగాను అడిగిన కోర్కెను కొన్ని యూనియన్లు ముక్కస్యముఖార్థః అర్థంచేసుకున్నాయి. కొన్ని సందర్భాలలో చాలచిన్న యజమానుల్ని సైతం "100 కి 25 కన్న కొంచెం కూడా తగ్గకూడదు," అని డిమాండుచేశాయి. మరికొన్ని సందర్భాలలో చిన్నయజమానులు తమ సంస్థలను మూసివేసుకొని యితర ప్రాంతాలకు తరలివెళ్లడం కూడా సంభవించింది. కొన్ని సందర్భాలలో కార్మికులు 100 కి 25 కన్న ఎక్కువ పెంపుదలను సాధించుకోగలిగారు. ఈ కారణాలవల్ల మన డిమాండును మార్చుకోడం అవసరమనీ, "తగు విధమైన పెంపుదల" కోసం పోరాడాలనీ కొందరుసూచించారు. ఏ పరిశ్రమల్లో ఎంతపెంపుదల అవసరమో స్థానిక యూనియన్లే నిర్ణయించు కోవాలన్నారు.

మనం దేశవ్యాపితంగా ఒక కోర్కెను కోరినప్పుడు దాని అర్థం సహజంగా దేశంమొత్తం మీద కార్మికులకు జీతాల రూపంలో చెల్లించే మొత్తాన్ని సగటున 100 కి 25 చొప్పున పెంచాలని మాత్రమే. ఒక్కొక్క పరిశ్రమలో లేదా వృత్తిలో యివ్వవలసిన హెచ్చుజీతం ఆయా పరిస్థితుల్ని బట్టి ఉంటుంది. మొత్తంమీద అన్ని పరిశ్రమలు, వృత్తులు 100 కి 25 చొప్పున కార్మికుల జీతాలను పెంచగల స్థితిలో ఉన్నాయని మాత్రం స్థూలంగా మనం అభిప్రాయపడ్డాం. దీని అర్థం ప్రతి పరిశ్రమలోను, ప్రతిచోట యీనిష్పత్తిలోనే యివ్వాలని కాదు.

సంఘటిత పరిశ్రమల్లో కనీసజీతం రు. 100 ఉండాలన్న డిమాండుకూడ యిలాంటిదే. దీన్ని అమలు జరపడంలోకూడ ముక్కుకు సూటిగా ఆలోచించడం జరుగుతోంది. కొన్ని చోట్ల వెనుకబడిన పరిశ్రమల్లో కూడ యీకనీస వేతనం చెల్లించాలని పట్టుపట్టడం జరిగింది. అందుచేత మనం త్రైపాక్షిక సమావేశం యొక్క తీర్మానానుసారం కనీస వేతనాలను నిర్ణయించాలని కోరుతున్నాం. మరీవెనుక బడిన కొన్ని పరిశ్రమలు అంత మొత్తం చెల్లించ లేక పోతే, అట్టి పరిశ్రమలు మూసివేయబడకుండా చూడవలసిన అవసరాన్ని కనీసవేతనం చెల్లించాలన్న కోర్కెనూ సమ్యక్ దృష్టితో సమన్వయ పరచి నిర్ణయాలు తీసుకోవాలి.

# 28. నూతన త్రైపాక్షిక ఒడంబడికలు

ఎప్పుడైతే యజమానులు అధిక వేతనాల కొరకు జరిగే కార్మికుల ఉద్యమాన్ని నిరోధించలేమని గ్రహించారో, అప్పుడు వారు మామూలు పెట్టుబడిదారీ పద్ధతులను చేబట్టారు. కార్మికుల్ని రిట్రెంచి చేయడం, రేషనలైజేషన్ ప్రవేశపెట్టడం, ఉద్యోగాల్లో ఉన్నవారికి పోటీగా నిరుద్యోగుల్ని దింపడం-మొదలైన పద్ధతులను పూనుకున్నారు.

రేషనలైజేషన్ స్కీములను ప్రవేశ పెట్టేందుకు యజమానులు సాంకేతిక పద్ధతుల ద్వారా ఉత్పత్తిని ఎక్కువ చేసేపేరుతో పంచవర్ష ప్రణాళిక క్రింద విపరీతమైన మొత్తాలను శాంక్షన్ చేయించుకున్నారు. యజమానులు కొన్ని కొత్త యంత్రాలను కొన్నమాట నిజమే. కాని వాటివల్ల దేశ మెంతవరకు లాభపడిందో మనకు తెలియదు. ఒకటి మాత్రం మనమెరుగుదుం. బొంబాయి బట్టలమిల్లు పరిశ్రమలోను జూట్‌మిల్లు పరిశ్రమలోను వేలాది కార్మికుల్ని యజమానులు బర్తరఫు చేశారు. పెట్టుబడిదారీ విధానం అమలు జరుగుతూన్న అన్ని దేశాల్లోను రేషనలైజేషన్ స్కీములు, అధికోత్పత్తి ప్రణాళికలు కార్మికుల బర్తరఫుకూ, వారి బాధలెక్కువ కావడానికీ నిరుద్యోగానికీ మాత్రమే దారితీస్తాయి. భారతదేశంలో కూడ యిలాగే జరుగుతోంది.

రేషన లైజేషను స్కీములు అమలు జరుగుతూన్న పరిశ్రమల్లో బర్తరఫుకాకుండా మిగిలియున్న కార్మికులకు జీతాలు కొద్దిగా పెంచబడేమాట నిజమే; కాని మొత్తం మీద జీతాలరూపంలో కార్మికుల కిచ్చే సొమ్ము తగ్గుతుంది; వారి పరిస్థితి మరింత అధ్వాన్నమవుతుంది.

పెట్టుబడిదారీ వ్యవస్థలో సాంకేతికాభివృద్ధి పెద్ద పెద్ద పెట్టుబడి దారుల లాభాల కొరకు, గుత్తాధికారం చెలాయించేందుకు మాత్రమే ఉపయోగపడుతుంది. ట్రేడ్ యూనియన్లు ఎక్కువ జీతాలకొరకు, తక్కువ పని గంటల కొరకు, ప్రజాసామాన్యం ధరల తగ్గుదల కొరకు పోరాడక పోతే - ప్రజలకు సాంకేతికాభివృద్ధి వల్ల ప్రయోజనం కలుగదు; వారి జీవితం చక్కబడదు; తాత్కాలికంగా కొన్ని సౌకర్యాలు లభించినప్పటికీ అవి పోరాటాల్లోను సంక్షోభాల్లోను వ్యర్థమవుతూ ఉంటాయి. సోషలిస్టు ఆర్థికవ్యవస్థ నెలకొల్పబడక పోతే, సాంకేతికాభివృద్ధినల్ల, ఉత్పత్తి శక్తి పెరుగుదలవల్ల కార్మికులకు గాని ప్రజాసామాన్యానికి గాని శాశ్వత మైన మేలు కలుగదు.

కార్మికుల్లో ఆందోళన పెరిగే కొద్దీ భారత ప్రభుత్వాన్ని యీసమస్యలన్నీ ఎదుర్కొన్నాయి. వేతనాలను నిర్ణయించడంలో అనుసరించదగు విధానం, రేషన లైజేషన్, పరిశ్రమల్లో శిక్షణ, గృహవసతి, కార్మికులకు విద్య మొదలైన సమస్యలను చర్చించేందుకు 1957 జూలైలో కార్మిక ప్రతినిధుల 15వ సమావేశం ఏర్పాటుచేయ బడింది.

ఆ సమావేశం యొక్క ఫలితాలు గత అయిదారు మాసాలుగా కార్మికోద్యమం ముందున్నాయి.

కార్మికుల జీతాలను అదుపులో ఉంచే ప్రయత్నం విఫలమైందనీ, వాటిని పెంచడం అత్యావశ్యకమనీ యీసమావేశం పరోక్షంగా అంగీకరించింది. కార్మిక మంత్రి శ్రీ నందా తన ప్రారంభోపన్యాసంలో చాల జాగ్రత్తవహిస్తూ యిలా చెప్పారు :

"జీతాల పద్ధతికి సంబంధించినంతవరకు వాటిని అదుపులో ఉంచాలని నేను చెప్పను. అదేసమయంలో పరిస్థితులను దృష్టిలో ఉంచుకోకుండా జీతాలను పెంచాలనే కోర్కెను కూడా యీ సమావేశం అంగీకరిస్తుందని అను కోను."

ఈ మహాసభ మొత్తం కార్మికుల జీతాలను పెంచమని కోరకుండా, కనీస వేతనాలను మాత్రం పెంచ వలసిన అవసరంఉందని తీర్మానించింది. ఇందుకు అది కనీస వేతనాల సంఘం యొక్క సిఫార్సులను ప్రాతిపదికగా తీసుకొంది.

ఈ ఒడంబడికను అమలు జరిపేనిమిత్తం ప్రభుత్వం కొన్ని పరిశ్రమల్లో వేతనాల బోర్డులను నియమించడానికి అంగీకరించింది. అవి : జూట్, ప్లాంటేషన్లు, బొగ్గుగనులు తప్ప మిగతా గనులు, ఇంజనీరింగు, ఇనుము - ఉక్కు, రసాయనాలు, పంచదార, సిమెంటు, రైల్వేలు, పోస్టు - టెలిగ్రాఫ్ సర్వీసు, రక్షణశాఖలోని సివిలియన్ ఉద్యోగులు, ఓడరేవులు - నౌకా నిర్మాణ కేంద్రాలు. ఈ పరిశ్రమల్లో

వేతనాల బోర్డులను నియమించాలన్న సూచనను కార్మిక ప్రతినిధులు చేశారు; యజమానుల ప్రతినిధులుదాన్ని వ్యతిరేకించారు. అయినా ప్రభుత్వం కార్మిక ప్రతినిధుల సూచనను అంగీకరించింది.

ప్రభుత్వం దీన్ని అమలుజరిపితే, దీన్నొక ముందడుగుగా పరిగణించవచ్చు. కార్మిక ప్రతినిధుల సమావేశం రేషన లైజేషన్‌ని గురించి చేసిన నిర్ణయం కూడా ఒక ముందడుగేనని చెప్పాలి. ప్రస్తుత పరిస్థితుల్లో ఆర్థికంగా దేశ శ్రేయస్సుకు దోహదం చేయని రేషన లైజేషన్ స్కీములను నిలుపుజేసేందుకు ప్రభుత్వం కొన్ని చర్యలు తీసుకోవచ్చునని పై సమావేశం అంగీకరించింది. ఈ సందర్భంలో అ. భా. ట్రే. యూ. కాంగ్రెస్ ఒక సూచన చేసింది. ఏ యజమాని అయినా తన ఫ్యాక్టరీలో రేషన లైజేషన్ పద్ధతుల్ని ప్రవేశ పెట్టదలచుకొంటే, ముందుగా అతడు "జాతీయానసరాల సర్టిఫికేట్" ఒకటి చూపించాలని చెప్పింది. తర్వాత అతడు మూడు షరతుల కంగీకరించాలని చెప్పింది: 1 కార్మికుల్ని రిట్రెంచి చేయకూడదు 2. లాభాల్లో యజమానులకు, కార్మికులకు సమభాగం పెట్టాలి 3. పని భారాన్ని సరిగా అంచనా వేయాలి.

పై సమావేశం జరిగి నాలుగైదు మాసాలయింది. రేషన లైజేషన్ కి వ్యతిరేకంగా కాన్పూరు కార్మికులు వీరోచితంగా పోరాడి రెండు సంవత్సరాలై ... కాని యజ



మానులు పై ఒప్పందాన్ని ఉల్లంఘిస్తున్నట్లు అప్పుడే మనకు సమాచారం అందుతోంది.

"క్రమ శిక్షణ" విషయంలో పై సమావేశం కొన్ని సూత్రాల కంగీకరించింది. వాటికి కార్మికులు, యజమానులు కూడ కట్టుబడియుండాలని నిర్దేశించింది. ఈ ఒప్పందం చాల మంది దృష్టిని ఆకర్షించింది. కారణ మేమంటే సమ్మెకు ముందు యివ్వవలసిన నోటీసు విషయంలోను, మందకొడిగా పనిచేయరాదనే విషయంలోను, శాంతియుతంగా పరిష్కా- రాలు చేసుకొనే విషయంలోను మనం కొన్ని బాధ్యతలు తీసుకున్నాం.

ఇందులో ఆశ్చర్యమేమైనా ఉందా? తప్పకఉంది. కార్మికులు మందకొడిగా పనిచేసే పద్ధతిని తాను వ్యతిరే కిస్తానని అ. భా. ట్రే. యూ. కాంగ్రెసు ఎన్నడూ చెప్పి యుండలేదు. అది ఒక విధమైన సమ్మె అని మనం భావిస్తాం. సమ్మెలలో చట్టవిరుద్ధమైనవి ఉంటాయన్న సూత్రాన్ని కూడ మనం అంగీకరించం. కొన్ని సందర్భాలలో యజమానులు కవ్వించి రెచ్చగొట్టినప్పుడు నోటీసు లేకుండా సమ్మె చేయడం అనివార్యం కావచ్చు.

## 29. బాధ్యతలు ఉభయులవీ

ఈ ఒప్పందాని కంగీకరించడం ద్వారా మన పద్ధతుల్ని కొంతవరకు మా ర్చుకున్నాం. ప్రభుత్వానికి, యజమానులకు



ఇది ఆశ్చర్యం కలిగించింది. బహుశా కొందరు ట్రేడ్ యూనియన్ కార్యకర్తలు కూడా ఆశ్చర్యపడే యుంటారు.

నిజానికి కార్మిక వర్గం క్రమశిక్షణ నెన్నడూ వ్యతిరేకించదు. కార్మికవర్గ నాయకత్వం క్రింద ఏర్పడు పోషలిస్టు వ్యవస్థలో మాత్రమే నిజమైన క్రమశిక్షణ సర్వులకూ స్వాతంత్ర్యం కలిసి ఉంటాయి. ఎందువేతంటే, లక్షలాది ప్రజల జీవితాలను నాశనం చేసే వ్యక్తిగత లాభాలు, దురాశ ఆధారంగా గల పెట్టుబడిదారీ వ్యవస్థలోని అరాచకం అప్పుడు నిర్మూలింప బడుతుంది.

ఐతే మనం జైలు డిసిప్లిన్‌ని గాని, సైనిక డిసిప్లిన్‌ని గాని అంగీకరించం. డిసిప్లిన్‌కి ఒక సాంఘిక ప్రయోజనం వుండాలి; సాంఘిక శ్రేయస్సు దాని ఉద్దేశమై యుండాలి. ప్రజాస్వామ్యం దానికి మూలాధారంగా ఉండాలి. కార్మికుని హక్కులకు, స్వేచ్ఛకు గ్యారంటీ యిచ్చినట్లయితే అతడు సంతోష పూర్వకంగా క్రమశిక్షణను పాటిస్తాడు. అతని ఫిర్యాదును వినాలి మేనేజిమెంటును విమర్శించే హక్కు అతనికుండాలి; అతని న్యాయమైన కోర్కెలను త్వరితంగా యిడేర్చాలి. అతన్ని "కిరాయిమనిషి" గా కాక, సమానహక్కులు స్వేచ్ఛగల కార్మిక పౌరునిగా చూడాలి. అప్పుడాతడు చక్కని క్రమశిక్షణతో పని చేస్తాడు; చురుగ్గా ఉత్పత్తి క్రమంలో పాల్గొంటాడు; పరిశ్రమకు కావలసిన ప్రవర్తనను అలవరచు కొంటాడు. ఈ విషయం

కార్మిక ప్రతినిధుల సమావేశంలో స్పష్టం చేయబడింది. క్రమశిక్షణకు సంబంధించిన ఒప్పందాన్ని ప్రత్యేకంగా కాక, మొత్తం ఒడంబడికలో భాగంగా మనంచూడాలి. ప్రస్తుత మున్నస్టాండింగ్ ఆర్డర్లకు రూపాంతరం కాదు అది. ప్రస్తుత స్టాండింగ్ ఆర్డర్ల ఉద్దేశం ఫ్యాక్టరీని బందిఖానాగా మార్చడం. కార్మికునియందు "చెడునడవడిక," "అవిధేయత" ఎక్కడున్నాయోనని వెతుకులాడ్డం వాటిలక్ష్యం.

సమావేశంలో యజమానులు తమకొత్త బాధ్యతలను నిర్వర్తిస్తారనీ, అందుచేత మనంకూడా మనవిధులను నిర్వర్తించాలనీ సమావేశంలో అంగీకరింపబడింది. బాధలు అనుభవించేదీ, పీడింపబడేదీ మనం; వారు కాదు. అందుచేత మనం యీషరతులను గురించి నొక్కి చెప్పవలసియుంటుంది.

కాని యజమానులు, వారి ప్రతినిధులు త్వరలోనే దీన్ని విస్మరించినట్లు కనిపిస్తుంది. ఒప్పందం యొక్క అసలు అర్థానికి పూర్తిగా విరుద్ధమైన నిబంధనావళి నొకదాన్ని వారు తయారు చేశారు. ఉదాహరణకు వారు తమ ముసాయిదాలో సమ్మెలను, ప్రదర్శనలను నిషేధించారు. అవి యజమానుల్ని "హడలెత్తిస్తాయ"ని అందులో పేర్కొన్నారు. అట్టి అర్థరహితమైన మాటను అ. భా. ట్రే. యూ. కాంగ్రెస్ సహజంగా తిరస్కరించింది. ఆ ఒప్పందాన్ని ధృవపరచవలసిందని మనల్ని అడిగారు. కాని పై షరతులకు అంగీకరిస్తేనే మనం దాన్ని ధృవపరుస్తాం.

ఈ విషయానికి సంబంధించినంతవరకు తెలుసు కోవల సిందేమంటే, మనం జరిపిన పోరాటాలవల్ల, చేసిన త్యాగాల వల్ల యజమానులు, ప్రభుత్వం కార్మికుల జీతాలను అదుపులో ఉంచే విధానాన్ని వదులుకొనేటట్లు చేయగలిగాం. మూలవేనాల్లోనో కరువుభత్యంలోనో బోనసులోనో కొంత పెరుగుదల సాధించుకోగలిగాం. ప్రావిడెంటు ఫండు యించుమించు అన్ని ప్రధాన పరిశ్రమల్లోను ప్రవేశపెట్టబడింది. జీతాలు, సేవన లై జేషన్, రిట్రెంచిమెంటు, ప్రజాతంత్ర హక్కులతో జతచేయబడు క్రమశిక్షణ మొదలైన సమస్యల పై మానవ ప్రేమతో కూడిన ఒక హేతుబద్ధమైన విధానాన్ని యజమానులు, ప్రభుత్వం సూత్ర ప్రాయంగానైనా అంగీకరించేటట్లు చేయ గలిగాం. ఇవన్నీ కార్మికుల విజయాలను తెలియజేస్తాయే గాని పరాజయాలను కాదు.

అందుచేత జీతాలు – పని అనే సమస్య పై మన ముందున్న కర్తవ్యాలు యివి:

1. ధరల పెరుగుదలను బట్టి, కార్మికులు తమ జీవన ప్రమాణాన్ని మెరుగు పరచుకోవలసిన అవసరాన్ని బట్టి జీతాలు కరువుభత్యం తగినంతగా పెరిగేటట్లు చూడాలి; ప్రతికార్మికునికి కనీస వేతనం విధిగా చెల్లింపబడేటట్లు చూడాలి; కరువు భత్యాన్ని జీతంతో కలిపియిచ్చేటట్లు, బోనసు స్కీమును సవరించేటట్లు చూడాలి.

2. రేషనలైజేషను స్కీములు, అధికోత్పత్తి పథకాలు ప్రవేశపెట్టబడే ముందు త్రైపాక్షిక సంఘం అంగీకరించిన షరతులు అమలుజరిగేటట్లు చూడాలి; అలా అమలు జరపబడకపోతే ఆ స్కీములను ప్రతిఘటించాలి.

3. ధరలు తగ్గేటట్లు, అవి స్థిరంగా ఉండేటట్లు చర్యలు తీసుకోవాలని ఒత్తిడిచేయాలి.

4. కరువుభత్యాన్ని లేదా బోనసును సేవింగ్సు సర్టిఫికేట్ల రూపంలో గాని తదితర సర్టిఫికేట్ల రూపంలో గాని మాత్రమే తీసుకోవాలన్న నిబంధనకు వ్యతిరేకంగా ఆందోళన చేయాలి; కార్మికులు అందుకు అంగీకరిస్తే మాత్రం వాటిని బలపరచాలి.

5. ఏ తరగతి ప్రజలకూ నష్టంలేని విధంగా దేశానికంతకూ వర్తించే వేతనాల పద్ధతి నొకదాన్ని రూపొందించి, దానికొరకు ఆందోళన చేయాలి. పేకమిషన్, వేజ్ బోర్డులు త్వరితంగా తమ విధులను నిర్వర్తించేటట్లు ఒత్తిడిచేయాలి.

6. గనులు, రవాణా, రసాయన పరిశ్రమల్లో కార్మికుని ఆరోగ్యానికి, ప్రాణానికి అపాయం ఉంది. అందుచేత, వారికి రోజుకు 7 గంటల పని మాత్రమే యివ్వాలి (జీతంలో కోత కోయకుండా); మిగతా పరిశ్రమలన్నిటిలోను 8 గంటల పనిని ఖాయపరచాలి.

# 4. సాంఘిక భద్రత

## 30. ప్రభుత్వ భీమా స్కీము

భారత ప్రభుత్వం, తన కృషివల్లనే దేశంలో ఉత్పత్తి పెరిగిందనీ, జీతాలు హెచ్చాయనీ గొప్పలు చెప్పుకోడంతో బాటు "ఆసియాలోకల్లా పెద్ద దైవ" సాంఘికభద్రతా స్కీమునుకూడ తానే ప్రవేశపెట్టినట్లు చెప్పుకొంటూంది. జీతాల పెంపుదలవలెనే సాంఘిక భద్రతా స్కీముకూడ కార్మికుల ఆదాయాన్నీ సౌకర్యాలనూ పెంచుతుంది. తత్ఫలితంగా వారి జీవన ప్రమాణం హెచ్చుతుంది.

ఎంప్లాయీస్ స్టేట్ ఇన్సూరెన్సు స్కీము యీరోజున దాదాపు 10 లక్షలమంది కార్మికులకు అందుబాటులో ఉంది. వారి కుటుంబాలకు కూడా యిది వర్తింప జేయబడుతుందని వాగ్దానాలు చేయబడ్డాయి. కాని యింతవరకు అవి యీడేర లేదు.

ఈ స్కీములో ఉన్న అనేక లోపాలను కార్మికులు ఎత్తి చూపుతున్నారు. ఇప్పటి రేట్లను బట్టి యజమానులకన్న కార్మికులే ఎక్కువసొమ్ము చెల్లించుకోవలసి వస్తూంది. 1955 – 56 లెక్కలనుబట్టి యజమానులు రు. 2,25,29'288 చెల్లిస్తే కార్మికులు రు. 2,39,61,280 చెల్లించారు. యజమానులు చట్టం ప్రకారం చెల్లించవలసిన సొమ్మును పూర్తిగా

చెల్లించినట్లయితే, కార్మికులకు అదనంగా రు. 1,35,99,589 తో సమానమైన సౌకర్యాలు లభిస్తాయి.

కార్మికులుచూపే లోపాల్లో మొట్టమొదటిది అధిక సంఖ్యాక కేంద్రాల్లో వైద్యసదుపాయం తగినంతగా లేదనేది. సెలవులు, స్పెషల్ మందులు తదితర సౌకర్యాల విషయంలో నిరంకుశాధికారులు జాగుచేస్తూండడంవల్ల రోగికి మేలుకన్న కీడు అధికంగా కలుగుతోంది.

## 31. ఆసుపత్రుల కుంభకోణం

అనుభవం వల్ల పరిస్థితులు చక్కబడవచ్చుననే ఉద్దేశంతో అ. భా. ట్రే. యూనియన్ కాంగ్రెస్ యీస్కీమును బలపరచింది. బొంబాయి వంటి కొన్ని కేంద్రాల్లో పరిస్థితి కొంత మెరుగుపడ్డప్పటికీ, లోపాలింకా ఉన్నాయి. వాటిలో కొన్ని తీవ్రస్వభావం గలవి.

అన్నిటికంటె అధ్వాన్నంగా నిర్వహింపబడుతూన్న కేంద్రం కలకత్తా. అక్కడ యజమానులు, రాష్ట్రప్రభుత్వం కార్మికుల్ని అనవసరంగా బాధించి రెచ్చగొడుతున్నారు. తద్వారా యీ స్కీమును వారు యించుమించు నాశనం చేయడానికి ప్రయత్నిస్తున్నట్లు కనిపిస్తుంది. బొంబాయి తర్వాత కలకత్తాలో ఎక్కువమంది కార్మికులు యీస్కీము క్రిందికి వస్తారు. ప్యానెల్ పద్ధతికూడా అక్కడ అమల్లో ఉంది; డాక్టర్లు మొత్తంమీద సహకార స్వభావంగలవారు. అయితే

సమస్త విషయాల్లోను ప్రభుత్వం, యజమానులు (కొద్దిమంది తప్ప) ఆటంకాలు పెడుతున్నారు. ఈ పరిస్థితిని గురించి అ. భా. ట్రే. యూ. కాంగ్రెస్ కేంద్ర ప్రభుత్వానికి తెలియ జేసింది. కాని పరిస్థితులు చక్కబడ లేదు.

ఈ స్కీములో అన్నిటికంటె అధ్వాన్నమైన లక్షణం ఆసుపత్రులకొరత. కావలసినంతధనం ఉన్నప్పటికీ ఆసుపత్రులు నిర్మింపబడ్డంలేదు. బొంబాయిలో ఒక ఆసుపత్రిని నిర్మించేం దుకు తయారుచేయబడ్డ స్కీము నాలుగు సంవత్సరాలు గడచినా అమల్లోకి రాలేదు. రోగులు ప్రైవేట్ డాక్టర్ల వద్దకు పంపబడుతున్నారు. అక్కడ ఒక్కొక్కపడకకు అయే ఖర్చు ప్రభుత్వస్కీములో నుంచి చెల్లింపబడుతోంది. ఈ విధంగా ఎంప్లాయీస్ స్టేట్ ఇన్సూరెన్స్ స్కీములో రోగుల్ని అద్దెకిచ్చే పద్ధతి ఒకటి అమలుజరుగుతోంది. దీని వల్ల అనేకమంది వ్యక్తులు కొద్ది పడకలను నిర్మించి రోగు లకు సదుపాయాలు చేయకుండా, స్టేట్ ఇన్సూరెన్స్ స్కీమునుంచి విస్తారంగా ధనసహాయం పొందుతున్నారు. కలకత్తా బొంబాయి నగరాల్లో యీ కుంభకోణం చాలా పెద్ద ఎత్తున సాగుతోంది.

ఆసుపత్రులలో క్షయ రోగులకు అవకాశాలు కల్పించే సమస్య చాల తీవ్రరూపం ధరిస్తోంది. కార్మికులకు తక్కువ జీతాలివ్వడంవల్ల, పనిభారం పెంచడంవల్ల, గృహవసతి అధ్వా న్నంగా ఉండడంవల్ల, పుష్టికరమైన ఆహారం లేకపోవడంవల్ల

చాల హెచ్చుమంది క్షయరోగానికి గురిఅవుతున్నారు. కాని వారి విషయమై ఎవరూపట్టించుకోడంలేదు. కారణమేమంటే భీమా చేయించుకున్న వారికి ఆసుపత్రులలో కొద్దిరోజులు మాత్రమే చికిత్స చేస్తారు; క్షయరోగులు అంతకన్న ఎక్కువ రోజులు చికిత్సపొందడానికి అవకాశమున్నప్పటికీ, దీర్ఘకాల చికిత్సకు అవకాశాల్లేవు.

కొంతకాలం మాత్రమే పనిచేసేవారి పరిస్థితి, రిట్రెంచి చేయబడ్డవారి పరిస్థితి, శిక్షవిధింపబడినవారి పరిస్థితి, ట్రేడ్ యూనియన్ కార్యకర్తల పరిస్థితి మరీఘోరంగా ఉంది. ఇట్టి వారికి వైద్యసహాయం కలుగజేసే విషయాలలో అధికారులు కార్పణ్యం వహిస్తున్నారు.

## 32. పరిస్థితిని చక్కదిద్దేందుకు పోరాటం అవసరం

ఈ స్కీమును గురించి వస్తున్న ఫిర్యాదుల దృష్ట్యా ప్రభుత్వం దీన్ని చక్కదిద్దకపోతే, మన పలుకుబడిక్రింద ఉన్న అనేక కేంద్రాలు కార్మికుల్ని పోరాటానికి సిద్ధపడవలందిగా సలహాయివ్వవలసి వస్తుంది. అయితే, అ. భా. ట్రే. యూ. కాంగ్రెస్ అట్టి పరిస్థితి రావాలని కోరదు. ఎందుచేతంటే, యీ స్కీములో లోపాలున్నాయనేమాట నిజమే అయినప్పటికీ, మొత్తంమీద కార్మికులకది లాభదాయకమైనది. మనం సంఘటితంగా పనిచేస్తే దానినుంచి యిప్పటికన్న ఎక్కువ ఉపయోగం పొందవచ్చు.

## 33. ప్రావిడెంట్ ఫండు

సాంఘికభద్రతా స్కీములో మరొక అంశం యిది వరకుకన్న ఎక్కువ పరిశ్రమలకు ప్రావిడెంట్ ఫండు పద్ధతి వర్తించేలా చేయడం. 1956 మార్చి 31 నాటికి 5,56,922 మందికార్మికులు యీస్కీముక్రింద ఉన్నారు; వారు చెల్లించిన సొమ్ము రు. 6 కోట్ల 37 లక్షలు. 1956 లో ప్రావిడెంట్ ఫండు స్కీముక్రింద సుమారు రు. 20 కోట్లనిధి ఉంది. అందులో రు. 17 కోట్లు ప్రభుత్వ సెక్యూరిటీల రూపంలో నిల్వచేయబడింది.

ప్రస్తుతం యీనిధి మరీ కేంద్రీకృత పద్ధతుల్లో నిర్వహింపబడుతోంది; అందుచేత కొన్ని మార్పులు తీసుకురావడం అవసరం. ఇప్పుడీసమస్య పరిశీలనలోఉంది. రెండవ పంచవర్ష ప్రణాళిక క్రింద అనేక సందర్భాలలో కార్మికులు చెల్లించవలసిన రేటు 100 కి $6\frac{1}{4}$ నుండి $8\frac{1}{3}$ కి హెచ్చింపబడుతూంది. (మూలవేతనాన్నీ కరువు భత్యాన్నీ కలిపితే వచ్చే మొత్తంలో).

కార్మికులు చెల్లించిన ప్రావిడెంట్ ఫండు నిధులు చట్టా వ్యాపారంలోనో, కంపెనీ లావాదేవీలలోనో కొన్ని కంపెనీలు ఉపయోగించాయి. ఇట్టి మోసాలింకా ఆగలేదు. అలాంటి కంపెనీలు దివాళాతీసినప్పుడు జీతాలు, జీతాలతో బాటు నిధులు గంగపాలవుతున్నాయి. చట్టం ప్రకారం నిరుద్యోగులకు చెల్లించవలసిన సొమ్ము యీ విధంగా అపహ

రింపబడుతోంది. ఉదాహరణకు షోలాపూర్, జల్గాం, రాజస్థాన్ మొదలైనచోట్ల అనేక బట్టలమిల్లులు మూతపడ్డప్పుడు యిట్టిమోసమే జరిగినట్లు రుజువయింది. అయితే, పరిష్కార మార్గం కనబడ లేదు. కారణమేమంటే, ప్రభుత్వం యీనిధుల స్థానే మిల్లుల ఆస్తిని స్వాధీన పరచుకొనేందుకు అధికారం లేదని చెప్పారు.

మోసగాండ్రైన యజమానులు దివాళాతీసి మిల్లును మూసివేసిన తర్వాత, ప్రావిడెంట్ ఫండు నిధులతో ఆమిల్లును నడుపుకోవలసిందని కార్మికులకు సలహాయిచ్చిన సందర్భాలు కొన్ని ఉన్నాయి. నిరుద్యోగంవల్లనో, రిట్రెంచి మెంటువల్లనో బాధపడే కార్మికులు అందుకంగీకరించిన సందర్భాలుకూడా ఉన్నాయి. సాధారణంగా యజమానులు కార్మికుల జీతాలను తగ్గించేటందుకు, ఫ్యాక్టరీకి వారినిబంధించి యుంచేందుకు మాత్రమే యిట్టి సూచనలు చేయబడుతూ ఉంటాయి. కార్మికులుకూడా మిల్లులో భాగస్వాములేనన్న భావాన్ని వారిలో కలిగించడం ద్వారా వారి పనులలో కృతకృత్యులవుతున్నారు. ఇట్టి విధానాన్ని మనం నిరుత్సాహపరచాలి. అట్టి మేనేజిమెంటులో కార్మికులు పాల్గొనేటట్లు నిజమైన, నిర్దిష్టమైన మార్గాన్ని యూనియన్ నాయకత్వం చూపగల్గినప్పుడే అందుకంగీకరించాలి. ఈ సమస్యను చాల జాగ్రత్తగా పరిష్కరించవలసి యుంటుంది. ద్రవ్య విషయాల్లో కార్మికు లెన్నడూ పెట్టుబడిదార్ల మోసపుఎత్తులకు సరితూగలేరు.

సాంఘిక భద్రతకు సంబంధించిన పైరెండు స్కీములూ కార్మికుని సొంత సంపాదన మీద ఆధారపడియున్నాయి. కార్మికుడు రెక్కలుముచుకొని పనిచేస్తూ, యజమానికి లాభాలు సంపాదించి పెట్టేంతకాలం అతనికి భద్రతఉంటుంది. అప్పుడు యజమాని తన లాభాల్లో ఒక స్వల్పభాగాన్ని కార్మికుని నిల్వ సొమ్ముతో కలుపుతాడు. ఈ నిల్వసొమ్ము కార్మికుని సంపాదనలో ఒక భాగం. ఈ విధంగా, రెండు స్కీములలోనూ యజమాని కొంతసొమ్ము చెల్లించవలసిన విధాయకం ఉన్నప్పటికీ, కార్మికుడు తన సంపాదనలో కొంత భాగాన్ని వెంటనే ఒదులుకోవలసివస్తూంది. ప్రస్తుతం కార్మికుని సంపాదనలో 100 కి దాదాపు 10 వంతులు యీ విధంగా తిరిగి ప్రభుత్వానికో ప్రైవేట్ యజమానికో పెట్టుబడిగా ఉపయోగపడుతోంది. నిజానికి ఇలాంటి పెట్టుబడి సేకరణ ముఖ్యమైన వనరులలో ఒకటిగా రెండవ పంచవర్ష ప్రణాళిక పేర్కొంది.

## 34. నిరుద్యోగ, వృద్ధాప్య భీమా

కార్మికుడు ముసలివాడైతేగాని, వికలాంగుడైతేగాని యీ నిల్వధనం అతనికి లభిస్తుంది. మరొకరి పెట్టుబడిని వృద్ధిచేయడంకోసం జీవయాత్రగడిపిన కార్మికుడు చివరిరోజున తన పెట్టుబడిమీద ఆధారపడవలసి వస్తోంది. కాని అది చాల తక్కువ; జీవితావసరాల ధరలు అతివేగంగా మారుతున్నాయి. అందుచేత అతని పేరనున్న ద్రవ్యనిధి వృద్ధా

ప్యంలో (అంతవరకు అతడు జీవించగల్గితే) అతనికెంతమాత్రం సరిపోదు.

మన దేశంలో అధికసంఖ్యాక కార్మికులు ముసలితనం వరకు జీవించగల్గడం దుర్లభం. మన ఆహారం ఎంత అధ్వాన్న మైనదంటే, పుష్టికరమైన ఆహారం లేకపోవడంవల్ల ఏ దేశం లోనూ ఎవరూ చనిపోనంత త్వరగా మన ప్రజలు చనిపో తున్నారు.

తర్వాత నిరుద్యోగ సమస్య, రిట్రెంచి మెంటు సమస్య ఉన్నాయి. పైనిధి నిరుద్యోగ సమయాల్లో లేదా రిట్రెంచి మెంటు జరిగినప్పుడు ఉపయోగపడాలి.

మన సాంఘికభద్రతా స్కీము, మన దేశసంపద ఉన్నత స్థాయిలో లేనందున బాగా అభివృద్ధి చెందిన పారిశ్రామిక దేశాల్లోవలె నిరుద్యోగులకు సహాయంచేసే స్కీమును, లేదా భీమాస్కీమును లేదా వృద్ధాప్యంలో పింఛన్లు యిచ్చే స్కీమును పెద్దయెత్తున అమల్లో పెట్టలేకున్నాం. అందుచేత ప్రావిడెంట్ ఫండు ఒక్కటే అన్ని విపత్కర పరిస్థితుల్లోను ఆదుకోవలసియుంది. చనిపోయిన తర్వాత ఉత్తర క్రియలకు కావలసిన సొమ్ముకూడా దానినుంచే రావలసియుంది!

కార్మికులు శ్రమించి సృష్టించుకున్న లాభాలనుంచి పనిచేస్తూనిరుద్యోగులయే వారికైనా కొంతవరకు సహాయం చేయడానికి అవకాశం లేకపోలేదు. అయితే పెట్టుబడిదారీ

వర్గం యొక్క క్రౌర్యంవల్ల, మనకు తగినంతబలం లేకపోవడం వల్ల ఏదో ఒక ప్రత్యక్షచర్యకు దిగితేగాని కనీసం రిట్రెంచి మెంటు భృతి అయినా లభించడంలేదు; 'లే ఆఫ్' పరిహార మైనా (కొన్ని తరగతుల పనివారికి సంవత్సరం పొడుగునా పని ఉండదు; అట్టి వారికి పనిలేనప్పుడిచ్చే సొమ్మును 'లే ఆఫ్' పరిహారం అంటారు) యివ్వడంలేదు.

కార్మికులు బ్రహ్మాండమైన పోరాటంజరిపి రిట్రెంచి మెంటు భృతి సాధించుకున్నారు. కాని యజమానులు వేసిన దావాపై సుప్రీంకోర్టు తీర్పు చెబుతూ అలాంటి చర్య చెల్లనేరదని చెప్పింది. అందువల్ల లక్షలాది కార్మికులు కోట్ల రూపాయలునష్టపడ్డారు; న్యాయంగా తమకు రావలసిన సహాయాన్ని పోగొట్టుకున్నారు. అయితే విచిత్రమేమంటే, ప్రజల క్షేమాన్ని గురించి, సాంఘిక భద్రతను గురించి గొప్పలు చెప్పుకొనే సంక్షేమ ప్రభుత్వం పై సౌకర్యాన్ని పునరుద్ధరించేందుకు ఎట్టి చర్య తీసుకో కుండా నెలల తరబడి మౌనం వహించింది. కార్మికులు తీవ్రరూపంలో నిరసన ప్రకటించినప్పుడు మాత్రమే పార్ల మెంటు చట్టంద్వారా రిట్రెంచిమెంటు భృతి వెనుకటి మాసాలకు కొద్దిగామాత్రం వర్తించేటట్లు పునరుద్ధరింప బడింది.

# 35. ప్రసూతి సౌకర్యాలు

సాంఘిక భద్రత విషయంలో ఇప్పటికన్న ఎక్కువగా ప్రభుత్వం సహాయం పొందవలసినశాఖ ప్రసూతి సంరక్షణ. కార్మికుడు కుటుంబ నియంత్రణ యొక్క అవసరాన్ని గుర్తించి నప్పటికీ, మానవ జీవితం కొనసాగాలంటే సంతాన సృష్టి అనివార్యమవుతుంది; కార్మికుల్లో యిది మరీ హెచ్చు. అయినా ప్రసూతి సౌకర్యాలు బహుస్వల్పం. మాతాశిశువులు సమాజంలో నేరస్థులో, బిచ్చగాళ్లో అయినట్లు యీ సమస్యను పరిశీలించడం జరుగుతోంది. కార్మిక స్త్రీ ఫ్యాక్టరీలో యజమాని కొరకు పనిచేస్తోంది; అందుచేత ఆమెకు ప్రసూతి సౌకర్యాలు కలిగించవలసిన బాధ్యత యజమాని మీద ఉంది. కాని యీనాడు రోజుకు 12 అణాల చొప్పున మాత్రమే ఆమెకు సహాయం లభిస్తోంది. జీవితావసర వస్తువుల ధరలు అధికంగా ఉన్న నేటి పరిస్థితుల్లో యిదిచాల తక్కువ. ఇంతకంటె ముఖ్యమైన విషయమేమంటే, కార్మిక స్త్రీ ప్రసవించిన మరుక్షణం నుంచీ యజమాని ఆమెను డిస్మిసు చేయడానికి ప్రయత్నిస్తూ ఉంటాడు; ఏ నిమిషంలో ఆమె బయటికి నెట్టబడుతుందో ఎవరికీ తెలియదు.

ప్రభుత్వశాఖల్లో సైతం వివాహ, ప్రసూతి విషయాల్లో స్త్రీలపై రకరకాలైన నిరంకుశ నిబంధనలు, మధ్య యుగాలనాటి ఆంక్షలు అనేకం విధింపబడుతున్నాయి.

# 36. గృహవసతి

అన్ని ప్రాణులకు తలదాచుకోడానికి ఆశ్రయం అవసరం. కార్మికుని విషయంకూడా యింతే. కాని మానవుడు ఎట్టి ఆశ్రయం లేకుండా ప్రాణాలను కాపాడుకోగల శక్తిని సంపాదించడంవల్ల గృహవసతి సాంఘిక భద్రతా స్కీములో ఒక అంశంగా గుర్తింపబడుటలేదు. కార్మికులకు గృహాలు కట్టించడంవల్ల యజమానులకు "మంచిరాబడి" ఉండదుగనుక ప్రభుత్వం సబ్సిడీలిచ్చి సహాయపడుతుందంటూ ప్రకటనలు అనేకం వెలువడ్డాయి. కాని యింటి యజమానులు —వారు ఫ్యాక్టరీ యజమానులు కావచ్చు, తదితరులైనా కావచ్చు - ఎల్లప్పుడూ మురికి పేటలవల్ల ఎక్కువగా లాభపడుతున్నారు. ఇంచుమించు ఎలాంటి పెట్టుబడిలేకుండా మురికిపేటలు విరరీతమైన ఆదాయాన్నిస్తున్నాయి. అన్నిరాజధానుల్లోను యీ మురికిపేటలున్నాయి.

ఎప్పుడైతే పాలకవర్గం మురికిపేటల్లోని కార్మికుల్ని కంటికి కనబడకుండా దూరప్రదేశాలకు పంపివేయ నిశ్చయించుకొందో, అప్పుడు సిరసన పరంపరలు బయల్దేరాయి; గృహనిర్మాణం ఒక సమస్యగా ముందుకొచ్చింది.

ప్రభుత్వం కోట్లరూపాయలు సబ్సిడీలుగా - అంటే యజమానులకు కానుకలుగా - చెల్లించింది. కాని కొన్నిచోట్లతప్ప 'యిండ్లు' అనే పేరుతో పిలువబడవగ్గ నిర్మాణా లెక్కడా తయారుకాలేదు.

సహకార గృహనిర్మాణ స్కీముయెడల మేమంటే, పాలకవర్గ పార్టీకి భక్తులుగా ఉంటేనో, "అవసరమైన అవినీతి"కి పాల్పడితేనో తప్ప గృహనిర్మాణ సహకార సంఘాలు గాని కార్మికులుగాని సహాయం పొందడం అసంభవం. ప్రభుత్వం ఎలాగూ యిండ్లకోసం సొమ్ము ఖర్చుపెట్ట వలసిందే గనుక తన డిపార్టుమెంటు ద్వారానే యీ స్కీమును అమలు జరపవలసిందని చివరకు త్రైపాక్షిక సమావేశం పట్టు పట్టింది.

తోటల్లో పనిచేసే కార్మికులకు గృహవసతికై ప్రభుత్వం యిచ్చిన సబ్సిడీ ఒక్క కేరళరాష్ట్రంలోనే చక్కగా వినియోగింపబడిందన్న విషయం గమనార్హం.

## 37. ప్రమాదాలు, రక్షణ యేర్పాట్లు

ప్రమాదాలనుంచి, పారిశ్రామిక వ్యాధులనుంచి రక్షణ కల్పించడమనేది సాంఘిక భద్రతాస్కీములో మరొక అంశం. ఈ నాడు అమల్లో ఉన్న పద్ధతిప్రకారం అన్నిటికన్న మొదట ప్రమాదాలు సంభవించినప్పుడు నష్టపరిహారం యివ్వబడుతోంది; పారిశ్రామిక వ్యాధులకు లోనైనప్పుడది ఆఖరున యివ్వబడుతుంది. ప్రమాదాలు జరిగినప్పుడు భీమాసౌకర్యం కలుగజేయాలనేది ఎంప్లాయీస్ స్టేట్ ఇన్సూరెన్సు స్కీములో ఒక భాగంగా ఉంది. విరిగిన ఒక వేలుఖరీదు, పోయిన ఒక ప్రాణం ఖరీదు భీమాచేయించబడిన పందెపుగుర్రం ఖరీదు కంటె చాలా చాలా తక్కువ అయినప్పటికీ, ఎంతో కొంత

ఖరీదు వాటికుంది; దానిని ఒకప్పుడు సులభంగాను, మరొ కప్పుడు నిరంకుశాధికారుల అడ్డంకుల ద్వారాను చెల్లిస్తున్నారు.

రెండేండ్ల క్రిందట బొగ్గుగనుల్లో జరిగిన ప్రమాదాలు చాలా సంచలనం కలిగించాయి. న్యూటన్ చిక్లే గనిలో జరిగిన ప్రమాదం, బరాధేమో గనిలో జరిగిన ప్రమాదం చాలతీవ్రమైనవి; వాటివల్ల సుమారు 300 మంది చనిపోయారు. అన్ని ట్రేడ్ యూనియన్ సంస్థలు, ప్రభుత్వం, యజమానులు తక్షణమే సహాయం అందజేశారు. విచారణసంఘాలు నియమింప బడ్డాయి. కార్మికులు ముందుగా హెచ్చరించినప్పటికీ మేనేజి మెంటు అన్ని సందర్భాల్లోను రక్షణ యేర్పాట్లు చేయడంలో విఫలమైందనీ, రక్షణనిబంధనలు ఉల్లంఘింప బడ్డాయనీ తేలి పోయింది. ఎందుచేత? రక్షణ యేర్పాట్లుచేస్తే ఖర్చుచాలా అవుతుంది. అంతకన్న నష్టపరిహారం చెల్లించడం చౌక! ఒక ప్రాణాన్ని తీయడానికి ఎంతఖర్చవుతుందో, నిబంధ నలను పాటించడం ద్వారా ఆ ప్రాణాన్ని రక్షించడానికెంత ఖర్చవుతుందో తెలియజేసే పెట్టుబడిదారీ జమాఖర్చులకు సంబంధించిన సమస్య యిది!

చాలకాలంనుంచి అమల్లోఉన్న లోపభూయిష్టమైన గని నిబంధనలను పూర్తిగా సంస్కరించాలని విచారణ సంఘా లన్నీ సిఫార్సుచేశాయి.

ఆవిధంగా నిబంధనలు సవరింపబడ్డాయి. చాల సందర్భాలలో రక్షణ యేర్పాట్లకు బాధ్యత ఎవరిదో నిర్ణయించడం సాధ్యపడలేదని విచారణసంఘాలు ఫిర్యాదు చేశాయి. అందుచేత పాత నిబంధనలు మార్చబడ్డాయి.

అయితే వాటిని అమలు జరపవలసిందెవరు ? అది తేలాలంటే ఏదో ప్రమాదం జరిగి, కొందరు కార్మికులు మరణించాలి ! అప్పుడుగాని ఆ నిబంధనలు అమలు జరుగుతున్నాయో లేదో తెలియదు ! కార్మికునికి కావలసింది ప్రమాదాల నుంచి రక్షణ; నేరస్తుణ్ణి తెలుసుకోవడం మాత్రమే కాదు అతడు కోరేది.

గనులను తనిఖీచేసె ఉద్యోగుల సంఖ్య చాల తక్కువగా ఉన్నట్లు అంగీకరింపబడింది. అలాంటి సందర్భాలలో పై అధికారి సైతం తగినంత అప్రమత్తతతో వ్యవహరించడు. ఎందుచేతంటే, అతడు మరీ నిజాయితీతో, మరీనిక్కచ్చిగా, మరీకఠినంగా మెలిగితే ఆతని ఉద్యోగంకూడా 'ప్రమాదానికి' లోనుకావలసివస్తుంది ! ఇట్టి పరిస్థితుల్లో అనుసరించదగు మార్గం ఒక్కటే ఉంది. గనులలో రక్షణ నిబంధనలెలా అమలుజరుగుతున్నాయో తనిఖీచేసి, రిపోర్టుచేసి, ఖచ్చితంగా వాటిని అమలుజరిపే బాధ్యత ఎన్నుకోబడిన వర్కర్సు కమిటీలకు, ట్రేడ్‌యూనియన్లకు, ఇన్‌స్పెక్టర్లకు జాయింటుగా ఉండాలి. ఈ విషయంలో వారికి స్వతంత్రాధికారాలివ్వాలి.

ఇట్టి ప్రజాతంత్రపద్ధతి అమలు జరిగిననాడే కార్మికులకు ప్రమాదాలనుంచి రక్షణ ఉంటుంది.

# 38. పారిశ్రామిక వ్యాధులు

పారిశ్రామిక వ్యాధులు రాకుండా కార్మికులకు రక్షణ యివ్వటం పెట్టుబడిదారుకు యిష్టం ఉండదు; దాన్ని అతడు ప్రతిఘటిస్తాడు. అవి ఉన్నాయని ఒప్పుకోటమంటే బోలెడు సొమ్ము ఖర్చుపెట్టడానికతడు సిద్ధంగాఉండాలి. అంతేకాదు. తన వ్యవస్థనే అతడు ఖండించుకున్నవాడవుతాడు. ఏదైనా ఒక గనిలో నీళ్ళు ఊరడం భగవదేచ్ఛఅనీ, దాన్ని గురించి ముందుగా తెలుసుకోవడం ఎవరికీ సాధ్యంకాదనీ కొందరు చెప్పవచ్చు. కాస్సేపు అది నిజమేననుకుందాం. కాని ముద్రణాలయాల్లో పనిచేసే కార్మికులు నిరంతరం సీసపుముక్కలతో పనిచేయడంవల్ల వారి శరీరాలు విషపూరితమవుతున్నాయి; మైకా గనుల్లో పనిచేసే కార్మికులు సిలికాసిస్ అను వ్యాధికి లోనవుతున్నారు; రసాయన పరిశ్రమలో పనిచేసే కార్మికులు విషవాయువువల్ల, బట్టలమిల్లులలో పనిచేసేవారు ధూళివల్ల రోగగ్రస్తులవుతున్నారు. ఇలాంటి వ్యాధులన్నీ భగవదేచ్ఛ అని చెప్పలేముగదా! ముందుగా వాటిని గురించి తెలుసుకోటం అసాధ్యం కాదుగదా! ఈ సమస్యపై కార్మిక మంత్రిత్వశాఖ అనేక ఉపయోగకరమైన నివేదికలను ప్రచురించింది. వాటిలో పారిశ్రామిక వ్యాధులను గురించి సమగ్రమైన భోగట్టాఉంది. కాని వాటినుంచి రక్షణ కల్పించటం ఇంకా ఎప్పటికో!

సమగ్రమైన సాంఘిక భద్రత అమల్లోకి రావడాని కింకా చాలకాలం పడుతుంది. అందుకు మన దేశంలో తగి నంత ధనమూ లేదు; ప్రజల్లో చాలినంత పట్టుదలా లేదు.

కార్మికునితో సాంఘిక భద్రతను గురించి మాట్లాడితే నవ్వేటంత అధ్వాన్నంగా అతని జీవిత పరిస్థితులున్నాయి.

అయితే మానవుడు సాంఘిక భద్రత లేనిదే జీవించడం దుర్లభమనీ, దాని రూపాలు దేశ కాలపరిస్థితుల్ని బట్టి ఉంటా యనీ మనం కార్మికుని ఒప్పించవలసియుంటుంది. ఆధునికమైన ఉత్పత్తి సాధనాల వల్ల, జీవిత విధానంవల్ల కొత్త సాంఘిక భద్రతా రూపాలు అవసరమవుతున్నాయి. ఈ అన్నివిష యాల యెడ కార్మికుడు నిర్మాణాత్మక వైఖరి నలవరచుకొనే టట్లు చూడాలి. తన సంఘంద్వారా సాంఘిక భద్రతాస్కీము లను అమలు జరుపుకొనేటట్లు కార్మికుల్ని సంఘటితపరచాలి.

## 39. మన విధులు

ఈ రంగంలో మనం నిర్వర్తించవలసిన విధులు యివి :

1. అన్నిపట్టణాలలోను ఎంప్లాయిస్ స్టేట్ ఇన్సూరెన్స్ స్కీముక్రింద ఆసుపత్రులను నిర్మించాలని డిమాండు చేయాలి.

2. కార్మికుల కుటుంబాలకు కూడా యీ స్కీమును వర్తింపజేయాలి.



3. స్పెషల్ చికిత్స పొందడానికి ఇంకా యెక్కువ అవకాశా లుండాలి.

4. కాలయాపన జరక్కుండా చూచేందుకు ప్రస్తుత నిబంధనలను, కార్యవిధానాలను సులభతరం చేయాలి.

5. కార్మికులు చెల్లించవలసిన సొమ్మును యిప్పటికన్నా సగానికి తగ్గించాలి.

6. కొన్ని చోట్ల యజమానులు సర్వీసుపద్ధతి నమలు జరుపుతున్నారు; దానికి బదులు ప్యానెల్‌పద్ధతి నమలు జరపాలి.

7. ప్యానెల్‌కి చెందిన డాక్టర్లను సంఘటిత మొనర్చాలి; వారు తమ యిబ్బందులను తొలగించుకోడానికి చేస్తున్న ప్రయత్నాలకు తోడ్పడాలి; ఇప్పటికన్న చక్కగా కార్మికులకు వైద్యసహాయం అందేటట్లు చూడాలి.

8. భీమాస్కీములో చేరిన కార్మికుడు తనకు రావలసిన సౌకర్యాలను పొందటంలో ట్రేడ్‌యూనియన్లు నిర్మాణాత్మకమైన చర్యలు తీసుకోవాలి.

9. ప్రతి రాష్ట్రంలోను ఎంప్లాయీస్ స్టేట్ ఇన్సూరెన్స్ స్కీము క్రిందికి వచ్చేవారందరినీ సమావేశపరచి, వారి అసలు చిక్కులేవో పరిశీలించాలి.

10. ప్రస్తుతం అమల్లో ఉన్న చట్టాన్ని, కార్యవిధానాన్ని, పద్ధతుల్ని సంస్కరించడానికవసరమైన సూచనలతో



ఒక చక్కని మెమొరాండం తయారుచేయాలి; ఎంప్లాయీస్ స్టేట్ ఇన్సూరెన్సు స్కీమును చక్కదిద్దడానికి (రూపుమాపడానికి కాదు) ఎట్టి ఆందోళన, ప్రచారం, కార్యాచరణ అవసరమో నిర్ధారణచేయాలి.

యజమానులు, వారి మిత్రులు లేదా కొందరు అజ్ఞానులు ఎల్లప్పుడూ ఒక ప్రశ్న అడుగుతూఉంటారు: ఒకవైపు గ్రామసీమల్లో లక్షలాది ప్రజలు డాక్టర్లు లేక మందులు లేక నికృష్టజీవితం గడుపుతూంటే, కార్మికులకు మాత్రమే వైద్య భీమాసౌకర్య మెందుకు కలుగజేయాలి?

దీనికి జవాబు ఒక్కటే: తలసరి ఉత్పత్తివిషయంలో యితరు లందరికన్న కార్మికుడే ఎక్కువ ఉత్పత్తిచేస్తున్నాడు. అందుచేత అతడు దేశసంపదలో న్యాయంగా తనకు రావలసిన భాగాన్ని అడుగుతున్నాడు. రెండవ విషయం: యీ సౌకర్యాన్ని అందరికీ — కార్మికులకూ కార్మికేతరులకూ, పట్టణ ప్రజలకూ గ్రామీణులకూ — కలుగజేద్దాం. అయితే ఒకటిమాత్రం గమనించాలి. ఇస్తే అందరికీయివ్వాలి-లేకపోతే ఎవరికీవద్దు అనే సిద్ధాంతం తప్పు. పైవిధంగా మాట్లాడేవారు సాధారణ గా డాక్టర్లకు చాల ఎక్కువ ధనం చెల్లిస్తారు; ఇన్సూరెన్సు, భద్రతా స్కీములకు చాలా ధనం ఖర్చుపెడతారు. ప్రస్తుతానికి మనం ఎంప్లాయీస్ స్టేట్ ఇన్సూరెన్సు స్కీముతో సంతృప్తిపడి, దాన్ని చక్కదిద్దేటందుకు పోరాడుదాం.

—o—



# 5. ట్రేడ్ యూనియన్ ఐక్యత: కొన్ని సమస్యలు

## 40. కొత్త పరిణామాలు

ట్రేడ్ యూనియన్ ఉద్యమంలో ఐక్యత సాధించడానికి జరిగిన కృషిని నేనిప్పుడు సమీక్షిస్తాను. ట్రేడ్ యూనియన్ ఉద్యమంలో ఐక్యత లేనిదే కార్మిక పోరాటాలు వాస్తవంగా విజయం పొందవు.

ట్రేడ్ యూనియన్ ఉద్యమంలో ఐక్యత చాల క్లిష్టమైన సమస్యగా ఉంటూవచ్చింది; యిప్పటికీ అది క్లిష్టంగానే ఉంది. భారతీయ కార్మికవర్గానికి ప్రత్యేక లక్షణాలైన కులం, భాష మొదలైనవాటి విషయం అలా ఉంచుదాం. మన దేశంలో కొన్ని చారిత్రక పరిణామాలవల్ల వేర్వేరు రాజకీయ పార్టీలు వేర్వేరు ట్రేడ్‌యూనియన్లను నిర్మించాయి. అందుచేత ట్రేడ్‌యూనియన్ ఉద్యమంలో ఐక్యతను సాధించడం మరింత కష్టసాధ్యమైంది. మన దేశంలో వివిధ పార్టీల మధ్య తీవ్రమైన రాజకీయ భేదాలుండడం వల్లను, పాలకవర్గ పార్టీ అయిన కాంగ్రెసు తన సొంత ట్రేడ్‌యూనియన్లను కార్మికుల మీద రుద్దడానికి చాల గట్టి ప్రయత్నం చేస్తూండడంవల్లను, అభ్యుదయ శక్తులలో కొన్ని లోపాలుండడంవల్లను, కార్మిక ప్రజల్లో ఐక్యతకొరకు గట్టి నిర్మాణం కొరకు సరియైన ఉద్యమం

లేక పోవడంవల్లను—ట్రేడ్ యూనియన్ ఐక్యతను సాధించ డానికి ఎన్నో అడ్డంకులను దాటవలసియుంది.

అయినప్పటికీ, యిటీవలికాలంలో ఐక్యతకై కృషి గణనీయంగా అభివృద్ధిచెందింది. కార్మికుడు నేడు చాల నికృష్టమైన జీవితం గడుపుతున్నాడు; నిరుద్యోగం, రిట్రెంచిమెంటు అతన్ని వెంటాడుతుంటాయి; ట్రేడ్ యూనియన్ హక్కులు, ప్రజాతంత్ర హక్కులు అతనికి పూజ్యం. యజమానులు ప్రభుత్వం అతన్నెల్లప్పుడూ పీడిస్తూ ఉంటారు. ఇట్టి పరిస్థితుల్లో కార్మికులు తమ హక్కులను కాపాడుకోడానికి, వాటిని మరింత విస్తృత మొనర్చుకోడానికి ఐక్యత యొక్క అవసరాన్ని అంతకంతకు అధికంగా గుర్తిస్తున్నారు. అందుచేత వారి మధ్యనున్న అనుమానాలు, దురభిప్రాయాలు క్రమక్రమంగా సన్నగిలుతున్నాయి. కార్మికుల్ని ప్రత్యక్షంగా పీడించే యీ ఆర్థిక సమస్యలే కాక, యిటీవలి కాలంలో ప్రజాబాహుళ్యాన్నంతో విస్తృతంగా కదిలించే కొన్ని రాజకీయ సమస్యలు కూడా ఉత్పన్నమయాయి. అవి ప్రజాతంత్ర ప్రతిపక్షానికి చెందిన పార్టీలన్నిటినీ దగ్గరకు తెచ్చాయి. ఆ పార్టీలు మళ్లీ విభిన్న సంస్థలకు అనుబంధింపబడిన ట్రేడ్ యూనియన్లను సన్నిహితమొనర్చాయి. ప్రధానంగా అ.భా. ట్రే. యూ. కాంగ్రెసు, హింద్ మజ్దూర్ సభ, యునైటెడ్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు, తదితర స్వతంత్ర సంఘాలు అనేక రాజకీయ సమస్యలపై కలిసి పనిచేశాయి.

ఉమ్మడి పోరాటాల సంఖ్య అంతకంతకు పెరగడాన్ని బట్టి, స్వతంత్ర కార్మిక సమాఖ్యల సంఖ్య 1953 తర్వాత అధికమవడాన్నిబట్టి కార్మిక వర్గంలో ఐక్యతావాంఛ ఎంత గాఢంగా ఉన్నదో తెలుస్తుంది. అయితే యీ ఐక్యతావాంఛ సంస్థల మధ్య ఐక్యతగా రూపొందలేదు. కొన్నిసమయాల్లో అవి దగ్గరకు రావడం, మరికొన్ని సమయాల్లో దూరంగా పోవడం యిప్పటికీ జరుగుతోంది.

ట్రేడ్ యూనియన్ ఐక్యతకు సంబంధించిన సమస్య మరొక రూపంలోకూడా ముందుకువచ్చింది. 1955 ఆగస్టులో ప్రభుత్వం ప్రణాళికా సంఘం యొక్క లేబర్ ప్యానెల్ సభ్యుల్ని సమావేశపరచింది. అందులో యజమానుల ప్రతినిధులు, అన్ని ట్రేడ్ యూనియన్ సమాఖ్యల ప్రతినిధులు, తదితరులు సభ్యులు. ఆ సమావేశంలో కార్మిక మంత్రిత్వ శాఖ ఒక ప్రతిపాదన చేసింది. ఒక్కొక్క పరిశ్రమలో అనేక యూనియన్లు ఉండే పద్ధతిని రద్దుచేసి ఒక్కొక్క పరిశ్రమకు ఒక్కొక్క యూనియన్ మాత్రమే ఉండేందుకు కొన్ని సూచనలు చేసింది. కొంతవరకు స్థిరంగా ఉండే సభ్యత్వం, కార్మికులలో స్పష్టమైన శాతం ఏ యూనియన్‌లో ఉంటుందో దాన్ని గుర్తించటం మంచిదని తెలియజేసింది. ఈ సూచనలోని మూలసూత్రాలను ట్రేడ్ యూనియన్ సంస్థల ప్రతినిధులు వ్యతిరేకించలేదు. అయితే, బొంబాయి పారిశ్రామిక సంబంధాల చట్టాన్ని దేశానికంతకూ వర్తింపజేయడానికి ఆసూత్రాలు ఉద్దేశింపబడ్డాయనడంలో సందేహంలేదు.

ఆ చట్టాన్ని జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌కు అనుబంధింపబడ్డ సంఘాలు తప్ప దేశంలోని ట్రేడ్ యూనియన్లన్నీ వ్యతిరేకించాయి.

ఈ పరిమాణాలన్నిటిని బట్టి ఒక విషయం స్పష్టమవుతోంది. దేశవ్యాపితంగా పనిచేసే ట్రేడ్ యూనియన్ సమాఖ్యలన్నీ ఐక్యతా సమస్యపై ఒక కొత్త దృక్పథం అలవరచుకో వలసి వచ్చింది. ఈ విషయంలో మన కర్తవ్యాలను గురించి చెప్పేముందు ట్రేడ్ యూనియన్ ఐక్యత విషయంలో వివిధ ట్రేడ్ యూనియన్ సమాఖ్యలు, ప్రభుత్వం యిప్పుడనుసరిస్తున్న వైఖరి ఏమిటో తెలియజేస్తాను.

## 41. హింద్ మజ్దూర్ సభ

అతి ముఖ్యమైన పరిణామాల్లో ఒకటి హింద్ మజ్దూర్ సభ వైఖరిలో మార్పురావటం. ఆ సంస్థ ట్రేడ్ యూనియన్ ఐక్యత అనే సమస్యను ఊహాజగత్తునుంచి వాస్తవ ప్రపంచంలోకి తెచ్చి కొత్త ఆశలను రేకెత్తించింది.

1956 జూన్ మాసంలో హింద్ మజ్దూర్ సభ కార్యవర్గం యీ క్రింది తీర్మానం చేసింది:

"హింద్ మజ్దూర్ సభ కార్యవర్గం ట్రేడ్ యూనియన్ ఐక్యతకు సంబంధించిన సమస్యను సమగ్రంగా పరిశీలించి, భారతదేశంలో కార్మికోద్యమాన్ని సర్వతోముఖంగా ఐక్యపరచడం తక్షణ కర్తవ్యమని మరొకసారి తన అభిప్రాయాన్ని తెలియజేస్తోంది. ఎందుచేతంటే, మనదేశంలో

కార్మికులు ఐక్యత ద్వారానే న్యాయాన్ని పొందగల్గుతారు; సమాజంలో గౌరవప్రదమైనస్థాన మలంకరించగల్గుతారు; జాతీయనిర్మాణంలో శక్తివంత మైన పాత్రను నిర్వహించగల్గుతారు.

"ట్రేడ్ యూనియన్ ఐక్యతను నిర్మించేందుకు గతంలో జరిగిన ప్రయత్నాలు ఆశాభంగం కలిగించాయి. ఇప్పటికీ వివిధ కేంద్ర సంస్థల మధ్య తీవ్రమైన అనుమానాలు, ద్వేషాలు ఉన్నాయి. అయినప్పటికీ యింత ప్రధానమైన ఆశయంకోసం కొంత త్యాగం చేయవలసివచ్చినా అందుకు సిద్ధంగా ఉండాలని కార్యవర్గం అభిప్రాయ పడుతోంది. (క్రింది గీతలు నావి).

" అయితే గత విషాదపూరిత అనుభవం మళ్లీ కలగకుండా చూడా లంటే, సుస్థిరమైన శాశ్వతమైన ఐక్యత సిద్ధించాలంటే, యిందుకు సంబం ధించిన సంస్థలన్నీ ఎట్టిమినహాయింపులు లేకుండా కొన్ని మూలసూత్రాలను అంగీకరించవలసియుంటుంది; ఆచరణలో అవి ఉల్లంఘింప బడకుండా చూచేందుకు కొన్ని న్యాయమైన హామీలు కూడా ఉండాలి. ఐక్యతను అట్టి మూలసూత్రాలు ప్రాతిపదికగా ఉండాలని కార్యవర్గం అభిప్రాయ పడుతోంది. అవియివి : 1. ఐక్యకేంద్ర సంస్థయొక్క దాని అనుబంధ సంఘాల యొక్క, వాటి ఆంతరంగిక వ్యవస్థయొక్క కార్యకలాపాల్లో ఖచ్చితమైన ప్రజాతంత్ర సూత్రాలను, పద్ధతులను అంగీకరించాలి; వాటిని తు, చ అమలుజరపాలి. 2. ప్రభుత్వంగాని రాజకీయపార్టీలుగాని ట్రేడ్ యూనియన్ కార్యకలాపాల్లో ఏమాత్రమూ జోక్యం కలిగించుకో రాదు. 3. ఒకే పరిశ్రమలో అనేక యూనియన్లమధ్య యిప్పుడున్న పోటీని తొలగించాలి; యిందుకు కార్మికులు రహస్య బ్యాలటు ద్వారా తమకు నచ్చిన యూనియన్‌ను ఎన్నుకొనేందుకు యేర్పాటు చేయాలి.

" ఈ సూత్రాలను అన్ని సంస్థలవారు ఆమోదించి, వాటిని అమలు జరిపేందు కవసరమైన మార్గాలనుకూడా కనుగొనగల్గితే, కార్మికోద్యమంలో

సవ్యమైన, సర్వతోముఖమైన ఐక్యతను సాధించవచ్చునని కార్యవర్గం అభిప్రాయ పడుతోంది. అయితే, కేవలం జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌తోగాని అ. భా. ట్రే. యూనియన్ కాంగ్రెస్‌తోగాని ఆచరణకు సంబంధించిన కొన్ని సర్దుబాట్లు చేసుకున్నంతమాత్రాన సరిపోదనీ, అట్టి పద్ధతి సర్వతోముఖమైన ఐక్యతకు అటంకంకూడా కలిగించవచ్చుననీ కార్యవర్గం భావిస్తోంది. (క్రింది గీతలు నావి)

"ఈ సూత్రాల ప్రాతిపదికపై సర్వతోముఖమైన ఐక్యత తీసుకురావటానికి ఎవరు ఏ ప్రయత్నంచేసినా, హింద్‌మజ్దూర్ సభ దాన్ని ఆహ్వానిస్తుంది."

హింద్ మజ్దూర్‌సభ చేసిన పై తీర్మానం ఎంతో ప్రాధాన్యం గల నిర్మాణాత్మక చర్య. ఇదివరలో హింద్ మజ్దూర్‌సభ నాయకత్వం అనుసరించిన నైఖరికీ దీనికీ చాల వ్యత్యాసం ఉంది. ఉదాహరణకు సోషలిస్టుపార్టీ, కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీ కలిసిపోయిన తర్వాత 1952 లో అశోక మెహతా ఒక ప్రకటన చేస్తూ యిలా అన్నారు:

"ఈ సంలీనంలో (కేంద్ర కార్మిక సంస్థల సంలీనం) కమ్యూనిస్టు యూనియన్లకు స్థానముండకూడదు. అవి ఎక్కువగా అ. భా. ట్రే. యూనియన్ కాంగ్రెసుకు అనుబంధింపబడి యున్నాయి. జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు, హింద్ మజ్దూర్‌సభ, యునైటెడ్ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్, తదితర స్వతంత్ర సంఘాలు ఒకటిగా సంలీనమైతే, అ. భా. ట్రే. యూ. కాంగ్రెసు ఒక గూడుగా తయారౌతుంది. అందులో కమ్యూనిస్టులు అంతరించి పోతారు."

అ. భా. ట్రే. యూ. కాంగ్రెసుతో సహా అన్ని కేంద్ర సంస్థల మధ్య సర్వతోముఖమైన ఐక్యతను సాధించడానికి హింద్ మజ్దూర్ సభ తీసుకున్న నూతన నిర్మాణాత్మక వైఖరిని, యిందుకు ఆ సంస్థ చేసిన సూచనలను ట్రేడ్ యూనియన్ ఉద్యమంలో ఐక్యతను కోరేవారందరు సహజంగా ఆనాడు ఆహ్వానించారు. కారణమేమంటే, అ. భా. ట్రే యూ. కాంగ్రెస్‌ను దూరంగా ఉంచి జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసుతో చేతులు కలిపే విధానాన్ని హింద్‌మజ్దూర్ సభ విడనాడింది.

ఇటీవలి సంవత్సరాల్లో జరిగిన పరిణామాలను దృష్టిలో ఉంచుకొని ఆలోచిస్తే యీ మార్పు మరింత ప్రాధాన్యంగలదిగా మనకు స్పష్టమవుతుంది. హింద్ మజ్దూర్ సభ స్థాపింపబడినప్పటినుంచీ జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్‌కు, అ. భా. ట్రే. యూ. కాంగ్రెస్‌కు కూడ తాను వ్యతిరేకమేనని బహిరంగంగా ప్రకటనలు చేసినప్పటికీ, ఆచరణలో క్రియాత్మకమైన ట్రేడ్‌యూనియన్ ఉద్యమానికి వ్యతిరేకమైన విధాన మవలంబిస్తూ వచ్చింది; జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ మనదేశంలో స్థిరపడ్డానికి ఆ విధానం దోహదమిచ్చింది. 1950 తర్వాత దాని నాయకులు హింద్ మజ్దూర్ సభను జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసుతో కలిపివేయడానికి ప్రయత్నించారు (రైల్వే కార్మికోద్యమంలో ట్రేడ్ యూనియన్ ఐక్యతను సాధించడాని కవలంబింపబడిన పద్ధతి అ. భా. రైల్వేమెన్స్ ఫెడరేషన్ని జాతీయ ట్రే [illegible] నియన్

కాంగ్రెసు చేతుల్లో పెట్టేందుకు దారితీసింది). ఇట్టి విధానం వల్ల హింద్ మజ్దూర్ సభ క్రమ క్రమంగా బలహీనపడింది; దాని అధీనం క్రింద ఉన్న సంఘాలు జా. ట్రే. యూ. కాంగ్రెసు అధీనంలోకి పోతున్నాయి. కార్మిక రంగంలో జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసుతోను, రాజకీయ రంగంలో కాంగ్రెసు తోను చేతులుకలిపే విధానాన్ని హింద్ మజ్దూర్ సభ నాయకత్వం అనుసరించడంవల్ల ప్రజాసోషలిస్టుపార్టీలోను, హింద్ మజ్దూర్ సభలోను తీవ్రమైన సంఘర్షణ ఏర్పడింది. తత్ఫలితంగా ప్రజాసోషలిస్టుపార్టీలో చీలిక కూడా యేర్పడింది; అ.భా. ట్రే.యూ. కాంగ్రెసుతో తదితర అభ్యుదయకర శక్తులతోను సుతరాం సహకరించకూడదని వాదించే వర్గం రెండవ వర్గం కన్న బలహీనపడింది.

హింద్ మజ్దూర్ సభ ప్రధాన కార్యదర్శి కామ్రేడ్ బగారాం తుల్‌పులే 1957 అక్టోబరులో ఆరవ అఖిల భారత సమావేశానికి నివేదిక సమర్పిస్తూ, ఐక్యతను గురించి మరొక సారి నొక్కి చెప్పారు. ఆయన యిలా అన్నారు:

> "జాతీయట్రేడ్ యూనియన్ కాంగ్రెసు యీ రోజున సభ్యత్వం విషయంలో అన్ని సంస్థల కంటె పెద్దది. దానికి ప్రభుత్వ ఆదరణ, సహాయం ఉన్నాయి. కనుకనే అది యీస్థితిలో ఉండగల్గుతోంది. దురదృష్టవశాత్తు ఐక్యతా సాధన కీయబడిన పిలుపుకు ఆ సంస్థ సమాధాన మీయ లేదు."

ఈ విధంగా, జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసుకు, హింద్ మ[illegible]సభకు గల వైరుధ్యం అంతకంతకు పెరుగు

తూండటంవల్ల, అ. భా. ట్రే. యూ. కాంగ్రెస్‌కి చెందిన యూనియన్లతో సహకారం అంతకంతకు బలపడుతూండటం వల్ల హింద్‌మజ్దూర్ సభ నాయకత్వంలో మార్పువచ్చింది. గత సంవత్సరం ఐక్యకార్యాచరణ మరింత హెచ్చింది.

# 42. ఐక్యతను గూర్చి జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు దృక్పథం

1956 మే మాసంలో జరిగిన అఖిల భారత జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ 8 వ వార్షిక మహాసభకు అధ్యక్షత వహించిన శ్రీ జి. డి. అంబేకర్ యిలాచెప్పారు:

"కమ్యూనిస్టు దేశాలు తమ విదేశాంగ విధానాన్ని మార్చుకోడం వల్ల అ. భా. ట్రే. యూ. కాంగ్రెసుకూడా కార్మిక సంఘాలయెడ తన వైఖరిని మార్చుకొంటూంది. ఆ సంఘాలు 'సమిష్టివేదిక' 'ఐక్యత' 'సంలీనం' మొదలైన పేర్లతో యితర యూనియన్లకు రకరకాలైన సూచనలు చేస్తున్నాయి.

"ఉత్తరోత్తరా ట్రేడ్‌యూనియన్ ఐక్యత సిద్ధించాలనే నేను కోరుతాను. అయినా, గత 18 సంవత్సరాల అనుభవంలో నేనొక విషయం తెలుసుకున్నాను. హృదయాల మధ్య ఐక్యత, దృక్పథాల్లో ఐక్యత, విధానాల్లో ఐక్యత లేనిదే నిజమైన ఐక్యత ఏర్పడదు............ ......భారతదేశంలో కమ్యూనిస్టుల విధానాలను పరిశీలించినట్లయితే, వారినినాదం కార్మికవర్గం యొక్క స్థితిగతుల్ని చక్కదిద్దాలన్న సదుద్దేశం నుంచి ఉత్పన్నమవడంలేదని సులభంగా తెలుసుకోవచ్చు...ఏదో ఆదర్శం నుంచి లేదా బలంనుంచికాక, బలహీనతనుంచి ఆ నినాదం ఉత్పన్నమయి నట్లుకనిపిస్తుంది...అందుచేత అదొక ఎత్తుగడగా మాత్రమే ఉండిపోతుంది.

చివరకు కార్మికుల్ని యిదివరలోవలె తమ రాజకీయ ప్రయోజనాలకై ఉపయోగించుకోడానికి వారు పూనుకుంటారు. అంతేకాదు. వారి దృక్పథం వర్గ పోరాట దృక్పథంగా ఉన్నప్పుడు ఐక్యత యెలా సిద్ధిస్తుంది?

"...కమ్యూనిస్టులూ అ. భా. ట్రే. యూ. కాంగ్రెసూ తమకు నచ్చని పరతులను అమలు జరపరు... హృదయ సమైక్యతకు మూలం లక్ష్య సమైక్యత. అది సిద్ధించాలంటే, మాటలవల్ల కాక చేతలద్వారా అందరి లక్ష్యం ఒకటేనని తాము గుర్తించినట్లు రుజువుచేసుకోవాలి. ఇట్టి పరిస్థితులో ప్రస్తుతం వివిధ సంస్థలమధ్య ఐక్యత సిద్ధిస్తుందనటానికి ఎట్టి తార్కాణం నాకు కనబడ్డంలేదు." (క్రిందిగీతలు నావి) ....అయితే, పరిస్థితుల ఒత్తిడివల్ల కమ్యూనిస్టులు, అ. భా. ట్రే. యూ. కాంగ్రెస్ తమవైఖరిని మార్చుకోవచ్చు; అట్టి ఆశ నాకింకాఉంది.

"కాని మనకు, హింద్‌మజ్దూర్ సభకు మధ్య అంగీకారయోగ్యమైన విషయాలు చాలా ఉన్నాయి. (క్రింది గీతలు నావి). కారణమేమంటే, ట్రేడ్‌యూనియన్ రంగంలో యీ రెండు సంస్థలు శాంతియుతమైన, ప్రజాతంత్రయుతమైన పద్ధతులకు కట్టుబడియున్నాయి; అంతేకాక వివిధ సమస్యలపై వాటి దృక్పథం దాదాపు ఒకటే. మనం తొందరపడి ఏ చర్యకూ దిగకూడదు. అలాదిగితే కార్మికులమధ్య ఐక్యత ఏర్పడ్డానికిబదులు ద్వేషం ప్రబలుతుంది. అందుచేత రెండు సంస్థలూ యీ క్రింది పద్ధతులపై తమ విధానాలను రూపొందించుకోవలసియుంది :

"(1) ఎక్కడైతే జాతీయ ట్రేడ్‌యూనియన్ సంఘాలు బలంగా ఉండి సరియైన ట్రేడ్ యూనియన్ పద్ధతుల్లో పనిచేస్తున్నాయో అక్కడ హింద్‌మజ్దూర్ సభ పోటీ సంఘాలను నెలకొల్పకూడదు; బలహీనంగా ఉన్న లేదా సరియైన పద్ధతులలో పనిచేయకుండా ఉన్న చోట అది తన సంఘాలను రద్దుచేసుకోవాలి;

" (2) హింద్‌మజ్దూర్ సభ బలంగా ఉండి సరియైన ట్రేడ్‌యూని యన్ పద్ధతుల్లో పనిచేస్తున్నచోట్ల జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు పోటీ సంఘాలను నెలకొల్పరాదు; బలీయంగాను నిర్మాణయుతంగాను లేని చోట్ల అది తన సంఘాలను రద్దుచేసుకోవాలి;

" (3) ఉమ్మడిసమస్యలను గురించి మొదట పై స్థాయిలో చర్చలు జరగాలి;

" (4) ఏసమస్య మీదనైనా దృక్పథంలో భేదాభిప్రాయమేర్పడితే, తన మార్గం తాను అనుసరించడానికి రెండు సంస్థలకూ స్వేచ్ఛ ఉండాలి; రెండవ సంస్థను విమర్శించడానికి పూనుకోకూడదు. ఎవరిది సరియైన మార్గమో రుజువుచేసేందుకు ఒండొరులు ఒకరిమీద ఒకరు దుమ్మెత్తిపోసుకో కూడదు. కారణమేమంటే, ఎవరిది సరియైన మార్గమో అంతిమ ఫలితాల వల్ల తేలుతుంది...".

శ్రీ అంబేకర్ ఉపన్యాస భాగాలను యింత దీర్ఘంగా నేను పేర్కొనడానికి కారణం, హింద్‌మజ్దూర్ సభ యెడల వారెందుకెంత ప్రేమను ప్రదర్శిస్తున్నారో తెలియజేయడానికి. పైన నేను పేర్కొన్నట్లు జాతీయట్రేడ్ యూనియన్‌కాంగ్రెసు ప్రభుత్వ సహాయంతోను, యజమానుల సహాయంతోను హింద్‌మజ్దూర్ సభ యూనియన్లను స్వాధీనపరచుకొనే ఎత్తు గడలను అవలంబిస్తూండటంవల్ల జాతీయ ట్రేడ్‌యూనియన్‌, కాంగ్రెస్, హింద్‌మజ్దూర్ సభ అనుచరులమధ్య వైరుధ్యాలు తీవ్రతరమయాయి. అంతేకాక, కొన్ని రాజకీయ ఆర్థిక పరిణా మాల వల్ల 1955_57 మధ్యకాలంలో అ. భా. ట్రే. యూ. కాంగ్రెస్, హింద్‌మజ్దూర్ సభ అనేక ఐక్యపోరాటాలు జరి పాయి. తత్ఫలితంగా ఆ రెండిటిమధ్య సాన్నిహిత్యమేర్పడింది. ఇట్టి పరిస్థితుల్లో రెండవ పంచవర్ష ప్రణాళిక ప్రారంభమయింది.

దాన్ని అమలు జరిపేందుకు ప్రభుత్వానికి కార్మికుల సహకారం అవసరమైంది. జాతీయట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ స్థాపింపబడినప్పటినుంచీ ప్రభుత్వం, యజమానులు ఆ సంస్థకు ఎంతో సహాయం చేసినప్పటికీ, పోరాటమార్గమవలంబించే మిగతా ట్రేడ్‌యూనియన్లు నిర్మూలింపబడలేదు. పైగా అ.భా.ట్రే.యూ. కాంగ్రెసు, హింద్ మజ్దూర్ సభ, స్వతంత్ర కార్మిక సంఘాలు, కొన్ని జాతీయట్రేడ్ యూనియన్లు ఐక్యతతో పనిచేశాయి. రెండవ ప్రణాళిక కాలంలో ప్రభుత్వం దేశమంతటా ఒక్కొక్క పరిశ్రమకు ఒక్కొక్క యూనియన్ని మాత్రమే గుర్తించాలని నిశ్చయించుకొంది. ఇందుకు జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్‌ను బలపరచదలచుకొంది. కాని, యీ విధానంపట్ల వ్యతిరేకత అంతకంతకు పెరుగుతూండటంవల్ల అది పక్షపాతవైఖరి నవలంబిస్తున్నట్లు స్పష్టమైంది. అందుచేత ప్రభుత్వం జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్, హింద్ మజ్దూర్ సభల మధ్య ఒక విధమైన ఒప్పందం కుదిరితే బాగుండునని అభిప్రాయపడింది. అలా జరిగితే జాతీయట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు, హింద్ మజ్దూర్ సభ కలిసి అ. భా. ట్రే. యూ. కాంగ్రెసు శాఖలను ఏకాకిగా చేయవచ్చునని భావించింది. అప్పుడు ఆ రెండు సంస్థలకు అనుబంధింపబడిన సంఘాలనే గుర్తించవచ్చునను కొంది. అందువల్లనే ప్రధాని నెహ్రూ అమృతసర్‌లో అ. భా. కాంగ్రెసు కమిటీ సమావేశంలో ఉపన్యసిస్తూ (1956 ఫిబ్రవరి) ట్రేడ్‌యూనియన్ ఉద్యమంలో ఐక్యత అవసరమని

చెబుతూనే రెండోవైపున అ. భా. ట్రే. యూ. కాంగ్రెస్‌ను చాల తీవ్రంగా ఖండించారు. జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ మహాసభలోకూడ ఉపన్యసిస్తూ హింద్ మజ్దూర్ సభ, జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు ఒప్పందం కుదుర్చుకోటం అవసరమని ఆయన చెప్పారు.

## 43. అంబేకర్, శాస్త్రిగారల వైఖరిలో వ్యత్యాసం

పైవాటిని బట్టి అంబేకర్ ఉపన్యాసంలో యీ క్రింది అంశాలున్నట్లు స్పష్టమవుతుంది :

(1) కార్మిక ప్రజల్లో ముఖ్యంగా తన అనుచరులైన కార్మికుల్లోగల ఐక్యతావాంఛను జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ గుర్తించక తప్పడం లేదు. ఉత్పత్తి పెరుగుతూన్నప్పటికీ కార్మికుల స్థితిగతుల్లో నిజమైన మార్పు కనపడ్డంలేదు. అందుచేత అ.భా ట్రే.యూ. కాంగ్రెస్ ఐక్యతకై చేస్తున్న విజ్ఞప్తులను యిదివరలోవలె యిప్పుడు సులభంగా త్రోసివేయటం సాధ్యంకాదు. అందుచేతనే అ.భా. ట్రే.యూ. కాంగ్రెస్ పట్లగల పాత దురభిప్రాయాలనుగురించి పదేపదే చెప్పడంతోబాటు హింద్‌మజ్దూర్ సభతో ఒప్పందం కుదుర్చుకోటానికి ప్రయత్నించటం కూడ కనిపిస్తుంది.

(2) జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్‌కు యజమానులు, ప్రభుత్వం సర్వవిధాల సహాయంచేసినప్పటికీ, కార్మికులకు ఆ సంస్థద్వారా కొన్ని సౌకర్యాలు లభించినప్పటికీ

(బోనసు మొదలైన సమస్యలపై జరిగిన ఒప్పందాలు), ఆ సంస్థయొక్క బలం విస్తారంగా పెరగలేదు. అందుచేత అ. భా. ట్రే యూ. కాంగ్రెస్ తదితర సంఘాలతో హింద్ మజ్దూర్ సభ చేతులు కలపకుండా చేసేందుకు మరొకసారి ప్రయత్నించడం కనిపిస్తుంది.

(3) అ.భా.ట్రే.యూ. కాంగ్రెస్‌కు వ్యతిరేకంగా ఐక్య సంఘటన నిర్మించటానికొక కుటిల ప్రయత్నం పై ఉపన్యాసంలో కనిపిస్తుంది. ఇందులో భాగంగా హింద్ మజ్దూర్ సభకు కొన్ని సదుపాయలివ్వదలచుకొంది. సులభమైన మాటల్లో హింద్ మజ్దూర్ సభా నాయకులకు అంబేకర్ చెబుతున్నది ఇది:

"రండి! జాయింటుగా మనం లాభాలు పంచుకొందాం. కొన్ని ప్రాంతాల్లో మీ సహాయంవల్ల మేము, మరి కొన్ని ప్రాంతాల్లో మా సహాయంవల్ల మీరు రికగ్నిషన్ (గుర్తింపు) పొందుదాం."

హింద్ మజ్దూర్ సభకు కొన్ని సదుపాయాలివ్వడాని కంగీకరిస్తున్న అంబేకర్ ఉపన్యాసానికి, కీ. శే. ఎన్.ఎం. జోషీ సూచనపై కీ. శే. హరిహరనాథ శాస్త్రి 6 వ మహాసభకు సమర్పించిన నివేదికకూ చాలవ్యత్యాసం ఉంది. ఆనివేదికలో హింద్ మజ్దూర్ సభకు ఎట్టి సదుపాయాలు యివ్వలేదు. పైగా అది ట్రేడ్ యూనియన్లను నిర్వహించడంలో అనుసరిస్తున్న ఎత్తుగడలను ఖండించింది; అ.భా.ట్రే.యూ. కాంగ్రెస్‌తో అది కొద్దిగా సహకరిస్తున్నందుకు విమర్శించింది. కీ. శే. హరిహర నాథశాస్త్రి తన నివేదికలో యిలాచెప్పారు :

"మన అధ్యక్షుడు చెప్పినట్లు... గత సంవత్సరం సోషలిస్టులకూ మనకూ గల విభేదాలు నేడు చాలవరకు సన్నగిల్లాయి. కమ్యూనిస్టులవిషయంలో వారి దృక్పథమూ మన దృక్పథమూ ఒకటే...ప్రస్తుతం మన ఉభయులమధ్య రెండు ఆటంకాలు కనిపిస్తున్నాయి. మొదటిది: ట్రేడ్‌యూనియన్‌రంగంలో సమస్యల మంచిచెడ్డలను ఆలోచించడానికి బదులు రాజకీయ ప్రయోజనాలకు ప్రాముఖ్యమిస్తున్నారని అనుమానించేందుకు ఆస్కారమిచ్చే విధంగా వారు ఒక్కొక్కప్పుడు వ్యవహరిస్తున్నారు. రెండవది: సోషలిస్టుపార్టీ నాయకత్వం కమ్యూనిస్టులతో చేతులుకలపడానికి నిరాకరిస్తూ జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్‌తో ఐక్యత సాధించే విధానాన్ని అవలంబిస్తూన్నప్పటికీ, యీ రెండు విషయాల్లో హింద్‌మజ్దూర్ సభలోనే తీవ్రమైన భేదాభిప్రాయాలున్నాయి. కమ్యూనిస్టులవైపు మొగ్గుచూపే స్పష్టమైన వర్గమొకటి హింద్‌మజూర్ సభలో ఉంది. జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసుతో సన్నిహితమైన సంబంధాలుంచుకోటం ఆ వర్గానికిష్టంలేదు."

"హింద్‌మజ్దూర్ సభ ప్రతినిధులు, జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు ప్రతినిధులు సభ్యులుగా ఉన్న సంయుక్త సంప్రతింపుల సంఘాన్ని ప్రాతిపదికగా చేసుకొని యీ రెండు సంస్థలు సన్నిహిత సంబంధాలను పెంపొందించుకోవాలి".

ఇదీ ఆయన సూచించినది. ఈ విధంగా శ్రీ అంబేకర్, హరిహరనాథశాస్త్రి గారల వైఖరిలో స్పష్టమైన వ్యత్యాసం కనిపిస్తుంది. హరిహరనాథశాస్త్రి మాటల్లో బలప్రదర్శనం కనిపిస్తోంటే, అంబేకర్ హింద్‌మజ్‌దూర్ సభకు కొన్ని సదుపాయాలివ్వాలంటున్నారు. ఆ సంస్థకు కొన్ని ప్రాంతాలు, కొన్ని యూనియన్లు కేటాయించాలని సూచిస్తున్నారు.

## 44. ఉమ్మడి కోర్కెలు

ఐక్యత విషయంలో జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ అష్టమ మహాసభ (1956 మే) స్థూలంగా పైవిధమైన మార్గమనుసరిస్తోంటే, మరోవైపు కార్మికుల కోర్కెలను గురించి అదిచేసిన కొన్ని ప్రతిపాదనలు అ. భా. ట్రే. యూ. కాంగ్రెసు తదితర సమాఖ్యల కోర్కెలను పోలియున్నాయి. అవి : కార్మికులందరి జీతాలను 100కి 25 చొప్పున పెంచడం; ప్రభుత్వం ఒక వేతకమిషన్ నియమించడం; ప్రావిడెంట్ ఫండు స్కీమును విస్తృతపరచడం; ఇప్పటికంటె ఎక్కువవిస్తృతమైన సాంఘిక భద్రతాస్కీమును ప్రవేశపెట్టడం; ఎంప్లాయీస్ సోషల్ ఇన్స్యూరెన్సు స్కీముక్రింద యిచ్చేవైద్యసౌకర్యాల్ని కార్మికుల కుటుంబాలకుకూడా యివ్వడం; అధిక ధరల అలవెన్సును జీతంతో కలిపి యివ్వడం — వగైరా. ఈ కోర్కెలను సాధించడానికి ఏమిచేయాలో జాతీయట్రేడ్ యూనియన్ కాంగ్రెసు నాయకులు ఒక్కమాటకూడా చెప్పకపోయినప్పటికీ, ప్రణాళికాబద్ధమైన ఆర్థిక వ్యవస్థలో సమ్మెలకు కాలదోషం పట్టిందని చెబుతూ, చొరవఅంతా ప్రభుత్వానికీ యజమానులకూ విడిచిపెట్టినప్పటికీ — పైప్రతిపాదనలు కార్మికప్రజల మధ్య, కార్మికనాయకుల మధ్య ఐక్యతను సాధించడానికి యిదివరకటికంటె ఎక్కువ అవకాశాలు కలిగిస్తున్నాయి.

హింద్ మజ్దూర్ సభ కార్యవర్గం ఐక్యతను గురించి చేసిన తీర్మానాన్ని అ.భా.ట్రే.యూ. కాంగ్రెస్, యునైటెడ్

ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ హృదయపూర్వకంగా హర్షిస్తే, జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ మానంవహించింది.

## 45. అ. భా. ట్రే. యూ. కాంగ్రెస్

అ.భా. ట్రే.యూ. కాంగ్రెస్ 1950–51 లో పునరుద్ధరింవబడిన తర్వాత కొన్ని బలహీనతలు, లోపాలు ఉన్నప్పటికీ క్రమక్రమంగా అది తన పద్ధతులను మార్చుకొంటూ, ట్రేడ్ యూనియన్ ఐక్యత కొరకు కృషిచేస్తూ వచ్చింది. ఈ విషయంలో ప్రపంచ ట్రేడ్‌యూనియన్ సమాఖ్య చర్చలు అ. భా. ట్రే. యూ. కాంగ్రెస్‌కు ఎంతో సహాయపడ్డాయి. ఇందుకు ఉదాహరణలు :

(1) ట్రేడ్‌యూనియన్ల మధ్య— ముఖ్యంగా అ.భా.ట్రే. యూ. కాంగ్రెస్‌కు యునైటెడ్ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్‌కుమధ్య—ఐక్యత సాధించడానికి 1950 లో బోసు—రాయికర్ స్కీమును మనం ఆమోదించాం.

(2) కీ. శే. ఎన్.ఎం. జోషీ 1952 మధ్యభాగంలో పరిమితమైన ఐక్యతను సాధించడానికొక సూచన చేశారు. "కేవలం ఒక జాయింట్ ట్రేడ్‌యూనియన్ కమిటీ మాత్రమే ఉండా"లనీ, "ఏ సంస్థ కూడా తన అభిప్రాయాలను వదులుకోనవసరంలేకుండా పనిచేయడానికవకాశమిచ్చే ఒక ప్లాను దానికి ప్రాతిపదికగా ఉండా"లనీ ఆ స్కీములో వివరింపబడింది. దాన్ని అ.భా.ట్రే.యూ. కాంగ్రెస్ ఆమోదించింది.

(3) కార్మికులు తమ హక్కులకై పోరాడేటప్పుడు ఆ పోరాటాలను నడిపేవా రెవరైనప్పటికీ వాటిని అ. భా. ట్రే. యూ. కాంగ్రెస్ బలపరుస్తూ వచ్చింది; ఆ పోరాటాలకు యితర కార్మికుల సహకారం లభించేందుకు కొన్ని ఉద్యమాలను కూడ ప్రారంభించింది.

(4) వేర్వేరు వృత్తులకు చెందిన కార్మికులు స్వతంత్ర సమాఖ్యలను నిర్మించుకొనేందుకు చేయూతనిచ్చింది.

(5) కార్మిక వర్గంయొక్క ప్రధానమైన కోర్కెలకోసం, ట్రేడ్ యూనియన్ హక్కుల—ప్రజాతంత్ర హక్కుల రక్షణ కోసం అ.భా.ట్రే.యూ. కాంగ్రెస్ స్వతంత్రంగా కొన్ని ఉద్యమాలను, పోరాటాలను నడిపింది.

ట్రేడ్ యూనియన్ ఐక్యతకై మనం తీసుకొంటూ వచ్చిన వైఖరి 1954 తర్వాత యింకా నిర్మాణాత్మకమైన రూపం ధరించింది. ఐక్య కార్యాచరణ, సంస్థల మధ్య ఐక్యత కోసం కృషి చేద్దామని జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ నాయకులకు, దాని అధీనంక్రింద ఉన్న యూనియన్లకు మనం విజ్ఞప్తులు చేశాం. హింద్ మజ్దూర్ సభకు చెందిన యూనియన్లతోను నాయకులతోను యింకా ఎక్కువ సన్నిహితమైన సంబంధాలుంచుకోడం అవసరమని భావించాం. జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ 8 వ మహాసభకు మనమొక అభినందన సందేశం పంపుతూ యిలా తెలియజేశాం:

" అ. భా. ట్రే. యూ. కాంగ్రెస్, జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు కార్మికవర్గంయొక్క ఉమ్మడి సమస్యల విషయంలోను, వాటిని పరిష్కరించేందుకు తీవ్రమైన కృషిఅవసరమన్న విషయాన్ని గుర్తించటంలోను చాలవరకు ఏకాభిప్రాయాన్ని కలిగియున్నందుకు మేము సంతోషిస్తున్నాం.

" అ. భా. ట్రే. యూ. కాంగ్రెసుకు జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసుకు మధ్య కొన్ని భేదాభిప్రాయాలున్నప్పటికీ, భారతదేశంలోని కార్మికులందరికీ జీవనభృతి యిప్పటికన్న ఎక్కువసదుపాయాలు సంపాదించడానికి, రిట్రెంచిమెంటును అరికట్టడానికి, రేషనలైజేషనును వ్యతిరేకించడానికి, నిరుద్యోగాన్ని నివారించడానికి... భారతదేశాన్ని ఆర్థికంగా అభివృద్ధిచేసేందుకు, ఆసియాదేశాలమధ్య ఐక్యతను సాధించేందుకు, ప్రపంచశాంతిని కాపాడేందుకు — మన ఉభయసంస్థల మధ్య అన్యోన్య సహకారం సాధ్యమనీ, అవసరమనీ మేము నమ్ముతున్నాం.

" మీ సంస్థవలెనే అ. భా. ట్రే. యూ. కాంగ్రెసుకూడ కార్మికుల మధ్య ఐక్యత ఉండాలని కోరుతోంది. ఈ లక్ష్యాన్ని సాధించేందుకు మేము చాల సార్లు అన్ని ట్రేడ్ యూనియన్ సమాఖ్యల ప్రతినిధులతోను, స్వతంత్ర కార్మికసమాఖ్యల ప్రతినిధులతోను ఒక రౌండుటేబుల్ సమావేశం జరపవలసిందని ప్రభుత్వాన్ని కోరుతూవచ్చాం. ఆ సమావేశం అందరికీ అంగీకారయోగ్యమైన సూత్రాలను, కార్యక్రమాన్ని, ప్రజాతంత్ర పద్ధతుల్ని ఆధారంగా చేసుకొని ఐక్యతాసాధనకు మార్గాలు చూపాలని సూచిస్తూవచ్చాం.

" మా సూచనను శ్రద్ధగా పరిశీలించవలసిందని మీకు విజ్ఞప్తి చేస్తున్నాం."

హింద్ మజ్దూర్ సభ కార్యవర్గం సర్వతోముఖమైన ఐక్యతను సాధించడానికి యిచ్చిన పిలుపును మనం పూర్తిగా బలపరచాం; ఆ పిలుపును కార్మికులందరు — వారు ఏసంస్థకు

అనుబంధింపబడినప్పటికీ—బలపరచవలసిందనీ, దాన్ని విజయ వంతమొనర్చేందుకు తీవ్రంగా ఆందోళన చేయవలసిందనీ విజ్ఞప్తిచేశాం. హింద్ మజ్దూర్ సభ తీర్మానానికి స్వాగత మిస్తూ అ. భా. ట్రే. యూ. కాంగ్రెస్ యిలా తెలియ జేసింది :

“ అ. భా. ట్రే. యూ. కాంగ్రెస్ ఎల్లప్పుడూ యీ సూత్రాలను బలపరుస్తూనే వచ్చింది. ఒకే పరిశ్రమలో ఒకే యూనియన్, అన్ని యూని యన్లకు ఒకే జాతీయసమాఖ్య అనే ప్రాతిపదికపై ట్రేడ్ యూనియన్ ఐక్యతను సాధించడానికి మేము పూర్తిగాను, హృదయపూర్వకంగాను సహకరిస్తాం”.

1956 జూన్ 25 న జనరల్ కౌన్సిల్ సభ్యులకు పంపిన సర్క్యులర్‌లో మనమిలా తెలియజేశాం:

“ అన్ని ధోరణులకు చెందిన, అన్ని సమాఖ్యలకు అనుబంధింపబడిన యూనియన్లమధ్య ఐక్యతను సాధించడాని కవలంబించవలసిన పద్ధతులెలా ఉండాలో మరొకసారి జనరల్ కౌన్సిల్ తన అభిప్రాయాలను స్పష్టంగా తెలియజేసి, వాటికనుగుణ్యంగా సహృదయతతోను, బాధ్యతాయుతంగాను ఒక ఉద్యమాన్ని సాగించవలసియుంది. ట్రేడ్ యూనియన్ ఐక్యత యీ రోజున ఆచరణసాధ్యమైన విషయంగా పరిణమించింది”.

జనరల్ కౌన్సిలు 1956 జూలై 28 న కలకత్తాలో సమావేశమైంది. ఇతర సమస్యలతోబాటు అత్యంత ప్రాధా న్యం వహించే ట్రేడ్ యూనియన్ ఐక్యతను గురించి ఆ సమా వేశం చర్చించింది. వివిధ ట్రేడ్ యూనియన్ సమాఖ్యల మధ్య ఐక్యత ఏ ప్రాతిపదిక మీద సాధ్యమో తెలియజేస్తూ అది ఒక తీర్మానం చేసింది. ఐక్యతను సాధించేందుకు యితర

ట్రేడ్ యూనియన్ సమాఖ్యలతో సంప్రతింపులు జరపడానికి 8 మందితో కూడిన ఒక ఉపసంఘాన్నికూడ జనరల్ కౌన్సిలు నియమించింది. అంతకు ముందు జనరల్ కౌన్సిల్ సమావేశంలో అ.భా.ట్రే.యూ. కౌన్సిల్ ఉపాధ్యక్షుడు శ్రీ రణెన్ సేన్ యీ సమస్యపై తాను హింద్ మజ్దూర్ సభ నాయకులతోను, యునైటెడ్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ నాయకులతోను జరిపిన ప్రాథమిక సంభాషణలను గురించి తెలియజేశారు.

ట్రేడ్ యూనియన్ ఐక్యతపై జనరల్ కౌన్సిలు చేసిన తీర్మానంలో హింద్ మజ్దూర్ సభ కార్యవర్గం జూన్ 12 వ తేదీని పేర్కొన్న మూడు సూత్రాలను పరిపుష్టమొనర్చి, ప్రస్తుతం పనిచేస్తున్న ట్రేడ్ యూనియన్ సమాఖ్యల మధ్య ఐక్యతను సాధించడానికి 9 అంశాలతో కూడిన ఒక కార్యక్రమాన్ని రూపొందించింది. అవి:

(1) కార్మిక సంఘాలన్నీ ప్రజాతంత్ర పద్ధతుల్లో పనిచేయాలన్న సూత్రాన్ని ఎట్టి మినహాయింపులు లేకుండా అంగీకరించి, దానికి కట్టుబడియుండాలి.

(2) కార్యనిర్వాహక వర్గ సభ్యులు, అధికార పదవుల్లో ఉన్నవారు దఫాల వారీగా ప్రజాతంత్ర పద్ధతులపై ఎన్నుకోబడుతూ ఉండాలి.

(3) ఉమ్మడి సంస్థయొక్క నాయకత్వ కమిటీలలో అన్ని దృక్పథాలకు ఉచితమైన ప్రాతినిధ్యం ఉండాలి.

(4) ప్రతి కార్మికుడు, ట్రేడ్‌యూనియనిస్టు తనకు నచ్చిన రాజకీయ పార్టీలో సభ్యుడుగా ఉండవచ్చు.

(5) ప్రభుత్వం గాని, యజమానులు గాని, రాజకీయ పార్టీలు గాని ట్రేడ్‌యూనియన్ల ఆంతరంగిక వ్యవహారాల్లో జోక్యం కలిగించుకోకుండా చూడాలి.

(6) కార్మికుల ప్రయోజనాలకు సంబంధించిన ప్రధాన నిర్ణయాలన్నీ — యజమానులతో చేసుకొనే ముఖ్యమైన ఒప్పందాలతో సహా — సర్వసభ్య సమావేశం యొక్క ఆమోదం పొందాలి.

(7) రాజకీయ సమస్యలపై తీసుకొనే నిర్ణయాలకు 100 కి 75 వంతుల మెజారిటీ ఉండాలి.

(8) సాధారణంగా సమ్మె చిట్టచివరి ఆయుధంగా ఉపయోగింపబడాలి; కార్మికుల అభిప్రాయాన్ని సవ్యమైన మార్గంలో తెలుసుకున్న తర్వాతనే సమ్మెకు పిలుపు యివ్వాలి.

(9) ఒకే ఫ్యాక్టరీలో లేదా పరిశ్రమలో లేదా సంస్థలో పోటీ యూనియన్లు ఉండకుండా చేయడానికి యీ క్రింది పద్ధతుల్లో ఏదో ఒకదాన్ని అనుసరించాలి:

(అ) రహస్య బ్యాలటుద్వారా కార్మికులు తమకు నచ్చిన సంఘాన్ని ఎన్నుకొనేందుకు అంగీకరించడం.

(ఆ) అన్ని యూనియన్లను దామాషా ప్రాతినిధ్య పద్ధతి పైన వాటి సభ్యత్వాన్నిబట్టి ఒకటిగా విలీనమొనర్చడం.

(ఇ) బండొరులకు అంగీకార యోగ్యమైన ఏ యితర పద్ధతినైనా అనుసరించడం.

అన్ని ధోరణులవారు, అన్ని సమాఖ్యలకు చెందిన వారు కార్యరంగంలో ఐక్యతను ప్రదర్శించడానికి యిదివరకటి కన్న యిప్పుడు ఎక్కువ అవకాశాలున్నాయని గుర్తించి అ. భా. ట్రే. యూ. కాంగ్రెస్ జనరల్ కౌన్సిలు మరొక తీర్మానం చేసింది. ఈ క్రింది తక్షణ కోర్కెలను సాధించడానికి అఖిలభారత సమాఖ్యలన్నీ, స్వతంత్ర కార్మిక సమాఖ్యలన్నీ దేశవ్యాపితంగా ఒక బ్రహ్మాండమైన ఐక్యఉద్యమాన్ని ప్రారంభించాలని విజ్ఞప్తిచేసింది:

(1) కార్మికుల జీతాలను 100 కి 25 చొప్పున పెంచాలి.

(2) కనీసవేతనం రు. 100 ఉండాలి.

(3) ఏ సూత్రాలపై కార్మికుల జీతాలు నిర్ణయింపబడాలో తెలియజేసేందు కొక జీతాల కమిషన్ నియమించాలి.

(4) సక్రమమైన బోనసు యివ్వాలి.

జీతాల పెంపుదల, జీతాల కమిషన్, కనీసవేతనం, బోనసు సమస్యలపై కార్మికులకోర్కెలెలాఉండాలో చర్చించి తుది స్వరూప మివ్వడానికి జాతీయసమాఖ్యలన్నిటి ప్రతినిధులతో కూడిన ఒక తాత్కాలిక సంప్రతింపుల సంఘాన్ని నెలకొల్పడం ఎంతో అవసరమని కూడ ఆ తీర్మానం స్పష్టం చేసింది.

# 46. యునైటెడ్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్

ట్రేడ్‌యూనియన్ ఐక్యతను సాధించే విషయంలో జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్, అ. భా. ట్రే. యూ. కాంగ్రెసు, హింద్‌మజ్దూర్ సభ చాల ప్రధానమైనపాత్ర వహించేమాట నిజమేకావచ్చు. అయినా యునైటెడ్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసుకుకూడ కొంతపాత్ర ఉంది. ముఖ్యంగా హింద్‌మజ్దూర్ సభ, అ. భా. ట్రే. యూ. కాంగ్రెస్ సన్నిహిత సంబంధాలుంచుకోటంలో యునైటెడ్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు సహాయకారిగా ఉంది.

ఐక్యతను సాధించేందుకు మార్గాలు అన్వేషించడానికి అన్ని జాతీయ సమాఖ్యల ప్రతినిధులతో రౌండ్‌టేబుల్ సమావేశం జరపాలంటూ అ. భా. ట్రే. యూ. కాంగ్రెసు చేసిన సూచనను యునైటెడ్ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు బలపరచింది.

హింద్‌మజ్‌దూర్ సభ కార్యవర్గంచేసిన తీర్మానాన్ని యునైటెడ్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ కార్యవర్గం 1956 జూలైలో పూర్తిగా బలపరుస్తూ తీర్మానించింది.

ఈ సందర్భంలో మనమొక విషయాన్ని జ్ఞాపకముంచుకోవాలి. తనతోబాటు హింద్‌మజ్‌దూర్ సభను కూడా అ. భా. ట్రే యూ. కాంగ్రెసులోకి తీసుకువచ్చేందుకు ప్రయత్నిస్తున్నాననే కారణం చెప్పిన యునైటెడ్ ట్రేడ్‌యూని

యన్ కాంగ్రెసు 1953 లో అ. భా. ట్రే. యూ. కాంగ్రెసులో చేర నిరాకరించింది. 1956 లో హింద్ మజ్దూర్ సభ జరిగిన తర్వాత హింద్ మజ్ దూర్ సభను, యునైటెడ్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసును కలపడానికి ఆ రెండు సంస్థల నాయకులు సంప్రతింపులు ప్రారంభించారు.

## 47. ప్రస్తుత అవకాశాలు

హింద్ మజ్దూర్ సభ కార్యవర్గం 1956 లో చేసిన తీర్మానంలోను, 1957 లో ప్రచురించిన నివేదికలోను కొన్ని నిర్మాణాత్మకమైన అంశాలున్నాయి.

(1) "భారతదేశంలో సర్వతోముఖమైన ట్రేడ్ యూనియన్ ఐక్యత తక్షణమే సాధించవలసిన విషయం.

(2) ద్వేషాలు, పరస్పర అనుమానాలవల్ల కొంత ప్రమాదం ఉన్నప్పటికీ, "యింత ప్రధానమైన ఆశయంకోసం కొంత త్యాగంచేయవలసివచ్చినా అందుకుసిద్ధంగా ఉండాలని కార్యవర్గం అభిప్రాయ పడుతోంది."

(3) ఏసూత్రాలమీద ఐక్యత ఆధారపడియుండాలో ఆ సూత్రాలను పరస్పర చర్చలద్వారా తేల్చుకోవచ్చు.

పై నిర్మాణాత్మకమైన అంశాలను గుర్తిస్తూనే, ఆ సంస్థకు ఐక్యత అంటే ఉన్న భయాన్ని కూడా మనం గమనించాలి. ఈ క్రింది మాటల్లో ఆ భయం వ్యక్తమవుతోంది :

"అయితే, కేవలం జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌తోగాని అ. భా. ట్రే. యూ. కాంగ్రెస్‌తోగాని ఆచరణకు సంబంధించిన కొన్ని సర్దుబాట్లు చేసుకున్నంతమాత్రాన సరిపోదనీ, అట్టిపద్ధతి సర్వతోముఖమైన ఐక్యతకు ఆటంకంకూడా కలిగించవచ్చుననీ కార్యవర్గం భావిస్తోంది."

1957 లో హింద్ మజ్దూర్‌సభ మనమీద మరికొన్ని ఆరోపణలు చేసింది. అది యిలా ప్రకటించింది:

"అ. భా. ట్రే. యూ. కాంగ్రెసుయొక్క స్వభావాన్ని గురించి హింద్‌మజ్దూర్ సభకు ఎలాంటిభ్రమలు లేవు. జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసుకీ, అ. భా. ట్రే. యూ. కాంగ్రెసుకీ గల భేదం ఒకటే. జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసుపై పెత్తనంచెలాయించే పార్టీ ప్రభుత్వాధికారంలో ఉంది; అ. భా. ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసుపై పెత్తనం చెలాయించేపార్టీ అధికారంలోలేదు. హంగరీ ఉదంతంపై అది తీసుకున్న వైఖరి మరోసారి దాని అసలు స్వభావాన్ని బహిర్గతంచేసింది. అయినప్పటికీ, అ. భా. ట్రే. యూ. కాంగ్రెసుతోఐక్యతను సాధించేందుకు కొంత త్యాగం అవసరమవుతుంది. అయితే, ఆ త్యాగంతో సమాన విలువ గల ట్రేడ్ యూనియన్ ఐక్యత సిద్ధించాలి; పాక్షిక ఐక్యత సరిపోదు. కారణమేమంటే, పాక్షికఐక్యత సిద్ధించినా, అనైక్యత ఉండనేఉంటుంది."

ఈ నివేదిక 1957 జూన్‌లో వ్రాయబడింది. ఆతర్వాత కేరళలో ప్రజాసోషలిస్టుపార్టీ నాయకత్వాన ఉన్న హింద్ మజ్దూర్‌సభ అ.భా.ట్రే.యూ. కాంగ్రెస్‌కు వ్యతిరేకంగా నిలిచింది. అక్కడ ప్రజాసోషలిస్టుపార్టీ కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన నడుస్తున్న కేరళప్రభుత్వానికి వ్యతిరేకంగా కాంగ్రెసుతో చేతులుకలిపింది. అదేసమయంలో బొంబాయిలో హింద్ మజ్దూర్‌సభ అ.భా.ట్రే.యూ. కాంగ్రెస్‌తో యిదివరకు కన్న ఎక్కువగా సహకరించుతోంది.

పై నివేదికలో హింద్ మజ్దూర్‌సభ నాయకుల భయం, ఐక్యసమాఖ్యలో తాము బలమైన స్థానంలో ఉండాలనే కోరిక వ్యక్తమవుతున్నాయి. కాని ఐక్యతను సాధించేందుకు హింద్ మజ్దూర్‌సభ బహిరంగంగా కొన్ని సూచనలు చేయడంవల్ల ఆ సంస్థకు చెందిన సభ్యులు ఐక్య కార్యాచరణకు పూనుకోడానికి అవకాశం ఉంది.

ప్రస్తుత పరిస్థితుల్లో జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్, అ.భా.ట్రే.యూ. కాంగ్రెసు, హింద్‌మజ్దూర్ సభ, యునైటెడ్ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్‌ల మధ్య సర్వతోముఖమైన ఐక్యతను సాధించటం సాధ్యమేనా ? కార్మికులు రహస్యబ్యాలటు ద్వారా తమకు నచ్చిన యూనియన్‌ని ఎన్నుకోడానికి జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు అంగీకరిస్తుందా ? అ. భా. ట్రే. యూ కాంగ్రెసుతో సహా అన్ని ట్రేడ్‌యూనియన్ సమాఖ్యల మధ్య సర్వతోముఖమైన ఐక్యతను సాధించడానికి జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ అంగీకరించకపోతే, అట్టి సర్వతోముఖమైన ఐక్యతకు తొలిమెట్టుగా హింద్‌మజ్దూర్ సభ అ.భా.ట్రే.యూ. కాంగ్రెసుతోను, యునైటెడ్ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసుతోను ఐక్యతకు అంగీకరిస్తుందా ? ఇవి మనముందున్న కొన్ని సమస్యలు.

దేశంలో జరుగుతున్న కొన్ని పరిణామాలవల్ల, కార్మికుల్లో వ్యాపించిన ఐక్యతావాంఛవల్ల జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు అ. భా. ట్రే. యూ. కాంగ్రెసుతో ఐక్యం

కావాలన్న సూచనను ఒక్కసారిగా నిరాకరించగలస్థితిలో లేదు; ఐనప్పటికీ, దానిలక్ష్యం అ. భా. ట్రే. యూ. కాంగ్రెసును వేరుచేయడానికి మిగతా సంస్థలతో చేతులుకలపడం. ఐతే ఈ రోజున అది కార్మికుల ఒత్తిడిఫలితంగా వారికోర్కెలను గురించి మాట్లాడవలసివస్తోంది. అవి యితర సంస్థల కోర్కెలను పోలియున్నాయి. వాస్తవఘటనలు త్రోసిపుచ్చడానికి వీలులేనివి. గత 5 సంవత్సరాల్లోను ఉత్పత్తి 100 కి 45 చొప్పున పెరిగినప్పటికీ, కార్మికుల జీతాలు 1939 స్థాయిలోనే ఉన్నాయి. అదైనా సంఘటిత పరిశ్రమల్లో మాత్రమే. ఇట్టిపరిస్థితుల్లో జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు నాయకత్వం తక్షణమే కార్మికుల జీతాలను పెంచాలన్న కోర్కెపైన, జీతాలస్కేళ్ళను సవరించాలన్న కోర్కెపైన మౌనం వహించడం అసాధ్యం. ముఖ్యంగా యీ సమస్యలమీద పెద్ద ఆందోళన, పోరాటం జరుగుతున్నప్పుడు చూస్తూ కూర్చోటం అసలే సాధ్యంకాదు. క్రిందటి సంవత్సరం జరిగిన కాన్పూరు సమ్మెను గురించి అంబేకర్ యిలా అన్నారు:

"కాన్పూరు సమ్మె అందరికీ కనువిప్పు కలిగించింది; రేషనలైజేషన్ అన్నా, పునర్వ్యవస్థీకరణ అన్నా కార్మికుల్లో ఎంత తీవ్రమైన అసంతృప్తి ఉందో ఆ సమ్మెవల్ల స్పష్టమైంది."

నాయకత్వం మధ్య, నాయకులకూ క్రిందిస్థాయిలోని కార్యకర్తలకూ మధ్య కొన్ని వైరుధ్యాలు, అభిప్రాయ భేదాలు ఉన్నప్పటికీ, అవి సంస్థలో మాత్రం నిర్దిష్టరూపం ధరించలేవు. మొత్తం సంస్థ అ.భా. ట్రే.యూ. కాంగ్రెస్‌తో

ఐక్యత కుదుర్చుకోడానికి వ్యతిరేకం. ప్రధానంగా అది కాంగ్రెసుయొక్క, ప్రభుత్వం యొక్క రాజకీయ విధానాలను అమలు జరపడానికి నిశ్చయించుకొంది. యజమానులు, ప్రభుత్వం కార్మికులకుకొన్ని సదుపాయాలు కలిగించే ప్రాతి పదిక మీద అఖిలభారతస్థాయిలో బేరమాడగలశక్తిని కలిగి యుంటూ తన గుత్తాధికారాన్ని నిలబెట్టుకోవాలనేదే దాని లక్ష్యం. కార్మికవర్గం తన కోర్కెలను సాధించుకోడానికి విస్తృతంగా చొరవతీసుకోడం దానికిష్టంలేదు; అట్టిచొరవను అరికట్టడమే దాని విధానం. 1955, 56, 57 సంవత్సరాల్లో కార్మికులు తమహక్కులకోసం అమృతసర్, బర్న్ పూర్, జమ్షెడ్ పూర్, కాల్కా, కాన్పూర్, ఖర్గపూర్, నాగపూర్ మొదలైన చోట్ల బ్రహ్మాండమైన పోరాటాలు జరిపారు. వాటి పర్యవసానంగా జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ కార్మికవర్గానికి దూరమైంది. దానిస్థానం బలహీనపడింది. ఇట్టి పరిస్థితుల్లో హింద్ మజ్దూర్ సభకూ అ. భా. ట్రే. యూ. కాంగ్రెసుకు మధ్యనున్న వైరుధ్యాలను, కమ్యూనిస్టుల యెడ హింద్ మజ్దూర్ సభ నాయకులకున్న అనుమానాలను ఉప యోగించుకొని అది తన స్థానాన్ని పటిష్ఠమొనర్చుకో దలచింది.

సాధారణ ఎన్నికల తర్వాత కాంగ్రెసుతోను, ప్రభుత్వంతోను జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ కు గల సాన్నిహిత్యం మరింత అధికమయింది. కాంగ్రెసు కమిటీలలో దానికి వర్గప్రాతినిధ్య మీయబడింది ఎన్నికలలో కాంగ్రెస్

తరఫున పోటీచేసేందుకు తన సొంత అభ్యర్థుల్ని అది నిలబెడు తుంది; ట్రేడ్‌యూనియన్ సంస్థగా అది కాంగ్రెస్ అభ్యర్థుల్ని బలపరుస్తుంది.

ఇదంతా, కార్మికులు తమ సంఘాలను అతివాద భావాలవైపు తీసుకెళ్ళకుండా, అ. భా. ట్రే. యూ. కాంగ్రెసుతో దగ్గర సంబంధా లేర్పరచుకోకుండా, ఐక్య కార్యాచరణకు పూనుకోకుండా నిరోధించేందుకే.

ఇట్టి పరిస్థితుల్లో సర్వతోముఖమైన ఐక్యతను సాధించడానికి హింద్‌మజ్దూర్‌సభ చేసిన సూచనలనుగాని అ. భా. ట్రే.యూ. కాంగ్రెస్ చేసిన సూచనలనుగాని జాతీయట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ ప్రస్తుతానికి అంగీకరించదు. కార్మికులు రహస్య బ్యాలటుద్వారా తమకు నచ్చిన యూనియన్ని ఎన్నుకోడానికి యిష్టపడదు. గత రెండు సంవత్సరాల్లోను ప్రావిడెంట్ ఫండు.ట్రస్టీలు, వర్క్సుకమిటీలు మొదలైన సంస్థలకు రహస్యబ్యాలటు ద్వారా జరిగిన ఎన్నికల్లో జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ ప్రతినిధులు ఘోర పరాజయం పొందారు. 1956 ఏప్రిల్‌లో రోటాస్ ఇండస్ట్రీస్‌లో జరిగిన ఎన్నికలో హింద్‌మజ్దూర్ సభకు 3481 ఓట్లు వస్తే, జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్‌కు 409 ఓట్లే వచ్చాయి. ఇలాగే బ్రజరాజ్‌నగర్ పేపర్‌మిల్స్‌లో జరిగిన ఎన్నికలో హింద్‌మజ్దూర్ సభతో పోటీచేసిన జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ చిత్తుగా ఓడిపోయింది. ఏమే ఫ్యాక్ట

రీల్లో జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ సంఘాలు గుర్తింపబడ్డాయో ఆ ఫ్యాక్టరీలలో (ఉదా: చిత్తరంజన్ లోకోమోటివ్ ఫ్యాక్టరీ, హిందుస్తాన్ షిప్‌యార్డు వగైరా) వర్క్సు కమిటీలకు జరిగిన ఎన్నికలలో జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ ఓడిపోయింది. 9 యూనియన్లలో సంఘటితులైయున్న పోస్టల్, టెలిగ్రాఫ్ పనివారలు నేషనల్ ఫెడరేషన్ ఆఫ్ పోస్ట్ అండ్ టెలిగ్రాఫ్ ఎంప్లాయీస్ అనే సంస్థను స్థాపించుకొని కొత్తనిబంధనావళిని తయారుచేసుకొని కొత్త ఎన్నికలు జరుపుకున్నప్పుడు జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ మెజారిటీ స్థానాలను సంపాదించలేక పోయింది. కనుకనే అది తన నివేదికలో నేషనల్ ఫెడరేషన్ ఆఫ్ పోస్ట్ అండ్ టెలిగ్రాఫ్ ఎంప్లాయీస్ "సంకుచితమైన సిద్ధాంత ప్రయోజనాలకై ఆ సంస్థను ఉపయోగించుకొనజూస్తోంది" అంటూ విమర్శించింది. గత జూలైలో పోస్టు, టెలిగ్రాఫ్ పనివారలు జరిపిన పోరాటాన్ని జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ బలపరచలేదు. అందుచేత అది తన పలుకుబడిని మరింతగా కోల్పోయింది.

వీటన్నిటిని బట్టి తెలిసేది ఏమంటే, ఒకానొక యూనియన్‌కి ఎంతబలం ఉందో తేల్చుకొనేందుకై రహస్యబ్యాలటు ద్వారా ఎన్నిక జరగటమంటే జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు అంగీకరించదు.

ఇట్టి పరిస్థితుల్లో — అనగా జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు అ. భా. ట్రే. యూ. కాంగ్రెస్‌తో సహ

అన్ని సంస్థలతోను ఐక్యత సాధించడానికి వెంటనే ఒప్పుకోని పరిస్థితుల్లో — హింద్ మజ్దూర్ సభ వైఖరి, యునైటెడ్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ వైఖరి ఏమిటి ?

ఇది చాల ముఖ్యమైన సమస్య. సర్వతోముఖమైన ఐక్యతకు తొలిమెట్టుగా ప్రస్తుత పరిస్థితుల్లో అ. భా. ట్రే. యూ. కాంగ్రెసు, హింద్ మజ్దూర్ సభ, యునైటెడ్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ ఐక్యతను సాధించడం చాల ప్రాధాన్యంగల విషయం. దీనివల్ల జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌కు వెలుపలనున్న కార్మికవర్గంలో అపూర్వమైన ఉత్సాహం కలగటమేగాక, జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌లో సైతం ఐక్యతావాంఛ ఉత్పన్నమవుతుంది. ఇట్టి ఐక్యత సిద్ధించిననాడు ప్రస్తుతం చీల్చబడియున్న కార్మిక వర్గంలో గొప్ప సృజనాత్మక శక్తి వెల్లివిరుస్తుంది. ఇతర ట్రేడ్ యూనియన్ సంస్థల కోర్కెలనే జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ కూడ రూపొందించడంవల్ల అట్టి ఐక్యత విస్తృతమైన ఐక్య కార్యాచరణకు దారితీస్తుంది. అయితే, అలాంటి ఐక్యతను సాధించడం సులభమైన విషయమేమీకాదు. మనం అనేక సమస్యలను శ్రద్ధగా పరిశీలించి అర్థంచేసుకోవలసి యుంది. అప్పుడుగాని అట్టి ఐక్యతకు అనుకూలమైన అవసరమైన దృక్పథం ఏర్పడదు. ప్రస్తుతపరిస్థితుల్లో సర్వతోముఖమైన ఐక్యతను సాధించడం అసాధ్యం. ఐనప్పటికీ, హింద్ మజ్దూర్ సభతోను, యునైటెడ్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ తోను ఐక్యతను సాధించడం ఆచరణ సాధ్యమే.

అయితే యిందుకు కొన్ని చిక్కులను అధిగమించవలసియుంది. దానికి మార్గం కార్మికుల కోర్కెలకై కలసి పోరాడ్డం, పై మూడు సంస్థల నాయకులు ఇంకా ఎక్కువగా స్నేహ సంబంధాలుంచు కొంటూ అన్యోన్యంగా సంప్రతింపులు జరుపుకొంటూ ఉండటం.

## 48. ఇంకా యెక్కువ ఐక్య కార్యాచరణకు అవకాశాలు

పై ధోరణి యిటీవల అధికం కాజొచ్చింది. ఐక్యతకు అవకాశాలు యీ క్రింది అంశాల్లో వ్యక్తమవుతున్నాయి:

(1) కార్మికుల కోర్కెల విషయంలోను, అంతర్జాతీయ పరిణామాలకు సంబంధించిన వివాదాలలోను అఖిలభారత ట్రేడ్‌యూనియన్ సమాఖ్యలన్నిటిమధ్య ఎంతో ఏకాభిప్రాయం ఉంది.

మొదటి పంచవర్ష ప్రణాళికవల్ల కార్మికులకు న్యాయం జరగలేదని అ.భా.ట్రే.యూ. కాంగ్రెసు, హింద్ మజ్దూర్ సభ జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ అంగీకరిస్తున్నాయి. ఒకవైపు ఉత్పత్తి 100 కి 45 చొప్పున పెరిగింది; కాని ఉత్పత్తిఅయిన సరకుల నికరపు విలువలో కార్మికుల భాగం 100 కి 44.7 నుంచి 41.1 కి తగ్గింది. ఫ్యాక్టరీ కార్మికుల అసలు జీతాలు 1939 స్థాయితో పోల్చుకుంటే, 100 కి 102.7 వరకు మాత్రమే హెచ్చాయి. కార్మికులలో అధికసంఖ్యాకు లిప్ప

టికీ దారుణమైన పరిస్థితుల్లో జీవిస్తున్నారు. (ఈ విషయం ప్రభుత్వమే అంగీకరించింది).

సంఘటిత పరిశ్రమ లన్నిటిలోను కార్మికుల కనీస వేతనం రు. 100 ఉండాలని ట్రేడ్ యూనియన్ సమాఖ్యలు మూడూ కోరుతున్నాయి.

వెంటనే కార్మికులందరి జీతాలను 100 కి 25 చొప్పున పెంచాలన్న విషయంలో కూడ ఏకాభిప్రాయం ఉంది. అయితే శ్రీ అశోకమెహతా పార్లమెంటులో ద్వితీయ పంచవర్ష ప్రణాళికపై ఉపన్యసిస్తూ వెంటనే జీతాలను పెంచాలన్న కోర్కెను బలపరచలేదు.

ఇలాగే, జీతాలను నిర్ణయించడంలో యిప్పుడమల్లో ఉన్న పద్ధతిని మార్చేందుకొక కమిషన్‌ని నియమించాలనీ, బోనసులు చెల్లించేందుకు ఒక కొత్తస్కీమును తయారుచేయాలనీ, రేషనలైజేషన్ ప్రవేశపెట్టేముందు దేశ శ్రేయస్సును కార్మికుల శ్రేయస్సును దృష్టిలో ఉంచుకొని యజమానులు కొన్ని షరతులకు కట్టుబడియుండాలనీ, కార్మికులందరికీ ప్రావిడెంటు ఫండు సౌకర్యం కలిగించాలనీ, ఎంప్లాయీస్ స్టేట్ ఇన్సూరెన్సు స్కీము క్రింద లభించే వైద్య సదుపాయాలను కార్మికుల కుటుంబాలకు కూడా కల్పించాలనీ, ఇప్పటికన్న విస్తృతమైన సమగ్రమైన సాంఘిక భద్రతా స్కీమును ప్రవేశపెట్టాలనీ, అధిక ధరల ఎలవెన్సును మూలవేతనంతో కలిపి యివ్వాలనీ, నిరుద్యోగాన్ని నిర్మూలించాలనీ — అందరూ కోరుతున్నారు.

(2) అఖిలభారత ట్రేడ్ యూనియన్ సమాఖ్యలన్నీ ద్వితీయ పంచవర్ష ప్రణాళిక విజయాన్ని కోరుతున్నాయి. కాని దానిభారం కార్మికులమీద, కష్టజీవులమీద పడకుండా చూడాలంటున్నాయి.

(3) ప్రపంచశాంతి, శాంతియుత సహజీవనం, వివిధ దేశాల మధ్య స్నేహసంబంధాలు, అన్యోన్యంగా ప్రతినిధివర్గాలను పంపించుకోటం, ఒండొరుల సమస్యలను అర్థంచేసుకోటం మొదలైన సమస్యలపైకూడ అన్ని ట్రేడ్ యూనియన్ సంస్థలు ఏకాభిప్రాయాన్ని కలిగియున్నాయి. ఇది 15 వ అఖిలభారత కార్మిక మహాసభలో స్పష్టంగా ద్యోతకమైంది. ఆ మహాసభలో ట్రేడ్ యూనియన్ ప్రతినిధులందరు ప్రధాన సమస్యలన్నిటి పైన ఏకాభిప్రాయం ప్రకటించారు. నెహ్రూ పండితుని శాంతివిధానాన్నీ, అణ్వాయుధాలను నిషేధించాలని అగ్రరాజ్యాలకు ఆయన చేసిన విజ్ఞప్తినీ ట్రేడ్ యూనియన్ నాయకులంతా పార్లమెంటులో బలపరిచారు.

ఇట్టి ఏకాభిప్రాయంవల్ల ఒండొరులమధ్యవున్న దురభిప్రాయాలకు, ద్వేషాలకు ఆధారభూతంగా ఉన్న ఒక ప్రధానాంశం తొలగిపోతుంది; విభిన్న ట్రేడ్ యూనియన్ సంస్థలకు చెందిన కార్మికుల్ని అంతకంతకు అధికసంఖ్యలో సమీకరించడానికి అవకాశమేర్పడుతుంది; ఉమ్మడిసమస్యలపై నాయకుల మధ్య, కార్మికప్రజల మధ్య ఐక్యకార్యాచరణ అంతకంతకు అధికం కావడానికి మార్గం సుగమమవుతుంది.

# 49. ఐక్యతపట్ల ప్రభుత్వ దృక్పథం

మొదటి పంచవర్ష ప్రణాళికను తయారుచేసినవారు కార్మికుల జీతాలను ఎక్కడివాటినక్కడ యించుమించు నిలిపి యుంచే విధానమవలంబించారు; కార్మికుల పనిభారాన్ని పెంచే విధానాన్ని, రేషనలైజేషన్ విధానాన్ని అవలంబించారు. కాని కార్మికులు జీతాల పెంపుదలకొరకు, రేషనలైజేషన్ రద్దుకు దృఢవిశ్వాసంతో పోరాడ్డంవల్ల వారు ఆవిధానాన్ని మొదట అనుకున్నంత ఉచ్ఛస్థాయిలో అమలు జరప లేక పోయారు.

ఇక ట్రేడ్‌యూనియన్ రంగంలో ప్రభుత్వ మవలంబిస్తున్న విధాన మెట్టిదో చూదాం. జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసును, దానితో ఏకీభవించే వారిని మాత్రమే ప్రభుత్వం గుర్తిస్తోంది. ఇతర ట్రేడ్ యూనియన్లు ఇంచుమించు పనిచేయడం అసాధ్యమయ్యే విధంగా కార్మిక చట్టాలను తయారుచేస్తోంది.

ఈ విధంగా ప్రభుత్వం కాంగ్రెసు యూనియన్లను, తన తాబేదార్లను కార్మికులమీద బలవంతంగా రుద్ది ట్రేడ్ యూనియన్ హక్కులను ప్రజాతంత్ర హక్కులను అపహరించే మార్గ మవలంబిస్తూన్నప్పటికీ, "పారిశ్రామిక శాంతి"ని నెలకొల్పడంలోగాని, జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసును ఏకైక కార్మిక సంస్థగా తయారుచేయడంలోగాని అది విజయం సాధించ లేక పోయింది.

రెండవ ప్రణాళికా కాలంలో "రాజకీయ కక్షలను," "బహుళ సంఖ్యాక ట్రేడ్‌యూనియన్లను" రద్దుచేసే పేరుతో కార్మిక మంత్రిత్వశాఖ 1955 ఆగస్టులో ప్రణాళికా సంఘం యొక్క లేబర్ ప్యానెల్ ముందు చర్చకోసం ఒక పత్రాన్ని ఉంచింది. పాత విధానాన్నే కొత్తపద్ధతిలో అమలుజరపమన డం దాని ఉద్దేశం. ఈ విషయం క్రింది సూచనల్లో ద్యోతక మవుతుంది:

"ఆరోగ్యవంతమైన ట్రేడ్‌యూనియన్ ఉద్యమం అభివృద్ధి చెంది తేనే పారిశ్రామిక శాంతి సిద్ధిస్తుంది. అందుచేత కార్మిక మంత్రిత్వశాఖ 'క్లోజ్డ్ షాప్,' 'యూనియన్‌షాప్' పద్ధతులను అంగీకరిస్తుంది. అయితే అందుకు చట్ట సంబంధమైన అడ్డంకులేవీ ఉండకూడదు."

ఈ సూచనను లేబర్ ప్యానెల్ అంగీకరించలేదు.

అయినప్పటికీ, కార్మిక మంత్రిత్వశాఖ యొక్క సూచన వల్ల ఒక విషయం స్పష్టమవుతుంది. మొత్తం కార్మికులలో ఒక శాతాన్ని కనిష్టపరిమితిగా నిర్ణయించి, దానిప్రకారం జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్‌ను ఏకైక కార్మిక సంస్థ గా గుర్తించడమే ప్రభుత్వోద్దేశమని తెలుసుకోవచ్చు. యూనియన్ల నిర్వహణకు కొత్త రిజిస్ట్రేషన్ చట్టాలను ప్రవేశ పెట్టి వాటిని అది కార్మికులమీద రుద్దదలచుకొంది; సభ్యత్వం విషయంలో కార్మిక సంఘాల రికార్డులను, పనిని తనిఖీచేసేం దుకు ఇన్‌స్పెక్టర్లను కూడా నియమించదలచుకొంది. ఇట్టి పద్ధ తుల ద్వారా కార్మిక మంత్రిత్వశాఖ ఇతర యూనియన్ల అస్తిత్వాన్నే నాశనంచేయ పూనుకొంది.

"యూనియన్ కక్షలను" గురించి వారెన్ని కబుర్లు చెప్పినా, 1952 లో జరిగిన నైనిటాల్ సమావేశంలో అప్పటి కార్మిక మంత్రి శ్రీ వి. వి. గిరి రహస్య బ్యాలటు ద్వారా తమకు నచ్చిన సంఘాన్ని కార్మికులు ఎన్నుకోవాలంటూ చేసిన సూచనను ప్రస్తుత కార్మిక మంత్రిత్వశాఖ అంగీకరించడం లేదు.

అంతేకాదు. ఒకే పరిశ్రమకు ఒకే యూనియన్ ఉండాలని గాని, దేశానికంతకూ ఒకే సమాఖ్య ఉండాలని గాని వారు సూచించడం లేదు. అన్ని యూనియన్ల సభ్యులు కలిసి సింగిల్ ట్రాన్స్‌ఫరబుల్ ఓటు ద్వారా తమకు నచ్చిన కార్యవర్గ సభ్యుల్ని, అధ్యక్ష కార్యదర్శుల్ని ఎన్నుకొనే పద్ధతికి తమ అంగీకారం ప్రకటించడం లేదు. అలా ఎన్నుకోబడే కార్యవర్గంలో అన్ని దృక్పథాలకు చెందినవారు సభ్యులుగా ఉంటారు. ఎందుచేతంటే, ఎన్నిక దామాషా ప్రాతినిధ్య పద్ధతిపై జరుగుతుంది. అలాఏర్పడే యూనియన్‌లో పాతయూనియన్లలో ఉన్నవారందరూ సభ్యులు అవుతారు. దాన్ని నడిపేది కొత్తగా ఎన్నుకోబడే కార్యవర్గం. ఈవిధంగా కొత్త యూనియన్ అవతరించిన తర్వాత అదివరకున్న పోటీ సంఘాలన్నీ రద్దవుతాయి.

ఈ పద్ధతికి ప్రత్యామ్నాయంగా ప్రభుత్వం చేస్తున్న సూచన ఏమంటే "కొంత స్థిరత్వం కలిగిన సభ్యత్వం," మొత్తం కార్మికుల్లో "కొంత శాతం" ఏ యూనియన్‌కి ఉంటుందో దాన్ని ఏకైక ప్రతినిధి సంస్థగా గుర్తించడం. దీన్ని

బట్టి, కార్మికులు తమకు నచ్చిన సంఘాన్నెన్నుకోవడం ప్రభుత్వాని కిష్టంలేనట్లు స్పష్టమవుతూంది. జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్‌కే ఎక్కువ బలం ఉందని రుజువుచేసేందుకు గాను సభ్యుల సంఖ్యను సులభంగా తారుమారు చేయవచ్చు. కనుకనే ప్రభుత్వం యీ సూచన కింత ప్రాధాన్యమిస్తోంది.

"కార్మిక విధానం, ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కార్యక్రమం (చిత్తుముసాయిదా)" అను అధ్యాయంలో ఇలా ఉంది:

"ప్రధానవిషయాల్లో మొదటి పంచవర్ష ప్రణాళికలోని కార్మిక విధానమే ద్వితీయ ప్రణాళికకు కూడ వర్తిస్తుంది; పారిశ్రామిక సంబంధాల్లో కూడ ఆ దృక్పథమే అనుసరింప బడుతుంది. అయితే, ద్వితీయ ప్రణాళిక సోషలిస్టు సమాజ స్థాపనకు ప్రాముఖ్యమిస్తూండటం వల్ల కొన్ని మార్పులు, సంస్కరణలు అవసరమవుతాయి.

"ప్రస్తుతం అమల్లోఉన్న కార్మిక చట్టాలను యీక్రింది లక్ష్యాల్ని దృష్టిలో ఉంచుకొని సంస్కరించవలసియుంటుంది: (1) ట్రేడ్ యూనియన్లలో బయటివారి సంఖ్యను పరిమితంచేయడం. (2) కొన్ని షరతులపై ట్రేడ్ యూనియన్లను చట్టం గుర్తించటం. (3) యూనియన్ అధికారుల్ని యజమానులు అక్రమశిక్షలకు గురిచేయకుండా చూడటం. (4) ట్రేడ్‌యూనియన్ ఉద్యమం ఆర్థికంగా తన కాళ్లమీద తాను నిలబడేటట్లు చూడడం; దాని ఆర్థిక పునాదిని చక్కబరచడం. ట్రేడ్‌యూనియన్ ఉద్యమాన్ని పటిష్ఠమొనర్చాలంటే ఇట్టి శాసనం చాల అవసరం. అంతేకాక, ట్రేడ్ యూనియన్ ఉద్యమంలో ఐక్యత తీసుకొచ్చేందుకు ఐచ్ఛిక కృషి కూడా అవసరం."

ట్రేడ్ యూనియన్ ఐక్యతకు సంబంధించిన భాగాన్ని మాత్రమే పైన పేర్కొన్నాను.

ఇక జీతాల విషయమై కార్మిక విధాన మేట్టిదో చూదాం. అసలు జీతాల పెరుగుదల "ఉత్పత్తియొక్క పెరుగుదలను బట్టే ఉండాలి," అని కార్మిక విధానం నిర్దేశిస్తోంది. కార్మికులు, యజమానులు ఒండొరులతో జరుపుకొనే సంప్రతింపులకు, రాజీసర్దుబాట్లకు అధిక ప్రాముఖ్యత నిచ్చింది. కార్మికులకు కొన్ని సదుపాయాలుకూడా యివ్వవలసియుంటుందని చెప్పింది.

అందుచేత ప్రభుత్వవిధానం స్పష్టంగానే ఉంది. తమకు నచ్చిన సంఘాన్నెన్నుకొనేందుకు స్వేచ్ఛ కార్మికులకు ఉండదు. అన్నిటికంటె ఎక్కువ ప్రాతినిధ్యంగల సంఘంగా గుర్తింపబడే యూనియన్‌కి ఏయే అర్హతలుండాలో నిర్ణయించేది కూడ ప్రభుత్వమే. ఇటీవల జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ తప్ప మిగతా సంస్థలు అట్టి యూనియన్‌కి అర్హతలెట్టివో, ఒకే పరిశ్రమకు ఒకే యూనియన్ ఉండేటట్లు చేయడమెలాగో, కార్మికులు తమకునచ్చిన ట్రేడ్ యూనియన్ సమాఖ్యను ఎన్నుకొనేందుకు ఎట్టిమార్గమవలంబించాలో తెలియజేయవలసిందంటూ ప్రభుత్వాన్నికోరాయి. ఆ ప్రశ్నలకు ప్రభుత్వం "ట్రేడ్‌యూనియన్ ఉద్యమంలో ఐక్యతను తీసుకురావడానికి ఐచ్ఛికకృషి కూడా అవసరం," అని జవాబు చెప్పింది.

ఎందుచేత? స్వేచ్ఛాయుతమైన ఎన్నికకు అవకాశమిస్తే జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసుకు వ్యతిరేకంగా ఫలితాలుండవచ్చునన్న విషయం ప్రభుత్వానికి తెలుసు.

ట్రేడ్‌యూనియన్ ఉద్యమంలో అట్టి ఐక్యత సిద్ధిస్తే కార్మికులు ప్రభుత్వచర్యలన్నిటికీ తల ఊపరనీ, తమ జీవనప్రమాణాలను దెబ్బకొట్టే చర్యలను ప్రతిఘటిస్తారనీ కూడ ప్రభుత్వానికి తెలుసు.

ఇదీ, ప్రభుత్వం స్థూలంగా నేడనుసరిస్తున్న విధానం. ఇందులో కూడా ముందుముందు మార్పు జరగటం అసంభవ మేమీ కాదు. కార్మికోద్యమంలో ఐక్యత ఏర్పడ్డానికి అవకాశాలు పెరిగేకొద్దీ, తమకునచ్చిన సంఘాన్నెన్నుకొనేందుకు హక్కు ఉండాలన్న కోరిక కార్మికుల్లో బలపడేకొద్దీ ప్రభుత్వ విధానాల్ని మార్చగల శక్తి వారికి లభిస్తుంది. రెండవ పంచవర్ష ప్రణాళిక విజయవంతమవాలంటే సంతృప్తితో పనిచేసే కార్మికవర్గం ఉండాలి. కాని పైన నేను పేర్కొన్నట్లు ప్రభుత్వం జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్‌ను ఎంతగా అభిమానిస్తున్నప్పటికీ, రెండవ పంచవర్ష ప్రణాళిక విజయవంతమవడానికి కావలసిన సహకారం కార్మికులనుంచి లభించడం లేదు.

## 50. ఈ పరిణామాలకు పూర్వరంగం

పైన వర్ణించిన పరిస్థితి మనదేశంలో అకస్మాత్తుగా ఏర్పడ్డది కాదు. పరివర్తన చెందుతూన్న అనేక పరిణామాల ఫలితం అది. వాటన్నిటి అనుభవం కార్మికోద్యమానికుంది. గతరెండు సంవత్సరాలలో వివిధ నాయకత్వాల క్రింద నున్న కార్మికులు అనేక రాజకీయ, ఆర్థిక సమస్యలపై ఒకరితో

ఒకరు చేతులు కలిపారు; ఐక్యతా వాంఛ అంతకంతకు వృద్ధి చెందింది; సమిష్టి కార్యాచరణవల్ల ఒండొరుల అనుమానాలు, భ్రమలు అదివరకు కంటె చాలా తగ్గిపోయాయి. ఈ ఐక్య కార్యాచరణకు అ.భా.ట్రే.యూ. కాంగ్రెస్ చాల తోడ్పడింది. ఒక్కొక్క వృత్తికి సంబంధించిన కార్మికులు వేర్వేరుగా స్వతంత్ర సమాఖ్యలను స్థాపించుకోడం ద్వారా కార్మికుల సంఘటిత శక్తి ఎక్కువ కావడమే కాక, వారిలో ఐక్యతావాంఛ హెచ్చింది. కారణమేమంటే, ఐక్యతవల్ల కొన్ని సౌకర్యాలు లభిస్తాయని వారు ప్రత్యక్షానుభవంవల్ల తెలుసుకున్నారు.

కార్మిక వర్గం ఏ ముఖ్యమైన ఆర్థిక రాజకీయ సమస్యలపై ఐక్యతను ప్రదర్శించిందో చూదాం. ఇదివరకటి పరిస్థితికీ యిప్పటి పరిస్థితికీ గల తేడా తెలుసుకొనేముందు 1945 చివర 1955 మొదట ఉన్న పరిస్థితిని పరిశీలిద్దాం.

1953 లో కార్మిక ప్రజాసామాన్యంమధ్య వృద్ధి చెందిన ఐక్య కార్యాచరణ 1954 లో కూడ కొనసాగింది; అదే ఐక్యతయొక్క ప్రధానరూపంగా ద్యోతకమైంది. ఒకేచోట పనిచేసే కార్మికులు యజమానుల దాడికి వ్యతిరేకంగా కలిసి పోరాడ్డం, తర్వాత మళ్ళా యథాప్రకారంగా ఎవరి సంఘాల్లో వారు వేరుపడిపోవడం కనిపిస్తుంది. అలాంటి ఐక్య పోరాటాల్లో అధికభాగం స్థానిక పోరాటాలు; రాష్ట్ర వ్యాపిత పోరాటాలు గూడ కొద్దిగా ఉన్నాయి.

కాన్పూరు బట్టలమిల్లు యజమానులు 1954 లో రేషన లైజేషన్ అమలుజరపడానికి నిశ్చయించుకొన్నప్పుడు కార్మికు లందరూ దాన్ని ప్రతిఘటించేందుకు ఐక్యకార్యాచరణ కమి టీని ఎన్నుకొన్నారు. దాని పర్యవసాన మేమంటే ఆరు యూనియన్లు (జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌కు అను బంధింపబడిన దానితోసహా) ఒకేయూనియన్‌గా ఏర్పడ్డాయి. (తర్వాత జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ యింకో సం ఘాన్ని స్థాపించింది).

1954 లో ఢిల్లీ ట్రేడ్‌యూనియన్ కౌన్సిల్ స్థాపింప బడింది. అందులో అ.భా.ట్రే.యూ. కాంగ్రెస్, హింద్ మజ్దూర్ సభలకు అనుబంధింపబడ్డ సంఘాలు, స్వతంత్రయూని యన్లు సభ్యత్వం పొందాయి.

1954 లో బ్యాంకు ఉద్యోగుల పోరాటాన్ని జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ తప్ప మిగతా సంస్థలకు చెందిన యూనియన్లన్నీ బలపరచాయి. సెప్టెంబరు 23 న బ్యాంకు ఉద్యోగులు దేశవ్యాపితంగా సమ్మె చేసినప్పుడు దాన్ని అ.భా.ట్రే.యూ. కాంగ్రెస్, హింద్ మజ్దూర్‌సభ, యునై టెడ్ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ బలపరచాయి. ఆతర్వాత ప్రభుత్వం లేబర్ అప్పిలేట్ ట్రిబ్యునల్ తీర్పును మార్చడా నికి నిశ్చయించుకున్నప్పుడు బ్యాంకు ఉద్యోగులంతా 1954 డిసెంబరు 10 నుండి దేశ వ్యాపిత సమ్మె చేయాలని నిశ్చ యించుకోడం, ఆనిర్ణయాన్ని పై మూడు సంస్థలు బలపరచడం అందరికీ తెలిసినవిషయమే.

1954 లో పోస్టు-టెలిగ్రాఫ్ డిపార్టుమెంటుకు చెందిన పనివారు ప్రభుత్వస్కీమును ప్రాతిపదికగా తీసుకొని, నేషనల్ ఫెడరేషన్ ఆఫ్ పోస్టల్ అండ్ టెలిగ్రాఫ్ ఎంప్లాయిూస్ యూనియన్ అనే పేరుతో పనివారందరినీ ఐక్యపరిచే సంస్థనొక దాన్ని స్థాపించుకున్నారు. దాని నాయకత్వంలో వివిధ దృక్పథాల వారికి స్థానం ఉండేటట్టు ఏకగ్రీవ ఎన్నికజరిగింది.

మరోవైపున జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు 1954 లో ఐక్యతను విచ్ఛిన్నంచేసే విధానమవలంబించింది. హింద్ మజ్దూర్ సభకు చెందిన యూనియన్లను కబళించడానికి అది ప్రయత్నించింది. తత్ఫలితంగా జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్‌కూ, హింద్‌మజ్దూర్ సభ యూనియన్లకు మధ్య ఘర్షణ లేర్పడ్డాయి. అ. భా. రైల్వేమెన్స్ ఫెడరేషన్ జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌కు చెందిన రైల్వే కార్మిక సంస్థలో లీనమైపోయి, నేషనల్ ఫెడరేషన్ ఆఫ్ ఇండియన్ రైల్వేమెన్ అనే పేరుతో ఒక కొత్త సంస్థ నెలకొల్పబడిన తర్వాత, జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ నాయకులు కొత్తగా యేర్పడ్డ ఆసంస్థనుంచి హింద్‌మజ్దూర్ సభకు చెందిన వారిని, స్వతంత్రులను తొలగించడం ప్రారంభించారు. రైల్వేబోర్డుతో సంప్రతింపులు జరపడానికి వెళ్ళేటప్పుడు హింద్‌మజ్దూర్ సభవారిని, స్వతంత్రుల్ని బహిష్కరించసాగారు. ట్రిబ్యునల్స్ ముందు విచారణకు రావలసిన సమస్యలలో తమ కిష్టంలేని వాటని జారవిడవడం ప్రారంభించారు. ఇందువల్ల సంఘర్షణ లేర్పడ్డాయి. పశ్చిమ రైల్వే

లోని హింద్‌మజ్దూర్ సభనాయకులు బయటికి వచ్చేసి, శ్రీమతి మణిబెన్ కారా నాయకత్వాన పాత సంఘాన్నే తిరిగి స్థాపించుకున్నారు. 1955 ఫిబ్రవరిలో జాతీయ ట్రేడ్ యూని యన్ కాంగ్రెస్‌కు చెందిన శ్రీవాసవదాకు, హింద్‌మజ్దూర్ సభ తదితరులు బలపరిచే శ్రీ గురుస్వామికి మధ్య బహిరంగ వాగ్వాదం జరిగింది. దాని ఫలితంగా దేశంలో రెండు నేషనల్ ఫెడరేషన్లు ఏర్పడ్డాయి. తర్వాత అఖిల భారత రైల్వేమెన్స్ ఫెడరేషన్ పునరుద్ధరింపబడింది. ఇప్పుడు మళ్ళీ ఉభయపక్షాలను ఐక్యపరిచేందుకు ప్రయత్నాలు జరుగుతున్నాయి.

1951 నుంచీ హింద్‌మజ్దూర్ సభ జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసుతో చేతులు కలిపేవిధాన మవలంబిస్తూండటంవల్ల అది క్రమేణా బలహీనపడింది. ప్రజా సోషలిస్టు పార్టీలోని ముఖ్యనాయకులు 1953 లో ట్రేడ్ యూనియన్ రంగాన్ని విడిచిపెట్టారు. 1954 జూన్‌లో జరిగిన ప్రజా సోషలిస్టుపార్టీ మహాసభలో కార్మికరంగానికి ప్రాధాన్యమివ్వడమెంతో అవసరమని చాలమంది నొక్కిచెప్పారు. మొత్తంమీద 1954 లో హింద్ మజ్దూర్ సభ సంఘటితంగా పనిచేయలేదని చెప్పాలి. దాని నాయకులు అ. భా. ట్రే. యూ. కాంగ్రెస్‌తో ఐక్యత సాధించడమంటేను, ట్రేడ్ యూనియన్ ఐక్యతకై కృషిచేయడమంటేను వ్యతిరేకతనే ప్రకటిస్తూ వచ్చారు.

అ. భా. ట్రే. యూ. కాంగ్రెస్ మాత్రం ట్రేడ్‌యూనియన్ ఐక్యతకై పనిచేస్తూనే వచ్చింది. సంఘటితులు

కాని కార్మికుల్ని సంఘటిత పరచడానికి పూనుకొంది. కార్మికులంతా ఎవరికి నచ్చిన యూనియన్‌లో వారు చేరడం అవసరమనీ, తప్పకుండా మాత్రం చేరాలనీ హెచ్చరిస్తూ వచ్చింది. 1954 మే నెలలో మన మహాసభ ట్రేడ్ యూనియన్ ఐక్యతకు పిలుపు నిచ్చింది. 1954 నవంబరులో జనరల్ కౌన్సిలు సమావేశమైనప్పుడు దాన్ని పటిష్ఠమొనర్చుతూ ఒక తీర్మానం చేసింది.

ఈదశలో వివిధ వృత్తులకుచెందిన కార్మికులు వేర్వేరు సమాఖ్యలను నిర్మించుకొనే కృషి కొనసాగుతూనే వచ్చింది. ఉదాహరణకు 1955 ప్రారంభంలో జాతీయ మోటార్‌ట్రాన్స్ పోర్టు కార్మికుల సమాఖ్య (ప్రభుత్వరంగం) స్థాపింపబడింది. ఈ సంవత్సరం ప్రభుత్వ రంగంలోను, ప్రైవేట్ రంగంలోను పనిచేసే మోటార్‌ట్రాన్స్‌పోర్టు కార్మికులు ఒకే సమాఖ్యలో ఐక్యమయారు.

ఈవిధంగా, మొత్తంమీద 1954లోను 1955 ప్రారంభంలోను కార్యరంగంలో ఐక్యత, ఐక్య కమిటీల స్థాపన తదితర రూపాల్లో ట్రేడ్ యూనియన్ ఐక్యత వ్యక్తమైందని చెప్పవచ్చు. అట్టి ఐక్య కార్యాచరణ, తాత్కాలిక ఐక్య కమిటీలు క్రింది స్థాయిలో మాత్రమే సాధ్యమయాయి.

ఐక్యతకై అ.భా.ట్రే.యూ. కాంగ్రెస్ చేసిన విజ్ఞప్తికి జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ గాని, హింద్ మజ్దూర్ సభ గాని సమాధాన మీయలేదు.

ఆనాటి పరిస్థితుల్లో ట్రేడ్ యూనియన్ ఐక్యత ఊహా జగత్తుకు సంబంధించిన సమస్యగా కాక వాస్తవ విషయంగా పరివర్తన చెందుతుందని ఎవరూ ఊహించి యుండరు; అంత ప్రాధాన్యంగల పరిణామాలు జరుగుతాయని కలలో కూడా ఎవరూ అనుకొనియుండరు. ఒక నూతన వెల్లువ ఎవరూ అనుకోనంత పెద్ద యెత్తున పెల్లుబికింది. దానికి కారణాలు కొన్ని ముఖ్యమైన రాజకీయ ఆర్థిక సమస్యలు.

## 51. 1955 లో నూతన వెల్లువ, ట్రేడ్ యూనియన్ ఐక్యత

రాజకీయ సమస్యలు:

(1) గోవా స్వాతంత్ర్య పోరాటం: 1955 జూన్‌లో గోవా స్వాతంత్ర్య పోరాటం జరిగింది. అన్ని రాజకీయాభిప్రాయాలు గల వారితో ఏర్పడ్డ గోవా విమోచన సంఘం యీ పోరాటాన్ని నడిపింది.

ఈ ఉద్యమంలో కార్మికవర్గ ఐక్యత, ఐక్య కార్యాచరణ అద్వితీయంగా అభివృద్ధి చెందాయి. అ.భా.ట్రే.యూ. కాంగ్రెస్, హింద్ మజ్దూర్ సభ, యునైటెడ్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్, వాటి అనుబంధ సంస్థలు సంయుక్తంగా కదిలి బొంబాయి, కలకత్తా, మద్రాసు వంటి నగరాల్లో సర్వవ్యాపిత సమ్మెలు నడిపాయి.

ఇది రాజకీయ సమస్య అనే సాకుతో జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ నాయకత్వం సమ్మెలలో పాల్గొనలేదు; పైగా వాటెని బహిరంగంగా ఖండించింది.

గోవా విముక్తికై సత్యాగ్రహం చేయాలనే పిలుపును మొట్టమొదట అందుకున్నది బొంబాయి కార్మికులు. వారు మిల్లు కార్మికుల గోవా విమోచన సంఘం అనే పేరుతో ఒక సంస్థను స్థాపించారు. అందులో అ.భా.ట్రే.యూ. కాంగ్రెస్, హింద్ మజ్దూర్ సభ ప్రతినిధులు సభ్యులుగా చేరారు. అ.భా. ట్రే.యూ. కాంగ్రెస్, హింద్ మజ్దూర్ సభ, యునైటెడ్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ రాష్ట్ర శాఖలు, బొంబాయి బ్యాంక్ ఎంప్లాయీస్ ఎసోసియేషన్ సంయుక్తంగా జూలై 1 వ తేదీని కార్మిక ప్రతినిధుల సమావేశాన్నొకదానిని ఏర్పాటు చేశాయి. ఆ సమావేశం ఆగస్టు 12 వ తేదీని బొంబాయిలో సర్వవ్యాపిత సమ్మె జరపడానికి నిశ్చయించుకొంది. ఈ సంయుక్త విజ్ఞప్తిని 4,00,000 మంది కార్మికులు శిరసావహించారు. సమ్మెను విచ్ఛిన్నం చేయడానికి జాతీయ ట్రేడ్ యూనియన్ నాయకులు, కాంగ్రెస్ నాయకులు ఎన్ని ప్రయత్నాలు చేసినప్పటికీ ప్రయోజనం లేకపోయింది.

ఆగస్టు 15 వ తేదీని పోర్చుగీసు హంతకులు శాంతి యుతంగా సత్యాగ్రహం చేస్తున్నవారిపై అమానుషంగా తుపాకులు కాల్చి చంపినవార్త విని బొంబాయి కార్మికులు మళ్లీ సర్వవ్యాపితసమ్మె చేశారు ఆగస్టు 12న తేదీ సమ్మెలో

పాల్గొనని బ్యాంకుపనివారు, షాప్ ఎంప్లాయీస్ 16 వ తేదీ సమ్మెలో పాల్గొన్నారు.

కలకత్తాలో కూడ అ. భా. ట్రే. యూ. కాంగ్రెస్, హింద్ మజ్దూర్ సభ, యునైటెడ్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్, అనేక స్వతంత్ర కార్మిక సంస్థలు, ఎన్నో సమన్వయ కమిటీలు కలిసి చేసిన విజ్ఞప్తి ననుసరించి ఆగస్టు 17వ తేదీని కార్మికులు బ్రహ్మాండమైన సమ్మె చేశారు. ఆనాటి ప్రదర్శనలు 1946 జూలై 29 తేదీని జరిపిన ఐక్య కార్మిక ప్రదర్శనలను జ్ఞప్తికి తెచ్చాయి.

గోవా విముక్తి సమస్య కార్మికవర్గాన్ని దేశవ్యాపిత పోరాటంలో పాల్గొనేటట్లు చేసింది. భారతదేశంలో వలస విధాన అవశేషాలను నిర్మూలించేందుకు జరిగిన యీ పోరాటం కార్మికవర్గ ఐక్యతకు ప్రత్యక్షసహాయం చేసింది.

(2) రాష్ట్రాల పునర్విభజన సమస్య: 1955 అక్టోబరులో రాష్ట్రాల పునర్విభజన సంఘం చేసిన సూచనలు ప్రకటింపబడ్డాయి. బొంబాయితో సహా మహారాష్ట్ర ప్రాంతమంతటినీ ఒకే రాష్ట్రంగా చేయాలన్న న్యాయమైన కోర్కె నిరాకరింపబడ్డందువల్ల మహారాష్ట్ర ప్రజల్లో విపరీతమైన ఆగ్రహం కలిగింది. మొదటి దశలో కాంగ్రెస్‌తో సహా అన్ని రాజకీయ పార్టీలు తమ వ్యతిరేకతను బహిరంగ వేదికల నుంచి వ్యక్తం చేశాయి. కాని కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ ఆదేశాన్ని పురస్కరించుకొని కాంగ్రెస్ వైదొలగవలసి వచ్చింది.

ట్రేడ్ యూనియన్ రంగంలో సంయుక్త మహారాష్ట్ర ఉద్యమం అ. భా. ట్రే. యూ. కాంగ్రెస్‌ను, హింద్ మజ్దూర్ సభను, యునై టెడ్ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్‌ను, స్వతంత్ర కార్మిక సంఘాలను ఒకే వేదికమీదికి తెచ్చింది. నవంబరు 5 వ తేదీని జరిపిన 'బొంబాయి కార్మికుల ఐక్య మహారాష్ట్ర కాన్ఫరెన్సు' కు 5000 మంది ప్రతినిధులు హాజరయారు. వారు అ. భా. ట్రే. యూ. కాంగ్రెస్, హింద్ మజ్దూర్ సభ, యునైటెడ్ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్, స్వతంత్ర కార్మిక సమాఖ్యలకు చెందిన 90 యూనియన్లకు ప్రతినిధులు. దానికి శ్రీ ఎస్. ఎం. జోషి (హింద్ మజ్దూర్ సభ) అధ్యక్షత వహించారు. శ్రీ. ఎస్. ఏ. డాంగే (అ. భా. ట్రే. యూ. కాం.) ప్రారంభోత్సవం జరిపారు. ఆ సమావేశం నవంబరు 18 వ తేదీని — అంటే రాష్ట్రాల పునర్విభజన సంఘంయొక్క సూచనలు చర్చకువచ్చే తేదీని — బొంబాయి శాసనసభ ముందు నిరసన ప్రదర్శనలు జరపాలని తీర్మానించింది.

తదనుగుణ్యంగా నవంబరు 18 న 5000 మంది కార్మికులు అసెంబ్లీ భవనం వద్ద ప్రదర్శనలు జరపగా పోలీసులు లాఠీఛార్జి చేశారు. ఈ చర్యపట్ల తీవ్రఅసమ్మతిని ప్రకటిస్తూ 21 వ తేదీని బొంబాయి కార్మికులు బ్రహ్మాండమైన సమ్మె చేశారు. బట్టలమిల్లు కార్మికుల నాయకత్వం క్రింద జరిగిన ఊరేగింపుపై పోలీసులు తుపాకులు కాల్చగా 12 గురు మరణించారు; 300 మంది గాయపడ్డారు. ఈ వార్త నలుదిశలకు

దావానలంలా వ్యాపించింది. మహారాష్ట్ర ప్రాంతంలోని అన్ని పట్టణాల్లోను, నగరాల్లోను ఊరేగింపులు, సమ్మెలు జరిగాయి.

1956 జనవరిలో ప్రభుత్వం ఈ ఉద్యమంయొక్క ప్రధాన నాయకుల్ని అరెస్టుచేసింది. దానితో ప్రజాఉద్యమ వెల్లువ కట్టలు తెగి ప్రవహించింది. కార్మికులు మధ్యతరగతి ప్రజలతో కలిసి ఐక్యకార్యాచరణకు పూనుకున్నారు; రాజకీయసమ్మెలు జరిపారు. వేలాది ప్రజలు జైళ్లకు వెళ్లారు. తుపాకి కాల్పులలో 105 గురు మరణించారు. ఈ పోరాటంయొక్క ప్రధాన లక్షణం అతివాదపక్షాలన్నీ ఏకోన్ముఖవడం. ట్రేడ్‌యూనియన్ రంగంలో మూడు సమాఖ్యలకు చెందిన యూనియన్లు కలిసి పోరాటంలో పాల్గొన్నాయి. రాజకీయ సమ్మె, సత్యాగ్రహం, ప్రధానపోరాట రూపాలయ్యాయి.

రాష్ట్రశాసనసభకు జరిగిన సాధారణ ఎన్నికల్లో ఈ ఐక్యత మరింత పటిష్ఠమయింది.

ఇటీవల నిరుద్యోగానికి వ్యతిరేకంగాను, మిల్లులమూసివేతకు వ్యతిరేకంగాను జరిగిన ఆందోళనలో అ. భా. ట్రే. యూ. కాంగ్రెస్, హింద్‌మజ్దూర్ సభ, యునైటెడ్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌కు చెందిన యూనియన్లు సమిష్టిచర్చల అనంతరం కలిసి కార్యరంగంలో ప్రవేశించాయి.

(3) బెంగాలు – బీహార్ విలీనం: బెంగాల్ – బీహార్ రాష్ట్రాలను విలీనం చేయాలన్న నిర్ణయం తీవ్రమైన అసంతృ

ప్తికి కారణమైంది. ఈ నిర్ణయానికి వ్యతిరేకంగా ప్రతిపక్ష పార్టీలన్నీ - ముఖ్యంగా కమ్యూనిస్టుపార్టీ, ప్రజాసోషలిస్టు పార్టీ, ఫార్వర్డ్‌బ్లాక్ మొదలైనవి - ఒక ఐక్య ఉద్యమాన్ని ప్రారంభించాయి. అ. భా. ట్రే. యూ. కాంగ్రెస్, హింద్ మజ్దూర్ సభ, యునైటెడ్ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్‌కు చెందిన యూనియన్లను యీఉద్యమం చాలదగ్గరకు తెచ్చింది. జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌కు అనుబంధింపబడిన కొన్ని యూనియన్లు కూడ యిందులో పాల్గొన్నాయి. 1956 జనవరి 25 వ తేదీన సర్వవ్యాపితసమ్మె జరపాలన్న నిర్ణయం బెంగాల్ రాష్ట్రమంతటా అమలు జరపబడింది. జూట్ కార్మికులలో అధికసంఖ్యాకులు బెంగాలీలు కారు; పైగా కాంగ్రెస్ పలుకుబడి క్రింద వారున్నారు. అయినప్పటికీ వారు సమ్మెలో పాల్గొన్నారు.

## 52. కార్మికుల జీవితవిధానం విూద ప్రభావం కలిగించిన ఆర్థిక సమస్యలు

ఈ రాజకీయ సమస్యలపై నేగాక, కార్మికుల్ని వేధించే అనేక ఆర్థిక సమస్యలపైకూడా విభిన్న సమాఖ్యలకు చెందిన ట్రేడ్ యూనియన్లు ఐక్యతను ప్రదర్శించాయి. రేషనలైజేషను. రిట్రెంచిమెంటు, జీతాల పెంపుదల, బోనసు మొదలైన సమస్యలపై కార్మికవర్గం 1954 లో కన్న 1955 - 57 మధ్య ఎక్కువ సమ్మెలు జరిపింది. ఈ పోరాటాల్లో అ. భా. ట్రే. యూ. కాంగ్రెస్, హిందమజ్దూర్ సభ, జాతీయ ట్రేడ్

యూనియన్ కాంగ్రెస్‌కు చెందిన యూనియన్లు, అనేక స్వతంత్ర సంఘాలు కలిసి పాల్గొనడం ప్రత్యేకలక్షణం. అనేక సందర్భాలలో జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసుకు చెందిన యూనియన్లు, కార్యకర్తలు ఐక్యపోరాటాల్లో పాల్గొన్నారు.

ఈ పోరాటాలు అందరినీ ఒకచోటికి తీసుకురావడంలో —ముఖ్యంగా అ. భా. ట్రే. యూ. కాంగ్రెస్‌నూ మధ్య తరగతి ప్రజలనూ ఐక్యపరచడంలో — ముఖ్య పాత్ర వహించాయి.

## 53. స్వతంత్ర కార్మిక సమాఖ్యలు

మన దేశంలో స్వతంత్ర కార్మికసమాఖ్యలు అభివృద్ధి చెందటం కొత్తవిషయంకాదు. ట్రేడ్ యూనియన్ ఉద్యమంలో చీలిక లేర్పడకముందు కూడా స్వతంత్ర కార్మిక సమాఖ్య లుండేవి. కాని ఆరోజుల్లో అవి వేర్వేరు వృత్తుల మధ్య ఐనైక్యతకు చిహ్నంగా ఉండేవి. 1953 తర్వాత ఒక్కొక్క వృత్తిలో పనిచేసే కార్మికులు తమలోతాము ఐక్యతను సాధించుకోడానికి సమాఖ్యలను ఏర్పరచుకోటం కనిపిస్తుంది. వాటి అధీన సంఘాలు ఏ కేంద్ర సంస్థకు అనుబంధింపబడినప్పటికీ పట్టింపు ఉండేదికాదు.

ఈ రోజున రక్షణశాఖ, బ్యాంకులు, పోస్టు-టెలిగ్రాఫ్ శాఖ, ప్రభుత్వ సర్వీసు, సిమెంటు, మోటారు ట్రాన్స్‌పోర్టు,

రేవులు, రైల్వేలు, ఇన్స్యూరెన్సు, పెట్రోలు పరిశ్రమలకు వర్కింగ్ జర్నలిస్టులకు ప్రత్యేకంగా దేశవ్యాపిత సమాఖ్యలున్నాయి. సెంట్రల్ గవర్నమెంటు ఎంప్లాయీస్ కాన్ఫెడరేషన్‌లో అనేక ఎసోసియేషన్లు ఉన్నాయి. అవి ఏ ట్రేడ్ యూనియన్ సమాఖ్యకూ అనుబంధింపబడలేదు.

ఈ స్వతంత్ర సమాఖ్యలు కార్మికులహక్కుల కోసం తీవ్రంగా పోరాడుతున్నాయి. దేశవ్యాపిత పోరాటాలకు కూడ పిలుపు యివ్వగల శక్తిని అవి సంపాదించాయి; కొన్ని కోర్కెలను కూడా అవి పొందాయి. ఉదాహరణకు బ్యాంకు ఉద్యోగుల సంఘం, పోస్టు – టెలిగ్రాఫ్ పనివారల సంఘం, రక్షణ శాఖోద్యోగుల సంఘం, రేవు కార్మికుల సంఘం, ఇన్స్యూరెన్సు ఉద్యోగుల సంఘం సంపాదించిన కోర్కెలు యిట్టివే.

ఈ సమాఖ్యలు కేవలం వృత్తుల ప్రాతిపదికపైనే పోరాడుతున్నప్పటికీ, మొత్తం కార్మికవర్గంయొక్క సహకారాన్ని అవి తీసుకోవలసివస్తోంది. అందరి సహాయం వాటికి అవసరమవుతోంది. ఇటీవలి కాలంలో యీ సమాఖ్యలు తమ పోరాటాల ద్వారా అ. భా ట్రే. యూ. కాంగ్రెస్, హింద్‌మజ్దూర్ సభ, యునైటెడ్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ నాయకుల్ని ఒకే వేదిక మీదికి తెచ్చి, తమ కోర్కెలకోసం కలిసిపోరాడేటట్లు చేశాయి. (ఉదా: బ్యాంకు ఉద్యోగుల, పోస్టు-టెలిగ్రాఫ్ పనివారల, ఇన్స్యూరెన్సు పని

వారల పోరాటాలు). ఈ విధంగా పై సమాఖ్యలు ట్రేడ్ యూనియన్ ఐక్యతను తీసుకురావడానికి చాల ముఖ్యమైన పాత్ర నిర్వహించాయి.

జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ యీ సమాఖ్యలను విచ్ఛిన్నం చేయడానికి యిటీవల కొన్ని ప్రయత్నాలు చేసింది. కొన్ని వృత్తులలో అది కొత్త సమాఖ్యల్ని స్థాపించి వాటిని తన అధీన సంఘాలుగా చేసుకొంది. ఇంతవరకు ఏ యే వృత్తులలో ఐక్య సమాఖ్యలు ఏర్పడలేదో అక్కడల్లా జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ సొంత సమాఖ్యలను స్థాపించింది. ఉదా: బట్టల పరిశ్రమ, బొగ్గు పరిశ్రమ, ప్లాంటేషన్లు, సిమెంటు. ఈ పరిశ్రమలలో జాతీయ ట్రేడ్ యూనియన్ నాయకుల కార్యకలాపాలు చాల హాని కలుగజేశాయి. మొదట వారు ఐక్య సమాఖ్యలో చేరారు; కాని మెజారిటీ యూనియన్లు తమతో కలిసిరారని తెలుసుకొని వైదొలగారు. బ్యాంక్ ఉద్యోగుల సంఘాన్ని, రక్షణ శాఖోద్యోగుల సంస్థను, పోస్టు — టెలిగ్రాఫ్ పనివారల సమాఖ్యను విచ్ఛిన్నం చేయడానికి వారు శాయశక్తులా ప్రయత్నిస్తున్నారు. కాని పనివారిలో ఐక్యతావాంఛ గాఢంగా ఉండడంవల్ల, సంయుక్త కార్యాచరణ ద్వారాను అపారమైన త్యాగాల ద్వారాను ఆ ఐక్యత మరింత దృఢపడ్డందువల్ల జాతీయ ట్రేడ్ యూనియన్ నాయకులు వారిని పెడమార్గాలలో పెట్టలేకపోయారు; వారి సంస్థలను విచ్ఛిన్నం చేయలేకపోయారు. అయితే, రైల్వేలో వారి కార్యకలాపాలు చాలవరకు జయప్రదమయాయి.

ఐతే ఈ స్వతంత్ర సమాఖ్యలు ఐక్య సంస్థలుగా రూపొందినంత మాత్రాన సరిపోదు. కేంద్ర ట్రేడ్ యూనియన్ సంస్థల మధ్య ఐక్యతను సాధించడం ప్రధాన విషయం. స్వతంత్ర కార్మికసమాఖ్యలీ రోజున చాల ప్రముఖమైనపాత్ర వహిస్తూన్నమాట నిజమే. అయితే వాటికి కొన్ని పరిమితు లున్నాయి. అవి ప్రధానంగా వృత్తులకు సంబంధించిన సమాఖ్యలు. కార్మిక వర్గం, ట్రేడ్ యూనియన్ ఉద్యమం కేవలం కొన్ని వృత్తుల సంచయమే కాదు. అది అంతకంటె ఉచ్ఛ స్థాయికి చెందినది. అది ఒక వర్గం. పై స్వతంత్ర సమాఖ్య లన్నీ కలిసి సమావేశమైనా కేంద్ర ట్రేడ్ యూనియన్ సంస్థ రూపొందదు. కేంద్ర ట్రేడ్ యూనియన్ సంస్థ మొత్తం వర్గా నిక ప్రాతినిధ్యం వహిస్తుంది. కొన్ని వృత్తుల సంకుచిత అవసరా లకు, కోరికలకు, ఆశయాలకు అది అతీతం. కేంద్ర ట్రేడ్ యూనియన్ సంస్థ ఒక్కొక్క వృత్తిలో ఉన్న కార్మికుల ప్రయోజనాలనే కాక, కార్మికులందరి ప్రయోజనాలను రక్షి స్తుంది. దాన్ని కార్మిక సమాఖ్యలన్నీ స్థూలంగా అంగీక రిస్తాయి. కనుకనే రక్షణశాఖోద్యోగుల సంఘం కేంద్రట్రేడ్ యూనియన్ సంస్థల్ని పే కమిషన్‌ముందు అందరికీ ఆమోద యోగ్యమైన కోర్కెలను బలపరచవలసిందిగా అభ్యర్థించింది.

కార్మిక సమాఖ్యలు స్వతంత్ర సంస్థలుగా అభివృద్ధి చెందవలసిందే కాని అదే సమయంలో ప్రధాన సమస్య లన్నిటిపైన కేంద్ర ట్రేడ్ యూనియన్ సంస్థలతో సంప్రతింపులు జరుపుతూ ఉండాలి.

వాటిని కేంద్ర ట్రేడ్ యూనియన్ సంస్థలతో పోటీచేసే సంస్థలుగా అభివృద్ధిచేయడానికి కొందరు ప్రయత్నిస్తున్నారు. సమిష్టి కార్యాచరణ అవసరమైనప్పుడు కూడ "స్వతంత్ర హోదా"ను గురించి వారు ఎంత అట్టహాసం చేస్తారంటే, తమకు సహాయం చేయమని అడక్కముందే, వివిధ కేంద్ర సంస్థల్ని సంప్రతించకముందే కార్మికులందరూ తమకు చేయూత నివ్వవలసిందని అడుగుతారు. కేంద్ర సంస్థలన్నీ సంయుక్త సమావేశం జరుపుకోలేకపోతే తామిక మిన్నకుండవలసిందేనా అని వారు సాకు చూపుతారు. దానికి జవాబు ఏమంటే: మొదటి విషయం కేంద్రసంస్థలను వారు వేరుగాగాని కలిసి గాని సహాయం చేయమని అడగాలి. అందుకు అవినిరాకరిస్తే వాటికి అనుబంధింపబడిన యూనియన్లను అడగాలి. ఎవరు కార్యరంగంలోకి వచ్చి సహాయం చేయడానికి సిద్ధంగా ఉంటారో వారందరి సహాయం తీసుకోవాలి.

## 54. ప్రస్తుత పరిస్థితి, కర్తవ్యాలు

ఐక్యత విషయంలో ప్రస్తుత పరిస్థితి ఏమిటి? నోట్ల ముమ్మరం, ధరల పెరుగుదల, రేషనలైజేషన్, మిల్లుల మూసి వేత, నిరుద్యోగం మొదలైన విధానాలను అమలు జరపడం ద్వారా ప్రభుత్వం, యజమానులు కార్మికుల వేతనాలమీద, జీవన ప్రమాణాల మీద దాడి చేస్తున్నారు. ఆ దాడిని ఎదు ర్కోడానికే కార్మికులు ఐక్యపోరాటాలు జరుపుతున్నారు. ఇటీవలికాలంలో అవి మరింతగా వ్యాప్తి చెందాయి. తత్ఫలి

తంగా వివిధ కేంద్ర కార్మికసంస్థలు, వాటినాయకులు ఐక్య కార్యాచరణకు పూనుకున్నారు. (ఉదా: పోస్టు - టెలిగ్రాఫ్ పనివారల, బ్యాంకు ఉద్యోగుల, గనికార్మికుల పోరాటాలు).

అనేక రాజకీయసమస్యలమీాద, ట్రేడ్ యూనియన్ సమస్యల మీాద అ. భా. ట్రే. యూ. కాంగ్రెస్, హింద్ మజ్దూర్ సభ (కొన్ని సందర్భాలలో యునైటెడ్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్) ల మధ్య పరస్పర సంప్రతింపులు, ఐక్య ప్రదర్శనలు జరిగాయి. వాటివల్ల ఐక్యతా ధోరణి మరింత బలపడింది.

ఏ ప్రాంతాల్లో ఐక్యకార్యాచరణ బలంగా ఉందో అక్కడ ఐక్యతను విచ్ఛిన్నం చేసేందుకు జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌లోని కొందరు ఎన్ని ప్రయత్నాలుచేసినా ప్రయోజనం ఉండటంలేదు.

ఇండియన్ లేబర్ కాన్ఫరెన్సులోను, స్టాండింగ్ లేబర్ కమిటీ కార్యకలాపాల్లోను యీా ఐక్యత - కేంద్ర ట్రేడ్ యూనియన్ సమాఖ్యల మధ్య ఐక్యత - స్పష్టంగా కనిపిస్తుంది.

పార్లమెంటులోను, రాష్ట్రశాసనసభల్లోను (కేరళలో తప్ప) అ. భా. ట్రే. యూ. కాంగ్రెస్, హింద్ మజ్దూర్ సభ, యునైటెడ్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ ప్రతినిధులు ప్రతిపక్ష స్థానాల్లో కలిసి కూర్చుంటున్నారు; ట్రేడ్ యూనియన్

సమస్యలమీద వారు స్థూలంగా ఏకాభిప్రాయం ప్రకటిస్తూ ఉంటారు. ఇది ఐక్యతను నిర్మించడానికి సహాయకారిగా ఉంది.

కాని జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ ప్రతిని ధులు అలాకాదు. పార్లమెంటులోను, శాసనసభల్లోను వారు ప్రభుత్వపక్షంతో కలిసి కూర్చుంటారు. సాధారణంగా ఇతర ట్రేడ్‌యూనియన్ సమాఖ్యల దృక్పథానికి భిన్నమైనదానిని వ్యక్తంచేస్తూ ఉంటారు. ప్రభుత్వం అనుమతించినప్పుడు మాత్రమే వారు ప్రభుత్వవిధానాల్ని గాని యజమానుల విధానాల్ని గాని విమర్శిస్తారు. ఐతే అట్టి సందర్భాల్లో మనతో కలవకుండా జాగ్రత్తవహిస్తారు.

ఈ విధంగా శాసనసభలు కూడ ఐక్యతా సాధనకు తోడ్పడుతున్నాయి.

గత రెండుసంవత్సరాల్లో ఐక్యతకు గల అవకాశాలు హెచ్చాయి. ఐక్యత పురోగమించిందేగాని, తిరోగమించ లేదు.

అంతర్జాతీయంగా కూడ ఐక్యతాశక్తులు అభివృద్ధి చెందాయి. ఉమ్మడి సమస్యలపై ఐక్యకార్యాచరణకు కలిసి రావలసిందని ప్రపంచ ట్రేడ్‌యూనియన్ సమాఖ్య ఐ. సి. ఎఫ్. టి. యు. కి (ఇంటర్నేషనల్ కాన్ఫెడరేషన్ ఆఫ్ ఫ్రీ ట్రేడ్‌యూనియన్స్) చేసిన విజ్ఞప్తి నాయకత్వ స్థాయిలో

కాక క్రింది స్థాయిలో ఫలించింది. క్రింది స్థాయిలో ఐక్య కార్యాచరణ అభివృద్ధిచెందింది.

ప్రపంచ ట్రేడ్ యూనియన్ సమాఖ్య మధ్య ప్రాచ్య దేశాల్నీ, ఆఫ్రికా దేశాల్నీ బలపరుస్తూ తీసుకున్న వైఖరి కార్మిక ప్రజల్ని ఎంతగా ఉత్తేజపరచిందంటే, యీ సమస్యపై ఐ. సి. యఫ్. టి. యు. తన వైఖరిని పూర్తిగా మార్చుకోవలసి వచ్చింది. ఆ సంస్థ ఆగ్నేయాసియా సైనిక కూటమిని, బాగ్దాద్ ఒడంబడికను సమర్థించినందుకు దాని అధీన సంస్థలైన జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్, హింద్ మజ్దూర్ సభ తీవ్రంగా విమర్శించాయి. నిజానికదొక తమాషాపరిస్థితి. ఒకవైపు కాంగ్రెస్, ప్రభుత్వం, నెహ్రూ యుద్ధకూటములను ఖండిస్తున్నారు; ఆఫ్రికా, మధ్య ప్రాచ్య దేశాల స్వాతంత్ర్యాన్ని బలపరుస్తున్నారు. మరోవైపు వారి వలస వ్యతిరేక విధానాలకు విరుద్ధంగా నడిచే సంస్థలో జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ అనుబంధ సంస్థగా ఉంది! ఇటీవలి కాలంలో హింద్ మజ్దూర్ సభ, జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ ఒకేఒక సమస్యపై ఐ.సి.యఫ్.టి.యు..తో ఏకీభవించాయి. అది హంగరీ సమస్య. ఆసియా – ఆఫ్రికా దేశాల స్వాతంత్ర్యం విషయంలో ఆ సంస్థలు తమలో తమకుగల వైరుధ్యాలను కప్పిపెట్టుకోలేక పోతున్నాయి. ఫలితమేమంటే, ఈ యేడు ఐ.సి. ఎఫ్. టి. యు. ట్యూనిస్‌లో సమావేశమైనప్పుడు వలస విధానానికి వ్యతిరేకమైన అభిప్రాయాలను అది వ్యక్తంచేసింది. ఇది అంతర్జాతీయంగా ఐక్యతను సాధించడానికి చాల తోడ్పడుతుంది.

# 55. సమిష్టి కార్యాచరణ: పోటీ సంఘాల విలీనం

ఐక్యత అనేది ఒక సిద్ధాంతమనీ ఏవోకొన్ని యూనియన్లను "స్వాధీనం" చేసుకొనేందుకు ఉపయోగపడే ఎత్తుగడ కాదనీ కార్మికులు భావించేటట్లు మనం వారికి బోధించాలి. నిర్మాణరీత్యా మనం చేసేపని, మన వ్యక్తిగత నడవడిక యీ అభిప్రాయాన్ని బలపరచేటట్లుండాలి; అందుకు అవి దారితీయాలి. దాని అర్థమేమంటే, కార్మికుల్ని నడపడంలో మనం వెనుకాడకుండానే, అన్ని పోరాటాలను నడిపేది మన మొకళ్లమేనని రుజువు చేసేందుకు ఉబలాటపడకూడదు.

ఉమ్మడిపోరాటాలను మనం నడపదలచుకుంటే, అందుకు జాగ్రత్తగా సన్నాహాలు జరపాలి. కేవలం మెజారిటీ ఓటు లభించినంతమాత్రాన సరిపోదు; ఐక్యత సిద్ధించాలంటే అదొక్కటే చాలదు. ఓట్లు తీసుకొనేముందు మనం ఐక్యత సాధించడానికి, ఒప్పందం కుదుర్చుకోడానికి ప్రయత్నించాలి.

త్రైపాక్షిక సమావేశనిర్ణయాలు ట్రేడ్‌యూనియన్ సమాఖ్యలన్నిటి (4) ఆమోదం పొందాయి; జాతీయట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ కూడా వాటికి అంగీకరించింది. అందుచేత త్రైపాక్షిక సమావేశ నిర్ణయాలను ప్రాతిపదికగా చేసుకొని, ఎక్కడైతే అవకాశం ఉంటుందో అక్కడల్లా ఐక్యతను మరింత అభివృద్ధి చేయడానికి ప్రయత్నించాలి.

స్వతంత్ర కార్మిక సమాఖ్యలు మరింత ఐక్యతతో పని చేసేటట్లు సహాయపడాలి. వాటిలో విచ్ఛిన్నకుల్ని వేరుచేయటం చాల సులభం.

అ. భా. ట్రే. యూ. కాంగ్రెస్ లేదా హింద్ మజ్దూర్ సభ లేదా యునైటెడ్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ అధీనంలో ఉన్న సంఘాలు ఎక్కడెక్కడ పోటీసంఘాలుగా పని చేస్తున్నాయో తెలుసుకొనేందుకు అ. భా. ట్రే. యూ. కాంగ్రెస్ నిర్దిష్టమైన పరిశీలనలు జరపాలి. ఒక సంఘంలో మరోసంఘాన్ని సంలీనం చేయడంద్వారా గాని రెండిటిలో ఒక దాన్ని రద్దుచేయడంద్వారా గాని పోటీ లేకుండా చేయవచ్చునేమో చూడాలి. కొన్ని సందర్భాలలో ఏక పక్ష చర్యగా యూనియన్‌ని రద్దుచేయవలసి వస్తుంది. అలాంటప్పుడు రెండవ యూనియన్‌తో ఐక్యకార్యాచరణను గురించి, కార్యకర్తల విభజనను గురించి ముందుగా కొన్ని సంప్రతింపులు జరపాలి. ఐక్యతను సాధించేందుకు ఒక దశలో 'బేరమాడ్డం' మానుకోవలసివస్తుంది. మనం లేదా మన కార్మికులు నష్టపడినట్లు కొంతకాలం కనిపించవచ్చు. కాని మనం అధికారపదవుల్లో లేకపోయినప్పటికీ చురుగ్గా పనిచేస్తే, అలాంటిపరిస్థితి తాత్కాలికంగా మాత్రమే ఉంటుంది. రైల్వేలలో మన అనుభవం దీన్నే తెలియజేస్తుంది.

జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసుకుగాని, హింద్ మజ్దూర్ సభకు గాని, యునైటెడ్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌కుగాని వ్యతిరేకంగా పోటీసంఘాలను నెలకొల్పే ప్రయ

త్వాన్ని మనం శాయశక్తులా నిరోధించాలి. ఐతే జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌కు చెందిన సంఘాలు పనిచేయ కుండా ఉన్నప్పుడు లేదా యజమానుల సంఘాలుగా పని చేస్తున్నప్పుడు మనం పోటీసంఘాలను నెలకొల్పవలసివస్తుంది. ప్రస్తుతం జరుగుతున్న దేమంటే, ఆ యూనియన్లు జాతీయ ట్రేడ్ యూనియన్ నాయకుల్ని అధికారంనుంచి తొలగించి, మనల్ని మార్గంచూపమని అడుగుతున్నాయి. అట్టినిర్ణయాలు యించుమించు ఏకగ్రీవంగా చేయబడినట్లైతే, మనం ఆ బాధ్యత నుంచి తప్పించుకోజాలం. అలాంటప్పుడు జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసే పోటీసంఘాల్ని స్థాపిస్తుంది. అనేక సందర్భాలలో యిలాజరిగింది. హింద్‌మజ్దూర్ సభ విషయంలో మాత్రం యీ ధోరణి తక్కువగా కనిపిస్తుంది.

## 56. మన పరిమితులు

ఒక్కొక్కప్పుడు సంక్షోభం తీవ్రంకావచ్చు; కార్మికులు తమ హక్కులను రక్షించుకోవడానికి ప్రత్యక్షచర్య తీసుకోవాలని డిమాండుచేయవచ్చు. అలాంటి పరిస్థితుల్లో పాతనాయకులస్థానే కొత్తనాయకుల్ని ఎన్నుకోవలసివస్తుంది. ప్రస్తుతం జీతాలు, అధికధరల ఎలవెన్సు మొదలైనసమస్యలపై ప్రత్యక్ష చర్యకు పూనుకోవాలని కార్మికులు ఒత్తిడి చేస్తున్నారు. సరిగ్గాయిలాంటి పరిస్థితుల్లోనే మనం ఐక్యనాయకత్వాన్ని నిర్మించాలి. అప్పుడే పోరాటాలు ఫలిస్తాయి. ముఖ్యంగా ప్రభుత్వరంగానికి చెందిన పరిశ్రమల్లోను, సంస్థల్లోను, సర్వీసులలోను చాల వేగంగా నాయకత్వ మార్పులు

వస్తున్నాయి. ఇతర సమాఖ్యలతో బాటు అ. భా. ట్రే.యూ. కాంగ్రెస్ కూడా నాయకత్వ బాధ్యత తీసుకోడం అవసరమని, అలా తీసుకోవాలనీ కార్మికులు అడుగుతున్నారు. ఇతర సమాఖ్యలవారు నిరాకరించిన సందర్భాలలో కేవలం అ.భా. ట్రే. యూ. కాం. ప్రతినిధుల్నే నాయకులుగా ఎన్నుకొంటు న్నారు. ఇట్టిపరిస్థితికి కారణం అ.భా.ట్రే.యూ. కాంగ్రెస్ పలుకు బడి పెరగడం. ముఖ్యంగా పార్లమెంటులోను, రాష్ట్రశాసన సభల్లోను సభ్యులుగా ఉన్న అ. భా. ట్రే. యూ. కాంగ్రెస్ ప్రతినిధుల్ని కలుసుకోడానికి వచ్చేవారిసంఖ్య చాలహెచ్చుగా ఉంది.

ఈ విషయంలో తప్పక మన బాధ్యతను నిర్వర్తించ వలసిందే. కాని మనకున్న పరిమితుల్ని కూడా దృష్టిలో ఉంచుకోవాలి; కొంత నిగ్రహాన్ని పాటించాలి.

అ. భా. ట్రే. యూ. కాంగ్రెస్ యిదివరకు కంటె యిప్పుడు బలపడ్డం ఐక్యతను నిర్మించడానికీ, పోరాటాల్లో విజయాలు సాధించడానికీ దోహదమిచ్చే మాట నిజమే. కాని అదేసమయంలో మనమొక విషయాన్ని జ్ఞాపక ముంచు కోవాలి. సరిగ్గా దీన్నే ఐక్యతా విచ్ఛిన్నకులు, కార్మిక వర్గ శత్రువులు సాధనంగా వినియోగించుకొని ఐక్యతను చెడగొట్ట డానికి కార్మికుల్ని వక్రమార్గంలో పెట్టడానికి ప్రయత్నిస్తారు. ఐక్యతను సాధించే కర్తవ్యం ఎంత జరూరైనదీ జటిలమైనదీ అంటే, దానిమీద యిదివరకుకంటె ఎక్కువగా యిప్పుడు అ.భా.ట్రే.యూ. కాంగ్రెస్ తన దృష్టిని కేంద్రీకరించాలి.

—.x:—

# 6. కార్మిక తగాదాలు, పోరాటాలు

## 57. అభివృద్ధిచెందుతున్న పోరాటాలు

కార్మిక పోరాటాలు గత మూడు సంవత్సరాల్లో అంత కంతకు అధికంగా అభివృద్ధిచెందుతూ వచ్చాయి. నష్టమైన పనిరోజుల సంఖ్య దృష్ట్యా 1951 – 54 మధ్య కొంతవరకు ప్రశాంత వాతావరణం ఉండేదని చెప్పవచ్చు. కాని, 1955 లో ఆపరిస్థితి పోయింది. 1956 లోను, '57 లోను కూడా పోరాట వెల్లువ ఉచ్ఛస్థాయిలోనే ఉంది. 1954 లో కార్మికులు పోగొట్టుకున్న పని రోజులు సుమారు 30 లక్షలయితే, 1955 లో 55 లక్షలు; 1956 లో 70 లక్షలు; 1957 లో 60 లక్షలు.

రెండవ విషయం: కార్మిక తగాదాల సంఖ్య, సమ్మెల్లో పాల్గొన్న కార్మికుల సంఖ్య కూడా పెరిగింది. ఈ పెరుగుదల 1955 లో మాదిరిగా దీర్ఘ కాలం జరిగిన కొద్దిపాటి సమ్మెల వల్ల రాలేదు.

మూడవ విషయం: 1956, '57 పోరాటాల్లో కనబడే మరో లక్షణ మేమంటే, కార్మిక తగాదాలు అనేక రంగాల్లో ఉత్పన్నమయాయి; వాటి సంఖ్య కూడా హెచ్చు; వాటిలో పాల్గొన్న కార్మికుల సంఖ్య కూడ హెచ్చే. ఐతే ఒక్కొక్క సమ్మె ఎన్నోరోజులు కొనసాగలేదు. రోజు, రెండురోజులు మాత్రమే అవి జరిగాయి. నిరసన సమ్మెల రూపమో అక

స్మాత్తు సమ్మెల రూపమో అవి ధరించాయి. మొత్తం తగా దాల్లో మూడింట రెండు వంతులు 5 రోజులకంటె ఎక్కువగా కొనసాగలేదు. వీటిలో కూడా అధికభాగం "రోజు లేక అంత కన్న తక్కువ" కాలం జరిగినవే. మొత్తం పోరాటాల్లో యిలాంటివాటి సంఖ్య 100 కి 41.8 వరకు ఉంది. దీని అర్థం, కార్మికు లింతకంటె దీర్ఘకాల పోరాటాలు, యింతకంటె తీవ్ర పోరాటాలు జరపలేరనా? లేక యజమానులు వెంటనే దిగి వస్తున్నారనా? రెండూ కావు. దీని అర్థం యిదివరకు కంటె యిప్పుడు ఎక్కువ నిరసన సమ్మెలు జరుగుతున్నాయని మాత్రమే. కార్మికులు అలా నిరసన ప్రకటించిన తర్వాత సంప్రతింపులకొరకు ఫలితాల కొరకు వేచియుండడం సాధారణంగా జరుగుతోంది.

నాల్గవ విషయం: 1956 లో చిన్న ఫ్యాక్టరీలలో పని చేసే కార్మికుల కంటె పెద్ద ఫ్యాక్టరీలలో పనిచేసే కార్మికులు హెచ్చుగా రంగంలోకి వచ్చారు. 1000 కంటె ఎక్కువ మంది పనిచేసే ఫ్యాక్టరీలలో కార్మికులు పోగొట్టుకున్న పని రోజులు 44,04,134.

ఐదవ విషయం: నష్టమైన యీ పనిరోజు లన్నిటికీ కారణం సమ్మెలు కావు. క్రిందటిసంవత్సరం లాకౌట్ల సంఖ్య కూడా పెరిగింది. ఒక్కొక్క లాకౌట్‌వల్ల సగటున 30, 520 పనిరోజులునష్టమయాయి. కాని ఒక్కొక్క సమ్మెవల్ల సగటున 3862 పనిరోజులు మాత్రమే నష్టమయాయి. మొత్తం నష్టమైన పనిరోజుల్లో 100 కి 38.4 కి కారణం లాకౌట్లు.

లాకౌట్లు యజమానుల దాడికి నిదర్శనాలనే మాట నిజమే. అయినా, యజమానుల ముందు కార్మికులు దాసోహం చేయలేదనడానికీ తమ కోర్కెలను వారు వదులుకోలేదనడానికీ కూడ అది తార్కాణం.

ఆరవవిషయం: 1956 లోను '57 లోను సమ్మెలు ఫ్యాక్టరీలస్థాయిలోనే కాక దేశవ్యాపితంగా కూడ జరిగాయి.

ఏడవవిషయం: ఈ సారి ప్రభుత్వ సర్వీసులో ఉన్న వారు, మధ్యతరగతి ఉద్యోగులు దేశవ్యాపిత పోరాటాల్లో పాల్గొన్నారు; ట్రేడ్‌యూనియన్ నిర్మాణంలో వారు అద్భుతమైన అభివృద్ధిని కనపరచారు. తీవ్రమవుతున్న సంక్షోభం తప్పనిసరిగా వారిని కార్యరంగంలోకి తీసుకొస్తుంది.

ఎనిమిదవవిషయం: పారిశ్రామిక కార్మికుల్లోఅందరికన్న ఎక్కువగా పీడింపబడే గని కార్మికులు ఐక్యపోరాటాలు జరిపారు. అనేక త్యాగాలుచేసి గణనీయమైన విజయాలు సంపాదించారు.

తొమ్మిదవ విషయం: ఇనుము - ఉక్కు పరిశ్రమకు చెందిన పెద్ద కర్మాగారాల్లో కార్మికులకు హెచ్చుజీతా లిస్తారనే ప్రతీతి ఉంది. అవన్నీ పూర్తిగా జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు పలుకుబడిక్రింద ఉన్నాయి. అలాంటి యూనియన్లు కూడ తమ పాత మార్గానికి స్వస్తిచెబుతున్నాయి. ఉదాహరణకు జెమ్‌షెడ్‌పూర్, బర్న్‌పూర్ యూనియన్లు

రెండూ జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు సల హాలను త్రోసిపుచ్చి, పోరాటంద్వారా కొన్ని ముఖ్యమైన సౌకర్యాలు పొందాయి.

పదవవిషయం: 1955, '56 సంవత్సరాల్లో జరిగిన ఐక్య పోరాటాలవల్ల యజమానులు తాత్కాలికంగా రేషన లైజేషను స్కీములను ఉపసంహరించుకున్నారు. ఆ ఐక్యతను విచ్ఛిన్నంచేసి, ఉత్పత్తిపెరగడంలేదన్న సాకుతో మళ్ళీ దాడి చేయాలని వారు చూస్తున్నారు.

## 58. కొన్ని ముఖ్యపోరాటాలు

కార్మికులు జరిపిన పోరాటాలన్నిటిని గురించి, వారి త్యాగాలను గురించి, ధైర్యసాహసాలను గురించి వివరించడం యిక్కడ సాధ్యంకాదు. ప్రభుత్వ కాల్పులలో అనేకమంది కార్మికులు మరణించారు; గాయపడ్డారు. వందలాది కార్మికులు జైళ్ళకు - పంపబడ్డారు. వేలాది కార్మికులు ఉద్యోగాలను పోగొట్టుకున్నారు. వారంతా వ్యక్తిగతంగా నష్టాలకులోనైనప్పటికీ వారి త్యాగాలు కార్మికవర్గాన్ని మరింత పటిష్ఠమొనర్చాయి. ప్రాణాలను కోల్పోయిన ఆ కొద్దిమంది వ్యక్తులు లక్షలాది కార్మికుల ప్రాణాలను రక్షించారు; తమవర్గం యొక్క విశ్వాసాన్ని ప్రశంసలను సంపాదించారు.

కాన్పూరు బట్టలమిల్లు కార్మికులు 90 రోజులువరుసగా బ్రహ్మాండమైన సమ్మెసాగించారు. ఆ పోరాటంలో వారు ప్రదర్శించిన ఐక్యతవల్ల యజమానులు రేషనలైజేషనుదాడిని

విరమించుకోవలసి వచ్చింది. అంతవరకు "సాంకేతికాభివృద్ధి" సాకుతో తమ స్కీమును గురించి పెద్దగా కబుర్లు చెప్పి కార్మికులమీద దాడి ప్రారంభించిన యజమానులు, ప్రభుత్వం తమ వైఖరిని మార్చుకోవలసివచ్చింది. 1957 లో జరిగిన త్రైపాక్షిక సమావేశంలో యీ విషయం స్పష్టంగా ద్యోతకమైంది.

రైల్వేలలో జరిగిన అనేక పోరాటాలు, కాల్కా, ఖరగ్‌పూర్ మొదలైనచోట్ల జరిగిన కాల్పులు రైల్వే కార్మికుల సమస్యను ప్రజల దృష్టికి తీసుకొచ్చాయి. "రాజ్యాంగ భద్రత" పేరుతో రైల్వేలలో చురుగ్గా పనిచేసే ట్రేడ్‌యూనియన్ కార్యకర్తలమీద విపరీతమైన దాడి ప్రారంభమైంది. శంకర్‌శరణ్ ట్రిబ్యునల్ బుట్టదాఖలు చేయబడింది. జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ చెప్పుచేతల్లో నడిచే నేషనల్ ఫెడరేషన్ ఆఫ్ ఇండియన్ రైల్వేమెన్ కూడ అంతర్ధానమైంది. ఖరగ్‌పూర్ సమ్మెలో కొందరు అరాజకంగా ప్రవర్తించడం వల్ల చాలమంది ప్రాణాలు ప్రమాదానికి గురి అయాయి. మేనేజిమెంటు తరఫున ఉంటూ కవ్వించి రెచ్చగొట్టే కొందరు వ్యక్తులు ఆ చర్యల్లో ప్రధానపాత్ర వహించారు. ఆ సంఘటనవల్ల సమ్మెకు ఆటంకం కలిగింది. అయినప్పటికీ ఆ సమ్మె ప్రభుత్వదృష్టిని ఆకర్షించింది.

రక్షణశాఖకు చెందిన పనివారు 1956 సెప్టెంబరు— అక్టోబరు మాసాల్లో రిట్రెంచిమెంటుకు వ్యతిరేకంగా పోరా

టం జరిపారు. దేశవ్యాపితంగా జరిగిన ఆ పోరాటంవల్ల ప్రభుత్వం రిట్రెంచిచేయబడ్డ వారిని కొంత వరకు యితర శాఖల్లోకి తీసుకోడాని కంగీకరించింది.

బ్యాంకు ఉద్యోగుల విషయంలో లేబరు అప్పిలేట్ ట్రిబ్యునల్ యిచ్చిన తీర్పు ప్రకారం కొందరిని పనులనుంచి తొలగించటం, మరికొందరి జీతాల్లో కోతకోయడం జరిగి యుండవలసింది. దీనికివ్యతిరేకంగా బ్యాంకు ఉద్యోగు లనేక నిరసన చర్యలకు పూనుకున్నారు. చివరకు విజయం సాధించారు. కాని బెంగాల్‌రాష్ట్రంలో బ్యాంకు ఉద్యోగులు అధిక ధరల ఎలవెన్సు విషయంలో ట్రిబ్యునల్ తీర్పును మార్పించడానికి ఒంటరిగా పోరాడి ప్రతిష్టంభనలో యిరుక్కున్నారు. వారి కోర్కెను ప్రభుత్వం నిరాకరించింది. అయితే, ట్రిబ్యునల్ తీర్పుననుసరించి సంవత్సరాంతంలో జీవితావసర వస్తువుల ధరలు పెరగడంవల్ల ఎలవెన్సుకూడా హెచ్చింపబడింది.

ప్రభుత్వరంగానికి చెందిన ఇన్సూరెన్సు శాఖలో జీత భత్యాలు, సర్వీసు పరిస్థితులు అధ్వాన్నంగా తయారవడంవల్ల ఆ శాఖను చెందిన ఉద్యోగులు పోరాటానికి ఉపక్రమించారు. ఒక్కరోజుమాత్రమే వారు నిరసన సమ్మె చేశారు. అయినప్పటికీ, దాని వ్యాప్తిని చూచి అనేకమంది విస్తుపోయారు. వెంటనే ఆ తగాదాను ఆర్థికమంత్రిత్వశాఖ పరిష్కరించింది. కొన్ని ప్రధాన కోర్కెలు ఈడేరకపోయినప్పటికీ, ఇన్సూరెన్సు ఉద్యోగులు గణనీయమైన సౌకర్యాలను పొందగలిగారు.

బర్న్‌పూర్ ఉక్కు కార్మికులు 1953 నుంచీ పోరాడు తూనే ఉన్నారు. వారు దృఢనిశ్చయాన్ని ప్రదర్శించడంవల్ల, చక్కని ఎత్తుగడలు అవలంబించడంవల్ల కొన్ని మంచి సౌక ర్యాలను పొందారు. వారికిచ్చే లాభాలబోనసు 10 రోజుల నుంచి (యిదివరలో రోజుల్ని బట్టికాక లాభాలనుబట్టి యిచ్చే వారు) 65 రోజులకు పెరిగింది. రిట్రెంచిచేయబడిన 105 గురు కార్మికుల్ని 4 సంవత్సరాల తర్వాత నష్టపరిహారమిచ్చి తిరిగి పనుల్లోకి తీసుకున్నారు. సుప్రీంకోర్టు తీర్పుననుసరించి యజ మాను లీవిధంగా దిగిరావలసివచ్చింది. కార్మికులకు చెల్లించ వలసిన నష్టపరిహారం రు. 15 లక్షలు. ఆ మొత్తాన్ని పూర్తిగా చెల్లించడానికి కంపెనీ అంగీకరించింది. ఆవిధంగా కొంత సద్భా వం ప్రదర్శించింది.

ఇవిగాక అనేక స్థానికపోరాటాలు జరిగాయి. వాటిలో ముఖ్యమైనది నాగపూర్ బట్టలమిల్లు కార్మికుల సమ్మె. ఈ సమ్మెలో పాల్గొన్న వారంతా — స్త్రీలు, పురుషులు— జైళ్ళకు పంపబడ్డారు. మోడీనగర్‌లో హింద్‌మజ్దూర్ సభ నడిపిన సత్యాగ్రహం కూడ చాల తీవ్రరూపందాల్చిన పోరా టమే. దాల్మియానగర్‌లో జరిగిన పోరాటం కూడ యిలాం టిదే. అక్కడకూడ హింద్‌మజ్దూర్ సభే నాయకత్వం వహించింది. కార్మికులు ఆ పోరాటంలో విజయంసాధించారు. ఆ పోరాటంలో అ. భా. ట్రే. యూ. కాంగ్రెస్ హింద్ మజ్దూర్ సభతో సహకరించింది.

బెరిల్లీలో విమ్‌కో అగ్గిపెట్టెల ఫ్యాక్టరీ కార్మికులు జరిపిన పోరాటం కూడా యీ సందర్భంలో పేర్కొనదగ్గదే. దాని యజమానులు త్రైపాక్షిక సమావేశం యొక్క నిర్ణయాలకు వ్యతిరేకంగా రేషనలైజేషన్ ప్రవేశపెట్టారు. యు.పి. ప్రభుత్వం జోక్యం కలిగించుకోలేదు. పైగా సమ్మె నాయకుల్ని అది జైల్లో నిర్బంధించింది. కంపెనీ అధికారులు తాము అసలు రేషనలైజేషన్ అమలు జరపనేలేదని బుకాయించారు.

దేశవ్యాపితంగా జరిగిన మరో పోరాటం రేవు కార్మికుల పోరాటం. అది రాజీతో అంతమయింది రేవులలో సరుకు చాలకాలం నిల్వ ఉండిపోడానికి కారణం కార్మికుల అశ్రద్ధ అనీ, వారు చాల మందకొడిగా పనిచేస్తారనీ, చేయవలసిన పని చేయకుండా టలాయిస్తారనీ అధికారులు ఆరోపిస్తూవచ్చారు. ప్రజాభిప్రాయాన్ని కార్మికులకు వ్యతిరేకంగా తిప్పడానికి ప్రయత్నిస్తూవచ్చారు. కాని, ఒప్పందం జరిగినతర్వాత బయటపడిన విషయమేమంటే —— యంత్రసామాగ్రీ తగినంత ఖాళీస్థలం తదితర సదుపాయాలు లేకపోడమే సరుకు నిల్వ ఉండిపోవడానికి కారణం. రేవు అధికారులు ఓడలనుండి దింపవలసిన సరుకు, ఓడల్లోకి ఎక్కించవలసిన సరుకు ఎంత ఉంటుందో ఎప్పటికప్పుడు సరియైన అంచనా వేసుకోలేక పోతున్నారు. అయినా, అధికారులూ ప్రభుత్వం కార్మికులపై అనవసరమైన ఆరోపణలు, బెదిరింపులు చేశారు.

ఇక్కడ నేను కార్మికులు జరిపిన పోరాటాలన్నిటిని గురించి, వాటి లక్షణాలను గురించి, వాటినుంచి నేర్చుకో వలసిన గుణపాఠాలను గురించి వివరాలోకి వెళ్ళి పరిశీలించడం సాధ్యంకాదు. కాని కొన్ని విషయాలను గురించి మాత్రం అందరం తెలుసుకోవలసి యుంది.

## 59. ప్రాతికేయుల, ప్రభుత్వ పనివారల కోర్కెలపై తీర్పులు

ఇటీవలి కాలంలో యజమానులు ట్రిబ్యునల్స్ తీర్పులకు వ్యతిరేకంగా పనివారల కోర్కెలను నిరాకరించే ఉద్దేశంతో సుప్రీం కోర్టుకు వెళ్ళడం, ఆ కోర్టు కార్మికులకు వ్యతిరేకంగా తీర్పులు చెప్పడం ఎక్కువయింది. న్యాయశాస్త్రం ఆవిధంగా ఉండడ మొక్కటే యిందుకు కారణం కాదు; ఆ న్యాయశాస్త్రాన్ని అమలుజరపడంలో పాటించవలసిన మూల సూత్రాలు నిర్వచింపబడకపోవడం కూడా యిందుకు కారణమే. కోర్టు తీర్పులు సాంఘిక న్యాయా న్ననుసరించి ఉండాలని చెప్పబడినప్పటికీ, ఆ సూత్రం స్పష్టంగా నిర్వచింపబడలేదు. అందుచేత ప్రస్తుత సమాజంలో పెట్టుబడిదార్లకూ కార్మికులకూ సమానమైన న్యాయం అంటే పెట్టుబడిదార్ల కనుకూలమైన న్యాయంగా చెలామణీ అవుతోంది. ఇందుకు బాధ్యులెవరు ? పై దుష్ఫలితాన్ని గురించి ఎన్నోసార్లు మనం పాలకవర్గ పార్టీదృష్టికి తేవడం జరిగింది; పారిశ్రామిక చట్టాలను, పారిశ్రామిక సంబంధాలను యిప్పటికన్న ఉత్తమమైన

మార్గంలో రూపొందించాలని పదేపదే చెబుతూవచ్చాం. కాని కాంగ్రెస్ పెడచెవినిపెడుతూ వచ్చింది. రాజ్యాంగ చట్టంలోని 43 వ ఆర్టికల్‌లో సాంఘిక న్యాయాన్ని గురించిన భాగం ఉంది. కాని అది చాల అస్పష్టంగా ఉంది. సమాజంలో కష్టజీవులే అత్యధిక సంఖ్యాకులు గనుక ప్రధానంగా వారికే న్యాయం కలిగేట్లు చూడాలనీ, యితరుల ప్రయోజనాలు అడ్డువచ్చినప్పటికీ లెక్కచేయకూడదనీ, సాంఘిక న్యాయం అంటే ఇదేననీ స్పష్టంగా వివరిస్తూ 43 వ ఆర్టికల్‌ను సవరించాలని అ.భా.ట్రే.యూ. కాంగ్రెస్ డిమాండు చేసింది.

అన్నిటికంటే ఎక్కువగా ప్రజల దృష్టిని ఆకర్షించిన కేసు పాత్రికేయుల జీత భత్యాల సమస్యపై యివ్వబడిన తీర్పు. పాత్రికేయుల జీత భత్యాలను నిర్ణయిస్తూ వేజ్‌బోర్డు యిచ్చిన తీర్పును గుత్తాధికారంగల పత్రికాధిపతులు బాహాటంగా కాలదన్నారు. సుప్రీంకోర్టులో వారు దావా వేశారు. ప్రభుత్వం జోక్యం కలిగించుకోలేదు. సమస్యను పరిష్కరించేందుకది నిరాకరిస్తోంది. కారణమేమంటే పెద్ద పెద్ద పత్రికలను గుప్పెట్లోపెట్టుకున్న వారి మొండితనాన్ని అణచేందుకు ప్రభుత్వం సిద్ధంగా లేదు.

ఆ పనిని ప్రభుత్వం చేయగలదా? తలచుకుంటే తప్పక చేయగలదు. బొగ్గుగనుల విషయంలో అలా చేసింది. గని యజమానులు ఎవార్డును ధిక్కరించి సుప్రీంకోర్టులో దావా వేశారు. అనేక బొగ్గుగనులలో సమ్మెలు జరిగాయి. అవి దేశ

వ్యాపిత సమ్మెకు దారితీసే సూచనలు కనిపించాయి. కార్మిక మంత్రి శ్రీ నందా యిరుపక్షాల ప్రతినిధుల్నీ సమావేశపర చారు. ప్రభుత్వానికి కూడా కొన్ని గనులుండడంచేత అది కదలవలసివచ్చింది. బొగ్గు ధరలను పెంచుకోడానికి యజమానుల కవకాశమిచ్చి, కార్మికులకు ఎవార్డు ననుసరించి జీత భత్యా లివ్వాలని ప్రభుత్వం ఆదేశించింది.

గని కార్మికుల పోరాటం, వారి జీతభత్యాలను గురించి యివ్వబడిన తీర్పు, తగాదా పరిష్కారం చాల ప్రాధాన్యం గల విషయాలు,

ఇక పోస్టు–టెలిగ్రాఫ్ పనివారు, ప్రభుత్వ సర్వీసుల్లోని తదితరులు జరిపిన పోరాటం నిజంగా చరిత్రాత్మకమైనది. వారు ఆగస్టు 8 వ తేదీని జరపాలనుకున్న సమ్మె ప్రభుత్వాన్నీ దేశాన్నీగూడ కంపింపజేసింది. దేశానికంతకూ అత్యంత ప్రాధాన్యం వహించే కమ్యూనికేషన్లు ఒక్కసారిబంద్ అయే సూచనలు కనిపించాయి. ఇతర సర్వీసులవారు కూడా సమ్మెలో చేరడానికి నిశ్చయించుకున్నారు. మరోవైపు ప్రభుత్వం పనివారిని అదేపనిగా బెదిరిస్తూవచ్చింది. ఇట్టి పరిస్థితుల్లో సహజంగా యావత్తు దేశాన్ని ఉద్రిక్త వాతావరణం అలముకొంది. భారతదేశ చరిత్రలో మొట్ట మొదటిసారి ప్రభుత్వ సర్వీసులలోని వారంతా ట్రేడ్ యూనియన్ డిమాండ్లకోసం, ధరల పెరుగుదలను అరికట్టించేందుకు, తమస్థితిగతుల్ని మెరుగు పరచుకోడానికి ఐక్యతతో పోరాడ్డానికి నిశ్చయించుకున్నారు.

మొట్ట మొదటిసారి ప్రభుత్వ సర్వీసులలో సివారు తమ ఐక్య కార్మిక సమాఖ్య ఆధ్వర్యాన కార్యరంగంలో ప్రవేశించడానికి సిద్ధంగా ఉన్నారు. ఒక్క జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ తప్ప మిగతా కేంద్ర ట్రేడ్ యూనియన్ సమాఖ్యలన్నీ వారిని బలపరచాయి.

ఇదంతాచూచి, ప్రభుత్వం ఆఖరు క్షణాల్లో పే కమిష న్నొకదాన్ని నియమించడానికంగీకరించింది. మొదట్లో యీ కోర్కెను ప్రభుత్వం నిరాకరించింది. ప్రధానమైన జీతాల సమస్య తప్ప మిగతాకోర్కెలను అప్పటికప్పు డంగీకరించింది. (జీతాల సమస్యను పరిష్కరించవలసింది పే కమిషన్ గనుక) 'త్వరితంగా' కొంత తాత్కాలిక సహాయం చేయడానికి కూడా నిశ్చయించుకుంది. పార్లమెంటులో ఇట్టి ఖచ్చితమైన ప్రకటన చేయబడ్డంవల్ల పనివారు సమ్మె నోటీసును ఉపసంహ రించుకున్నారు.

ఈ సమస్యపై అనేక వాదోపవాదాలు జరిగాయి. అ. భా. ట్రే. యూ. కాంగ్రెస్ సమ్మెనోటీసును బలపరచింది; సంప్రతింపులలోను తగాదా పరిష్కారంలోను తోడ్పడింది. ప్రభుత్వం పేకమీషన్ నియామకానికంగీకరించి కొన్ని సౌక ర్యాలివ్వడానికికూడా సంసిద్ధత ప్రకటించినతర్వాత యికసమ్మె నోటీసు అవసరం లేదని అ. భా. ట్రే. యూ. కాంగ్రెస్ అభిప్రాయపడింది. అయితే, పోస్టు – టెలిగ్రాఫ్ పనివారల సంఘం ఎట్టినిర్ణయంచేసినా దాన్ని బలపరచడానికి నిశ్చ

యించుకొంది. పోస్టు-టెలిగ్రాఫ్ పనివారలసంఘం సమ్మె నోటీసును ఉపసంహరించుకోవడానికి తనకు తానుగా నిర్ణయించుకొంది.

ప్రభుత్వం యివ్వదలచుకున్న తాత్కాలిక సహాయం త్వరలోనే ప్రకటింపబడింది. రు. 5 అదనంగా అధిక ధరల అలవెన్సు యివ్వడానికి నిశ్చయించుకొన్నారు. ఈ సహాయం ఎంతమాత్రమూ సరిపోదు. కాని యింతకన్న ఘోరమైన అన్యాయం ఏమంటే నెలకు రు. 5 చొప్పున యివ్వవలసిన బకాయిని (రు. 30) నేషనల్ సేవింగ్స్ సర్టిఫికెట్లరూపంలో యివ్వదలచుకున్నారు. ఈ విధంగా, ఒక వైపు ప్రభుత్వం ధరలు పెరిగాయనీ, రు. 5 అదనపు కరువుభత్యం యివ్వడం అవసరమనీ గుర్తిస్తూనే, రెండోవైపున పనివారి అవసరాల కోసం యివ్వవలసిన రు. 9 కోట్లు ఒక చేత్తో యిచ్చి మరొక చేత్తో పుచ్చుకున్నారు. త్రైపాక్షిక స్థాయిసంఘసమావేశంలో యిటీవల జరిగిన ఒడంబడికకు ఇది వ్యతిరేకం. ఈవిధంగా ఎన్నడూ అధిక ధరల అలవెన్సు నిలుపుచేయ బడలేదు. బోనసుగా యివ్వవలసిన సొమ్ము సర్టిఫికెట్లరూపంలో చెల్లింపబడిన సందర్భాలున్నప్పటికీ కరువుభత్యాన్ని ఆ విధంగా ఎన్నడూ ఆపియుంచలేదు. ఈపద్ధతి కార్మికుల్లోఅసంతృప్తి, నిరసన తీసుకొచ్చింది (తర్వాత ప్రభుత్వం బకాయిలన్నిటినీ నగదు రూపంలో చెల్లించడాని కంగీకరించింది.)

# 60. ప్రభుత్వం యొక్క నిజస్వరూపం

ఈ యేడు, క్రిందటేడు జరిగిన పోరాటాల్లో ప్రభుత్వం యొక్క నిజస్వరూపం చాలసార్లు బయటపడింది. గుత్తేదారుల, పెట్టుబడిదార్ల ప్రయోజనాలను రక్షించేందుకది ప్రభుత్వ బలాన్నంతటినీ వినియోగించి కార్మికుల న్యాయమైన కోర్కెలను నిరాకరిస్తూ వచ్చింది. నెహ్రూవంటి నాయకుడు ప్రభుత్వాధినేతగా ఉన్నప్పటికీ, ప్రభుత్వం సోషలిజాన్ని గురించి ప్రకటనలు చేస్తున్నప్పటికీ, ప్రజాతంత్ర ప్రభుత్వం - సంక్షేమ రాజ్యం అనే పేర్లతో అది వ్యవహరింపబడుతూన్నప్పటికీ వాస్తవంగా జరుగుతున్నది మాత్రం యిదే.

ప్రభుత్వం తరచు సమ్మెదారులమీద కాల్పులు జరపడాన్ని కాంగ్రెస్ వాదులు సైతం ఖండిస్తున్నారు. ఈ మధ్య కేరళప్రభుత్వం ప్రజలమీద తుపాకులు కాల్చేపద్ధతికి స్వస్తి చెబుతూ ఒక ప్రకటన చేసింది. అలాగే, భూస్వామ్య - పెట్టుబడిదారీ వర్గాలు కష్టజీవుల పోరాటాలను అణచేందుకు తీసుకొనే చర్యలలో పోలీసులు ఉపయోగింపబడకుండా చూస్తానని చెప్పింది. అయితే, యజమానులకు ప్రాణనష్టంగాని, ధననష్టంగాని జరక్కుండా చూస్తానని హామీయిచ్చింది. ఈ ప్రకటన చూచిన కాంగ్రెసు మంత్రులకు ఆశ్చర్యం, చీకాకు కలిగింది. ఇటీవల భంగీకాలనీ (ఢిల్లీ) లో జరిగిన కాల్పులు పార్లమెంటులో పెద్ద సంచలనం కలిగించాయి. భంగీ కాలనీలో గాంధీమహాత్ముడు శాంతికోసం, అహింసకోసం రోజూ

ప్రార్థనలు జరిపేవారు. ఆ స్థలంలోనే ఆ మహాత్ముని పేరు తోనే మంత్రివర్గం యొక్క ఉత్తరువుల ననుసరించి ఒక దుర దృష్టవంతుని ప్రాణాలను బలిగొనడం చూచి కొంతమంది కాంగ్రెసువాదులే సిగ్గుపడ్డారు. అరెస్టులు, లాఠీచార్జీలు లేకుండా సాగిన సమ్మె ఒక్కటికూడా కనిపించదు. ప్రతిసమ్మె లోను డిఫెన్సు చట్టం విచ్చలవిడిగా ఉపయోగింపబడింది. కార్మికులు తమ కోర్కెలను సాధించడానికి లేదా నిరసన ప్రకటించడానికి ఏ మాత్రం ముందుకువచ్చినా పోలీసులు ప్రత్యక్షం! ఇదీ, కార్మికవర్గానికి ప్రసాదింపబడుతున్న ప్రజా స్వామ్యం. మరోవైపు ఆహార ధాన్యాలను నిల్వచేసేవారు, పన్నులను ఎగవేసేవారు, ప్రభుత్వధనాన్ని అపహరించేవారు సర్వస్వాతంత్ర్యం అనుభవిస్తున్నారు.

పోస్టు-టెలిగ్రాఫ్ పనివారు, ప్రభుత్వ సర్వీసులో ఉన్న వారు సమ్మెచేయడానికి సర్వసన్నద్ధులవడం చూచి ప్రభు త్వం త్వరితంగాకదిలింది; తేలిక సర్వీసులలోను, తదితరసర్వీసు లలోను సమ్మెలు పనికిరావంటూ నిరంకుశమైన ఉత్తరువులు జారీచేసింది. ప్రభుత్వోద్యోగులు తమ యూనియన్‌కి సంబం ధించిన కార్యకలాపాలతో సహా ఏ పబ్లిక్ కార్యక్రమాల లోను పాల్గొనకూడదని ఆదేశించింది. తదనుగుణ్యంగా వారి కాండక్టు రూల్సును సవరించింది. ప్రభుత్వంచే గుర్తింపబడని ఏ యూనియన్‌లోను ప్రభుత్వోద్యోగులు సభ్యులుగా చేరరా దని ఆంక్షవిధించింది. అయితే ప్రభుత్వం ఫలానాయూనియన్ని గుర్తించితీరాలన్న నియమంలేదు. కార్మికులకు కొన్ని సౌక

ర్యాలిచ్చే చట్టాలను ప్యాసుచేసేందుకు సంవత్సరాల తరబడి జాగుచేసే ప్రభుత్వం 20,00,000 ప్రభుత్వ పనివారల ట్రేడు యూనియన్ హక్కుల్ని, ప్రజాతంత్ర హక్కుల్ని ఒక్క రోజులో కాలరాయడానికి సమకట్టింది.

అయితే ఇక్కడ మన ముఖ్యవిషయం మరచిపోకూడదు. కార్మికవర్గం ఐక్యతతోను, దృఢనిశ్చయంతోను సక్రమమైన కార్యాచరణకు పూనుకుంటే, ప్రభుత్వాన్ని వెనుకడుగు వేయించవచ్చు. అట్టిశక్తి కార్మికవర్గానికుంది. పోస్టు - టెలి గ్రాఫు, బొగ్గుగనులు, తేయాకుతోటలు, బ్యాంకులు, ఇన్సూరెన్సు మొదలైన సంస్థల్లో సరిగ్గా ఇదే జరిగింది.

కొన్ని సమ్మెలవల్ల ఒక విచిత్రమైన విషయం ద్యోతకమైంది. ఇదివరకే ప్యాసైన చట్టాలను ప్రభుత్వంచేత, యజమానుల చేత అమలుజరిపించేటందుకు సైతం కార్మికులు పోరాడవలసివస్తూంది. ట్రేడ్ యూనియన్లు బలంగా లేనిచోట్ల ప్రభుత్వ చట్టాలు బాహాటంగా ఉల్లంఘింప బడుతున్నాయి. బొగ్గు గనుల్లోను తేయాకు తోటల్లోను పెద్ద ఎత్తున ఇలా జరుగుతూంది.

పెద్ద పెద్ద పెట్టుబడిదారులు, కాంగ్రెస్ పార్టీ పరిపాలిస్తూన్న మన రిపబ్లిక్కులో సహితం ప్రజాతంత్రయుతరాజ్యాంగ చట్టం క్రింద ట్రేడ్ యూనియన్లు నిర్వర్తించవలసిన కర్తవ్యం ఒకటి ఉంది. కార్మికులు ఇదివరకే పోరాటాల ద్వారా సంపాదించుకున్న హక్కులను కాపాడ్డం, కార్మికులకు ఉపయోగకరమైన చట్టాలను అమలుజరపడం ట్రేడ్ యూనియన్ల విధి.

మన దేశంలో ప్రభుత్వ ఆర్థిక రంగం అభివృద్ధి చెందు తూండడంవల్ల ప్రభుత్వమే అందరికంటె పెద్ద యజమానిగా వుంది. ప్రభుత్వంక్రింద పనిచేసేటంతమంది కార్మికులు ఏయితర యజమాని క్రింద పనిచేయడంలేదు. ప్రభుత్వ సర్వీసులలో పనిచేసేవారి విషయం అలావుంచి, ప్రభుత్వానికీ కార్మికులకూ మధ్య రెండువిధాలైన సంబంధం ఉంది. మొదటిది అందరి లాగే ప్రభుత్వంకూడ ఒక యజమాని. రెండవది, రాజ్యాంగ యంత్రాన్ని కూడ నడిపేది అదే అందుచేత కార్మికులు తమ కోర్కెలకోసం జరిపే ప్రతి పోరాటంలోను తప్పనిసరిగా ప్రభు త్వంతో ఘర్షణపడవలసి యుంటుంది. ఎంత చిన్న కోర్కెల కోసం కార్మికులు పోరాటం జరిపినా, ప్రభుత్వం దాన్ని బల ప్రయోగంద్వారా అణచజూస్తుంది. ప్రతి పోరాటం ప్రభు త్వాన్ని కూలద్రోయడానికి, లేదా స్తంభింపచేయడానికి ఉద్దే శింపబడిందంటూ నిందించగల్గుతూంది. రేవు కార్మికులు సరా సరి ప్రభుత్వంక్రింద పనిచేయని రోజుల్లోనే ప్రభుత్వం వారిని గురించి పై విధంగా చెబుతూవచ్చేది. ఇప్పుడిక చెప్పనవస రమే లేదు.

అందుచేత, పరిశ్రమల్లో ప్రభుత్వ రంగం అభివృద్ధి చెందడం స్థూలంగా కార్మికవర్గ పోరాటానికి అనుకూలమైన విషయమే అయినప్పటికీ, కార్మికులు తమ కోర్కెల కోసం ప్రభుత్వంతో పోరాటంజరిపేటప్పుడు అదిఅననుకూలమైన విష యంగా పరిణమిస్తూ ఉంటుంది.

# 61. యువకార్మికులు, కార్మిక ఐక్యత, విద్యాబోధన

ఇటీవలి కాలంలో కార్మికవర్గ సంచయం (Composition) త్వరితగతిని మార్పుచెందుతోంది. ఆర్థిక వ్యవస్థ అభివృద్ధి చెందేకొద్దీ రైతువర్గంనుంచి వచ్చిన యువకులు అనేకమంది పట్టణాలకు, ఫ్యాక్టరీలకు చేరుకొంటున్నారు. యుద్ధానికి పూర్వం, యుద్ధం తరువాత జరిగిన పోరాటాలనుంచి గుణ పాఠాలు నేర్చుకొని అభివృద్ధిచెందిన కార్మికవర్గ సాంప్రదాయాలను వారింకా అలవరచుకోలేదు. ఈ యువ కార్మికులు పాతవారి అనుభవాన్ని అకళింపుచేసుకోవాలి.

త్వరితగతిని అభివృద్ధి చెందే ఈ యువకార్మికులు త్వరలోనే స్వానుభవం ద్వారా తమ చుట్టూఉన్న సామాజిక వ్యవస్థ ఎట్టిదో, తమకువ్యతిరేకంగా ఏవర్గం ఎట్టిరాజ్యాంగం పరిపాలిస్తోందో తెలుసుకోగల్గుతారు. అభివృద్ధియొక్క వేగాన్నిబట్టి, త్వరితంగా మారుతూన్న పరిస్థితుల్నిబట్టి, సంక్షోభం యొక్క తీవ్రతనుబట్టి వారు త్వరలోనే రాటుదేరి బలమైన వర్గంగా రూపొందుతారు; ట్రేడ్ యూనియన్ల నిర్మాతలుగా వారు అభివృద్ధి చెందుతారు. పీడితవర్గం దోపిడీవర్గానికి వ్యతిరేకంగా పోరాడుతూ నిర్మించుకున్న ఐక్యతను విచ్ఛిన్నం చేసేందుకు పెట్టుబడిదారీవర్గం కుల, మత, భాషాభేదాలను, రాజకీయ భేదాలను ఉపయోగించుకొంటుంది. నిమ్నజాతుల వారు కులరహితమైన మతాన్నిస్వీకరించినందుకు, ఎక్కువ తక్కు

వలూ పెత్తందారీ తనం లేని మతాన్ని చేబట్టినందుకు, తమ వ్యవహారాల్ని తాము ప్రజాతంత్రపద్ధతులలో నడుపుకొంటూ న్నందుకు వారిమీద దాడిచేస్తున్నారు. వేరువేరు భాషలు మాట్లాడేవారి సంస్కృతిని, ఐక్యతను, అభివృద్ధిని ప్రోత్స హించాలన్న న్యాయమైన ప్రజావాంఛను ఆధారంగా చేసు కొని పెట్టుబడిదారులు కార్మికవర్గ ఐక్యతను చెడగొట్ట జూస్తు న్నారు. రాజకీయ విభేదాలను రెచ్చగొడుతున్నారు. ఒక పరిశ్రమలో పనిచేసే కార్మికుల సంఘాలను విచ్ఛిన్న మొనర్చే టందుకు వేర్వేరు వృత్తులవారిని వేరువేరుగా ఉంచ ప్రయత్ని స్తున్నారు. జిత్తులమారి పెట్టుబడిదారులు లెఖ్ఖలేనన్ని పద్ధ తులలో మనల్ని గందరగోళపరచి, విచ్ఛిన్న మొనర్చి తద్వారా నిరాయుధు లొనర్చడానికి ప్రయత్నిస్తున్నారు.

అందుచేత కార్మికవర్గానికి విద్యాబోధన తక్షణా వసరమయింది. ప్రభుత్వము, జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్, ఐ. సి. యఫ్. టి. యు. కార్మికుల విద్యాబోధనకు కొన్ని స్కీములు తయారుచేస్తున్నాయి. వాటి వివరాలు మన కింకా తెలియకపోయినప్పటికీ అలాంటివి కొన్ని తయారవు తూండడం బట్టే కార్మికవర్గానికి ట్రేడ్ యూనియన్లు వెంటనే విద్యాబోధన చేయవలసిన అవసరమెంత ఉందో తెలుస్తుంది. మన ట్రేడ్యూనియన్లు ప్రభుత్వ స్కీములలో పాల్గొనాలి. రెండోవైపు మన మొక స్కీమును స్వతంత్రంగా తయారు చేసుకోవాలి.

## 62. నాయకులుగా స్త్రీలపాత్ర

భారతీయులు తమ స్త్రీలకు ఉన్నతమైన గౌరవస్థానం ఇస్తారనే ప్రతీతిఉంది. ఇతరరంగాలలో యిదినిజమైతే కావచ్చు గాని కార్మికవర్గం విషయంలో మాత్రంకాదు. పెట్టుబడిదారీ వర్గం బట్టల పరిశ్రమలో ఎక్కడవీలుంటే అక్కడ కార్మిక స్త్రీలను పనులలో నుంచి తొలగించేస్తున్నారు. ఇది సాధ్యం కానిచోట్ల పురుషులమీద ఎంత క్రూరంగా దాడిచేస్తున్నారో స్త్రీలమీద కూడ అంత క్రూరంగాను దాడిచేస్తున్నారు. మనం జరిపిన పోరాటాలలో — బొగ్గుగనులు, తేయాకు తోటలు, బీడీపరిశ్రమ వగైరా— స్త్రీలు అందరికంటె ఎక్కువ శూర త్వం గల, సామర్థ్యంగల ఆర్గనైజర్లుగా రాణించారు. కాని మనం స్త్రీలను యూనియన్ నాయకుల స్థాయికితీసుకు రాలేక పోయాం. ఈ సమస్యను మనం సక్రమంగా పరిష్కరించలేదు.

## 63. మనం అధికారంలోవున్న స్థానిక సంస్థలు, వాటిలో మన పాత్ర

ట్రేడ్ యూనియన్ ఉద్యమం యింకా అనేక సమ స్యల విషయంలో శ్రద్ధచూపవలసియుంది. జనసామాన్యంలో విద్య, సంస్కృతి అభివృద్ధిచేయడం ఒక ప్రధాన సమస్యగా మనల్ని ఎదుర్కొంటోంది. ముఖ్యంగా పెద్దపెద్ద నగరాలలో యిది తీవ్రరూపం దాల్చింది. స్థానిక సంస్థలలోను, మ్యునిసి పాలిటీలలోను, కార్పొరేషన్లలోను కార్మికులు, మధ్యతరగతి

ప్రజలు మెజారిటీ సంపాదించినచోట్ల అనేక కొత్తసమస్యలు ఉత్పన్నమౌతున్నాయి. ఉదా: ఇండ్లసమస్య, ఆరోగ్య సమస్య, చదువుసమస్య వగైరా. అలాంటి పట్టణాలలో మనం మ్యునిసిపల్ పరిపాలకులుగాను, ఒక్కొక్కప్పుడు మ్యునిసిపల్ సంస్థల నిర్వాహకులుగాను కొన్ని కర్తవ్యాలను నిర్వర్తించవలసి యుంటుంది. ఈ రెండు విధాలైన కర్తవ్యాలను సమన్వయ పరచాలంటే, కొన్ని సూత్రాలకు మనం కట్టుబడి ఉండాలి. ఒకవైపు ప్రధానమైన పాలకవర్గ పార్టీగా కాంగ్రెసు ద్రవ్యనిధులన్నిటినీ, చట్టాలన్నిటినీ తన అధీనంలో ఉంచుకొని మనకు వ్యతిరేకంగా వ్యవహరిస్తూంటే, మరోవైపు మనం కష్టజీవుల ప్రయోజనాలను కాపాడుతూ పట్టణ అవసరాలను తీర్చవలసిన అవసరం ఏర్పడుతూంది. అట్టి పరిస్థితుల్లో ట్రేడ్ యూనియన్ నాయకులు కేవలం ఆందోళన పరులుగానే కాకుండా, నిర్మాతలుగాను, పరిపాలకులుగాను కూడ తమ పాత్రను నిర్వహించవలసివుంది. ఇట్టి పరిస్థితుల్లో ఒక విచిత్రమైన వైరుధ్యం ఉత్పన్నమౌతుంది. ఒక వైపు మనం పెట్టుబడిదారీ పరిధుల్లో పరిపాలకులుగానూ ఉండాలి; మరోవైపు పీడితప్రజల రక్షకులుగానూ ఉండాలి. ఈ వైరుధ్యాన్ని శత్రువైరుధ్యంగా కాకుండా స్నేహపూర్వకంగా పరిష్కరించవలసి ఉంటుంది. ఈ విషయంలో మన ట్రేడ్ యూనియన్లకు అనుభవంలేదు. ఈ ద్వంద్వపాత్రను నిర్వహించడమెలాగో వాటికింకా తెలియదు. ఒక్కొక్కప్పుడు మనం పెట్టుబడిదారీ పరిధిలో పరిపాలకులుగా మన విధులను నిర్వ

త్రించడం దుర్లభమని భావిస్తాము. మనం ఎదుర్కోవలసిన చిక్కులను గురించి ఎక్కువ అంచనా వేస్తాము. మరొకప్పుడు మనం పీడితప్రజలకు అధికంగా సహాయం చేయడానికి ప్రస్తుత మున్న అవకాశాలను ఎక్కువ అంచనా వేస్తాం. ఇట్టి పరిస్థితుల్లో ఒకరి అభిప్రాయాలను ఒకరు తెలుసుకోవడంవల్ల, పరస్పర సంప్రతింపులవల్ల ఉపయోగం౦డుంటుంది. యూనియన్లు కొంతవరకు నిగ్రహం చూపుతూనే, ఎంతతక్కువ సహాయ మైనాసరే చేయడానికి నిరంకుశ పద్ధతులను అధిగమిస్తూ త్వరితంగానూ శక్తివంతంగాను కొన్ని చర్యలు తీసుకోవలసి యుంటుంది. అనేక శతాబ్దాల అనుభవంవల్ల మన ప్రజలకు ప్రభుత్వ యంత్రమంటే గట్టిఅనుమానంవుంది. ఈవిషయాన్ని మనం దృష్టిలో ఉంచుకొని సరియైన రాజకీయశిక్షణయివ్వాలి. అదేసమయంలో కొన్ని ప్రత్యక్షచర్యలు కూడ తీసుకోవాలి. అలాచేసినప్పుడు వారిలోవుండే అనుమానాలు మనల్ని కూడ మింగివేయకుండా కొంతవరకు తగ్గించగలుగుతాము. గుత్తె పెట్టుబడి దారులు అధికారంలోవున్న చోట్ల వారిపనిచేయ లేరు; కార్మికవర్గంమాత్రమే యిది చేయగలుగుతుంది. కేరళ అనుభవాన్నిబట్టి, అత్యంత భాగ్యవంతమైన పెద్దదైన బొంబాయి కార్పొరేషన్ అనుభవాన్నిబట్టి మన ముందున్న సమస్యలేమిటో, వాటిని పరిష్కరించవలసిన మార్గమేమిటో బోధపడుతుంది.

—o—

# 7. నిర్మాణం

## 64. సంఖ్యలో బలం; నిర్మాణంలో బలహీనత

ఇప్పటికే ఈ నివేదిక దీర్ఘం అయింది. అయినప్పటికీ తగినంత పరిపుష్టత దానికి లేదు. ఇంతకంటె ఎక్కువగా చర్చించవలసిన సమస్యలు యింకా చాలా ఉన్నాయి. వాటి పట్ల తగినంత శ్రద్ధచూపబడలేదు. కొన్నింటి విషయమై అసలే శ్రద్ధచూపలేదు. నిర్మాణసమస్యను గురించి నివేదికలో ఎత్తుకోనేలేదు. దాన్ని గురించి యిక్కడ నేను రిపోర్టు యివ్వడం లేదు.

ఈ రోజున అ. భా. ట్రే. యూ. కాంగ్రెస్ నైతిక రాజకీయ పలుకుబడి విషయంలో దేశంలోని కేంద్ర ట్రేడ్ యూనియన్ సమాఖ్యలన్నిటిలోను ఎక్కువ బలమైన సంస్థగా రూపొందింది. మన సంస్థకు అనుబంధింపబడిన అనేక యూనియన్లను యజమానులు గుర్తించకపోవడంవల్ల, ప్రభుత్వమూ యజమానులూ వాటిని వ్యతిరేకిస్తూండటంవల్ల మన బలం సభ్యులసంఖ్యలోను నిర్మాణరూపాల్లోను ప్రతిబింబించడం లేదు. మన నాయకుల్లో కొందరు నిర్మాణవిధులను నిర్లక్ష్యం చేయడమో తగినంత శ్రద్ధచూపక పోవడమో కూడ జరుగుతూంది. ఇది కూడ కొంతవరకు కారణమేనని అంగీకరించాలి. మనం సిద్ధాంతాలను వల్లిస్తాం; పోరాటాలు నడుపుతాం; కష్టాలు అనుభవిస్తాం; విజయాలు సాధిస్తాం. లక్షలాది జనం మన పతాకం వెనుకనడుస్తారు; మనపిలుపును అందుకుంటారు;

కాని దానితో మనం ఆగి పోతాం. ఫలితం ఏమంటే, ఈ పోరాటాలూ విజయాలూ కార్మికుల్ని అధిక సంఖ్యలో సమీకరిస్తూన్నప్పటికీ అత్యంత బలీయమైన కవచం కార్మిక వర్గానికి లేకుండా పోతూంది. అదే సర్మాణం, సభ్యత్వం, ధనం, కార్యకర్తలు, కార్యాలయాలు, లాయర్లు, నిపుణులు, కమిటీలలో ప్రాతినిధ్యం, రాష్ట్రకౌన్సిళ్ల పని విధానం, కేంద్ర కార్యాలయాలు.

నిర్మాణానికి సంబంధించిన ఈ సమస్యను ఆషామాషీగా తేల్చిపారవేయకూడదు. అనేక వేజ్ బోర్డులు కార్మిక ప్రతినిధులమైన మన అభిప్రాయాలకొరకు వేచివున్నాయి. పోస్టు - టెలిగ్రాఫు పనివారల సంఘ నాయకత్వం జీతాల సమస్యపై ఏకాభిప్రాయంగల మెమొరాండములు తయారు చేయడానికి ఎంత పెద్ద నిర్మాణం కావలసివచ్చిందో వారి నడిగి తెలుసుకోండి. ప్రభుత్వంసహితం మనంకోరే వేజ్ బోర్డులన్నింటినీ నడపడానికి కార్యకర్తలు తగినంతమంది లేరని చెప్తూంది. అలాంటప్పుడు మన విషయం వేరే చెప్పుకోవాలా? పారిశ్రామిక కార్మికులకు చెల్లించవలసిన జీతాలు, యావద్భారత దేశానికి వర్తించే కనీస వేతనం, జీవన వేతనం—ఇవి చాల నిర్దిష్టమైన సమస్యలు. కేవలం సిద్ధాంతంవల్ల, దోపిడీనిగురించి స్థూలంగా చెప్పేమాటలవల్ల అవి పరిష్కారంకావు. జైళ్ళను, తుపాకులను ఎదిర్చినిలవడం అవసరమే కాని అదొక్కటే సమస్యను పరిష్కరించదు. నిజంచెప్పాలంటే తగాదా పరిష్కారం కానున్న సమయంలో యితర పోరాటపద్ధతులకు

దిగడంవల్ల కార్మికుల విజయాలు ధ్వంసమౌతాయి. అట్టి పద్ధతుల వల్ల మనలో కొందరు తమ అజ్ఞానాన్ని కప్పిపుచ్చుకోవచ్చు; లేదా ఒడంబడికలవల్ల కలిగేకొన్ని యిబ్బందులను నివారించవచ్చు. అది వేరేవిషయం. మనం పోరాడ్డం ఎలా నేర్చుకొంటామో, రాజీపడ్డంకూడ అలాగే నేర్చుకోవాలి. ఇది జ్ఞానం సంపాదించడం ద్వారాను, నిర్మాణాన్ని పెంపొందించుకోడం ద్వారాను మాత్రమే సాధ్యం.

ఈ సమస్యను చర్చించేందుకు గాను కార్యవర్గం కొన్నాళ్ళతరువాత కొన్ని సూచనలు చేస్తుంది.



# 8. ముగింపు

## 65. సౌహార్ద ప్రతినిధులకు అభినందనలు

నేను మొదట చెప్పినట్లు ఎంతో ప్రధానమైన పరిణామాలు జరుగుతూన్న సమయంలో మనం సమావేశమవుతున్నాం. వాటితో పోల్చి చూచుకుంటే మన సమావేశం చాల చిన్నవిషయం. కాని వాటి ప్రతిబింబం స్పష్టంగా మనకు కనిపిస్తూంది. మొట్టమొదటి సారిగా పెట్టుబడిదారీ సోషలిస్టు దేశాలనుంచి, ప్రపంచ ట్రేడ్ యూనియన్ సమాఖ్యనుంచి సౌహార్ద్ర ప్రతినిధులుగావచ్చినవారు మనమధ్య ఆసీనులై వుండడం ఎంతో సంతోషకరమైన విషయం. వారందరికీ మనం అభినందనలను అందజేదాం. వారికి భారతప్రభుత్వం ప్రయాణానుమతి పత్రా లిచ్చినందుకు ధన్యవాదా లర్పిద్దాం.

ప్రపంచ ట్రేడ్ యూనియన్ సమాఖ్య యొక్క నాల్గవ మహాసభ అనంతరం మనం సమావేశమయాం. ఆ మహాసభ చేసిన నిర్ణయాలు, ప్రపంచ కార్మికవర్గం తరఫున అది అందజేసిన సోదర సహాయం, సమైక్యత అనేకవిధాల మనకు సహాయకారిగా వుంటాయి. మన విధులను నిర్వర్తించడంలో అవి ఎంతైనా తోడ్పడతాయి.

## 66. కేరళ ప్రభుత్వం

మనం భారత దేశంలోని యితరరాష్ట్రా లన్నిటికంటె భిన్నమైన రాష్ట్రంలో సమావేశమాతున్నాం. యితరరాష్ట్రా

లలో అ. భా. ట్రే. యూనియన్ కాంగ్రెస్ ఎలా చూడబడు తోందో జ్ఞాపకముంచుకున్నప్పుడు ఈ వాక్యంలోని యదార్థం మనకు బోధపడుతుంది. ఈ రాష్ట్ర ప్రభుత్వం తీసుకునే చర్య లన్నిటినీ కొందరు హర్షించకపోవచ్చు. కాని యెవ్వరూ దానిని కార్మిక వ్యతిరేక ప్రభుత్వమని గాని, రైతు వ్యతిరేక ప్రభుత్వమని గాని, ప్రజావ్యతిరేక ప్రభుత్వమనిగాని నిందించ డానికి వీలులేదు. ఇతర రాష్ట్రాల విషయంలో యింత ఖచ్చి తంగా చెప్పలేము. ఆ రాష్ట్రాలు డిటెన్షన్ చట్టమంటేను, తమసొంత ఉద్యోగులమీద విధించే సెక్యూరిటీరూల్సులంటేను, ఆంక్షలు నిషేధాలు అంటేను విపరీతమైన మోజు కనపరు స్తున్నాయి. అ.భా.ట్రే.యూ. కాంగ్రెస్ యూనియన్లు అట్టి ప్రభుత్వాన్ని సహజంగా బలపరుస్తాయి. దాన్ని బలహీన పరచి కూలద్రోయడానికి భూస్వామ్య-పెట్టుబడిదారీ గ్రూపులు వేస్తున్న ఎత్తుగడలన్నింటినీ ఖచ్చితంగా మనం వ్యతిరేకించాలి. ఇందుకు మనం ఏ రాజకీయపార్టీ వెనుక చేరనక్కరలేదు. నేను అన్ని ట్రేడ్ యూనియన్లకు — అవి ఏ సంస్థకు అనుబం ధింపబడినా— చేసే విజ్ఞప్తి ఏమంటే, మీరుకూడ ఈ విషయం లో మాతో చేరండి. కారణ మేమంటే ఏ రాష్ట్రప్రభుత్వం ఖచ్చితంగాను, నిర్దిష్టంగాను కార్మిక వర్గం తరఫున, పీడిత ప్రజల తరఫున నిలబడుతుందో ఆ ప్రభుత్వం యెడల కూడ మేము యిట్టి వైఖరినే అవలంబిస్తాం.

# 67. ద్వంద్వ విధానం

సంక్షోభం నెమ్మదిగా అడుగువేసుకుంటూ వస్తున్న సమయంలో మనం సమావేశమవుతున్నాం. ప్రభుత్వం అభివృద్ధి ప్రణాళికలకు కేటాయించిన మొత్తాలను తగ్గించుకోవలసి వస్తుందన్న మాటలు వినిపిస్తున్నాయి. అలా జరిగితే అందరికన్న ముందు బాధపడవలసిన వారు కార్మికులు, పేద-మధ్య తరగతి ప్రజలూను. భారత దేశాన్ని ఆర్థికంగా అభివృద్ధి చేసుకోవడ మనేది తక్షణమే అందరూ నిర్వర్తించవలసిన జాతీయ కర్తవ్యం. ముఖ్యంగా ట్రేడ్ యూనియన్లు యీ కర్తవ్యాన్ని ఎంతో బాధ్యతతో నిర్వర్తించవలసియుంటుంది. కాని పై విధంగా జరిగితే మాత్రం యీ అభివృద్ధికార్యాలు నిలిచిపోతాయి.

అదే సమయంలో మరొక విషయాన్ని కూడా మనం గుర్తించాలి. ఈ అభివృద్ధి కష్టజీవుల పొట్టలు కొట్టకుండా సాధింపబడేటట్లు చూడాలి. అందుచేత మనం ద్వివిధ మార్గమవలంబించాలి. మొదటిది ఆర్థికాభివృద్ధికి దోహదంచేయడం; రెండవది యీ ఆర్థికాభివృద్ధిలో కష్టజీవుల ప్రయోజనాలను కాపాడ్డం.

ఇందుకు మనం పోరాటపు ఎత్తుగడలను గురించి జాగ్రత్తగా ఆలోచించాలి. అవి పై రెండు లక్ష్యాలను సాధించగలిగేటట్లుండాలి. అవి కష్టమైన ఎత్తుగడ లేనన్న విషయంలో సందేహం లేదు. కార్మికులు కోరే ప్రతికోర్కెను బలపరచేం

దుకు సమ్మె జరపాలనటమూ తప్పే; సమ్మెలన్నిటినీ నిషేధిం చాలనడమూ తప్పే. దీన్నే మనం ఈ యేడు సెప్టెంబరులో జరిగిన వర్కింగ్ కమిటీ సమావేశంలో యిలా స్పష్టీకరించాం:

* సంఘటితులమై ఐక్యతను సాధిద్దాం.
* ప్రదర్శనలు జరిపి నిరసన ప్రకటిద్దాం.
* సంప్రతింపులుజరిపి ఒడంబడికలు కుదుర్చుకుందాం.
* వానివల్ల ఫలితం కలుగకపోతే శాంతియుతంగాను, చిట్టచివరి మార్గంగాను సమ్మెచేదాం.

"ఈ అవగాహన యిప్పటికీ సరియైనదే."

దీన్ని మనం యాంత్రికంగా వ్యాఖ్యానించకూడదు. మనం సంప్రతింపులు జరిపేమాట నిజమేకాని అనేకసార్లు ఎప్పుడు ఎక్కడ రాజీపడాలో తెలుసుకోలేక పోతున్నాం. ఉదాహరణకు నేనొక ఉదంతం చెప్తాను. కార్మికులు నూటికి 26 వంతుల బోనసు అడిగితే యజమానులు నూటికి 24 యివ్వడానికంగీకరించారు. అయినా కార్మికనాయకులు సమ్మెకు పిలుపిచ్చారు. రెండోవైపున నాయకత్వం అసలే కదలని ఉదంతాలున్నాయి. సరియైన ఎత్తుగడ లవలంబించ డానికి ఏమేమి చేయాలో వివరంగా చెప్పడం కష్టం. మొత్తం మీద మాత్రం పరిస్థితుల అవసరాన్నిబట్టి అవి ఉండాలి. "పోరాటతత్వం" అనేమాట అరాచకదౌర్జన్యాన్ని విచ్ఛి న్నాన్ని కప్పిపుచ్చుకునేటందుకు సాకుగా ఉపయోగింపబడ

వచ్చు. అలాగే "విజ్ఞత" అనే మాట కొన్ని సందర్భాలలో పిరికితనాన్ని క్రియాశూన్యతను కప్పిపుచ్చుకొనేటందుకు సాకుగా ఉపయోగింపబడవచ్చు. రెండిటినీ మనం నివారించాలి. ఏవిధంగా ? అనుభవమే చెపుతుంది.

## 68. కర్తవ్యాలు, నినాదాలు

ఇప్పుడు మనం సాధించదలచుకున్న పనులను, నిర్వర్తించవలసిన కర్తవ్యాలను క్లుప్తంగా తెలియజేస్తాను. ఈ క్రింది విధులను నిర్వర్తించడానికి మనం సంఘటితులమవాలి; పోరుసల్పాలి :

1. ప్రపంచశాంతిని కాపాడ్డం; అణుఆయుధాలను నిషేధించడం;

2. జాతీయ ఆర్థికవ్యవస్థను పటిష్ఠమొనర్చడం; జాతీయ సంపదను వృద్ధిచేయడానికి ఉద్దేశింపబడిన ప్రణాళిక లోని ప్రధానాంశాలను ఖచ్చితంగా అమలుజరపడం.

3. ప్రభుత్వరంగాన్ని అభివృద్ధిపరచడం; జాతీయప్రయోజనాలకు వ్యతిరేకంగా విదేశీ గుత్తపెట్టుబడిదారులు చేసే పనులను తుదముట్టించడం.

4. భూస్వామ్య - గుత్తపెట్టుబడిదారీ గ్రూపులు విపరీత లాభాలు సంపాదించడానికి అనుసరించే విధానాలను

కార్మికులు ప్రజలు అదుపులో పెట్టడం; లాభాలను మామూలు స్థాయికి తగ్గించడం.

5. కష్టజీవులపై విధింపబడుతూన్న పన్నుల భారాన్ని తగ్గించడం; ధరలను తగ్గించి స్థిరీకరించడం; సహకార సంఘాలద్వారా వాడకంవస్తువులను పంపకంచేయడం.

6. కార్మికుల జీతాలను పెంచడం; పరిశ్రమనుబట్టి ప్రాంతాన్ని బట్టి జీతాలనుపెంచుతూ సగటున నూటికి 25 చొప్పున పెంచడం.

7. అధికధరల ఎలవెన్సును జీతంతో కలిపివేయడం.

8. కార్మికుని ఆరోగ్యానికి, ప్రాణానికి ప్రమాదంకలిగించే పరిశ్రమల్లో పనిగంటలను తగ్గించడం. ఉదా: గనులు, రసాయన పరిశ్రమ, ట్రాన్స్‌పోర్టు వగైరా.

9. అభ్యుదయకరమైన చట్టాలను ప్రవేశపెట్టడం; అట్టి చట్టాలను తీర్పులను కార్మికుల సహకారంతో అమలు జరపడం.

10. దేశవ్యాపితంగా అన్ని పరిశ్రమల్లోను, వృత్తులలోను, ప్రాంతాల్లోను పనిచేసే కార్మికుల జీతాల వ్యవస్థ యిప్పటికంటె మెరుగ్గాఉండేటట్లు చూడ్డానికి ఒక్కొక్క పరిశ్రమకు ఒక్క వేజ్‌బోర్డు చొప్పున నియమించడం.

11. సాంఘిక భద్రతా స్కీములో— ఎంప్లాయీస్ స్టేట్ ఇన్సూరెన్సు స్కీము, ప్రావిడెంటుఫండు వగైరా— సంస్కరణలు ప్రవేశపెట్టడం.

12. ట్రేడ్ యూనియన్లను గుర్తించడం; ఏది ఎక్కువ ప్రాతినిధ్యంగల సంఘమో నిర్ణయించడానికి వోట్లు తీసుకోవటం.

13. రాజకీయ తదితర సంస్థలతో నిమిత్తం లేకుండా ట్రేడ్ యూనియను ఐక్యతను స్థాపించడం.

14. తుపాకి కాల్పులను తుదముట్టించడం; ట్రేడ్ యూనియన్ హక్కులను, ప్రజాతంత్ర హక్కులను అణచకుండా చూడడం; డిటెన్షన్ చట్టాన్నీ ప్రజాతంత్ర సూత్రాలకు వ్యతిరేకమైన ప్రభుత్వోద్యోగులకాండక్టు రూల్సునూ రద్దుచేయడం.

15. పాలకవర్గంలో ఉన్న లంచగొండితనాన్ని, ఆశ్రితపక్ష పాతాన్ని నిర్మూలించడం.

16. కులభేదాలను, నిమ్నజాతుల—ఆటవిక తెగల పీడనను అంతమొనర్చడం; అన్నికులాల, భాషల, ప్రాంతాల కార్మికులమధ్య వర్గఐక్యతను నిర్మించడం.

17. సంఘటితులుకాని కార్మికులను సంఘటితులొనర్చడం; అ. భా. ట్రే. యూనియన్ కాంగ్రెస్‌ను పటిష్ఠ మొనర్చడం.

మన దేశక్షేమంకోసం, మనవర్గ శ్రేయస్సుకోసం ఐక్యమై విజయం సాధిద్దాం!

క్రిందనున్న దారిద్ర్యాన్ని, పైనున్న దుష్పరిపాలనను— అవి ఎక్కడున్నాసరే— నిర్మూలిద్దాం!

డిసెంబరు 24, 1957.

# అనుబంధం 1.

## వివిధ పరిశ్రమల్లో వచ్చిన లాభాల సూచీపత్రం

| సంవత్సరం | మొత్తం పరిశ్రమలు | జూట్ | బట్టలు | తేయాకు | పంచదార | కాగితం | ఇనుము ఉక్కు | బొగ్గు | సిమెంటు |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1947 | 191.6 | 313.2 | 317.7 | 216.3 | 171.5 | 167.7 | 86.1 | 171.8 | 142.5 |
| 1948 | 259.9 | 361.2 | 548.1 | 127.9 | 381.3 | 257.0 | 96.3 | 201.0 | 252.8 |
| 1949 | 181.5 | -89.3 | 292.0 | 138.4 | 216.4 | 316.7 | 116.0 | 287.2 | 295.0 |
| 1950 | 246.6 | 456.9 | 356.6 | 271.2 | 262.4 | 479.0 | 134.2 | 209.2 | 333.4 |
| 1951 | 310.5 | 679.1 | 551.1 | 103.9 | 420.8 | 604.1 | 157.7 | 178.4 | 419.7 |
| 1952 | 190.6 | 183.4 | 262.8 | -88.8 | 409.8 | 566.8 | 162.6 | 220.4 | 293.4 |
| 1953 | 261.2 | 326.2 | 379.4 | 391.4 | 419.8 | 512.7 | 179.4 | 145.5 | 279.0 |
| 1954 | 320.8 | 354.7 | 398.9 | 743.8 | 336.1 | 666.1 | 226.3 | 161.0 | 341.4 |
| 1955 | 334.3 | 277.5 | 533.0 | 183.1 | 413.5 | 747.8 | 307.9 | 200.4 | 409.7 |

(మంత్లీ ఎబ్‌స్ట్రాక్ట్ ఆఫ్ స్టాటిస్టిక్స్)

# అనుబంధం 2.

## అధిక ధరల అలవెన్సులలో వ్యత్యాసాలు

నూలుబట్టల మిల్లులలో 26 రోజుల స్టాండర్డు నెలకు యిచ్చే కనీసవేతనాలు, అధిక ధరల అలవెన్సులు.

| కేంద్రం లేదా రాష్ట్రం పేరు | కనీస మూల వేతనం | అధిక ధరల అలవెన్సు 1957 ఆగస్టు | 1956 ఆగస్టు |
|---|---|---|---|
| బొంబాయి | రు. 30.00 | రు. 76.69 | రు. 70.50 |
| అహమ్మదాబాదు | 28.00 | 71.53 | 64.22 |
| షోలాపూరు | 26.00 | 65.00 | 60.80 |
| బరోడా | 26.00 | 64.37 | 57.80 |
| ఇండోర్ | 30.00 | 54.56 | 49.87 |
| నాగపూరు | 26.00 | 51.74 | 48.48 |
| మద్రాసు | 26.00 | 51.75 | 50.14 |
| కాన్పూరు | 30.00 | 55.62 | 54.06 |
| ప. బెంగాల్ | 20.15 | 30.00 | 30.00 |

(లేబర్ గెజెట్ : 1957 అక్టోబరు)

# అనుబంధం 3 (ఎ)

## పారిశ్రామిక తగాదాలు (1921 నుండి 1957 వరకు)

| సం. | నిలుపుదలల సంఖ్య | కార్మికుల సంఖ్య (వేలలో) | నష్టమైన పనిరోజులు (లక్షల సంఖ్యలో) |
|---|---|---|---|
| 1921 | 396 | 600.3 | 69.8 |
| 1922 | 278 | 435.4 | 39.7 |
| 1923 | 213 | 301.0 | 50.5 |
| 1924 | 133 | 312.4 | 87.3 |
| 1925 | 134 | 270.4 | 125.8 |
| 1926 | 128 | 186.3 | 10.9 |
| 1927 | 129 | 131.6 | 20.2 |
| 1928 | 203 | 506.8 | 316.5 |
| 1929 | 141 | 531.0 | 121.6 |
| 1930 | 148 | 196.3 | 22.6 |
| 1931 | 168 | 203.0 | 24.1 |
| 1932 | 118 | 128.0 | 19.2 |
| 1933 | 146 | 164.9 | 21.7 |
| 1934 | 159 | 220.8 | 47.7 |
| 1935 | 145 | 114.2 | 9.7 |
| 1936 | 157 | 169.0 | 23.6 |
| 1937 | 379 | 647.8 | 89.8 |
| 1938 | 399 | 401.0 | 91.9 |

# అనుబంధం 3 (బి)

## పారిశ్రామిక తగాదాలు (1939 నుండి 1957 వరకు)

| సం. | నిలుపుదలల సంఖ్య | కార్మికుల సంఖ్య | నష్టమైన రోజులు |
|---|---|---|---|
| 1939 | 406 | 4,09,189 | 49,92,795 |
| 1940 | 322 | 4,52,539 | 75,77,281 |
| 1941 | 359 | 2,91,054 | 33,30,503 |
| 1942 | 694 | 7,72,653 | 57,79,965 |
| 1943 | 716 | 5,25,088 | 23,42,287 |
| 1944 | 658 | 5,50,015 | 34,47,306 |
| 1945 | 820 | 7,47,530 | 40,54,499 |
| 1946 | 1629 | 19,61,948 | 1,27,17,762 |
| 1947 | 1811 | 18,40,748 | 1,65,62,666 |
| 1948 | 1259 | 10,59,120 | 78,37,173 |
| 1949 | 920 | 6 85,457 | 66,00,593 |
| 1950 | 814 | 7,19,883 | 1,28,06,704 |
| 1951 | 1071 | 6,91,321 | 38,18,928 |
| 1952 | 963 | 8,09 242 | 33.36,961 |
| 1953 | 772 | 4,66,607 | 33,82,608 |
| 1954 | 840 | 4,77,188 | 33,72,630 |
| 1955 | 1166 | 5,27,767 | 56,97,848 |
| 1956 | 1263 | 7,34,168 | 71,36,512 |
| 1957 (నవంబరు వరకు) | 1885 | 10,20,854 | 57,54,961 |

# అనుబంధం 4

'ట్రేడ్ యూనియన్లు : వలస విధాన అంత్యదశ' అను శీర్షికతో నున్న వివేదికలో కొన్ని భాగాలు.

*　　*　　*

ఆసియా - ఆఫ్రికా - లాటిన్ అమెరికా దేశాల ముందున్న సమస్యలను గురించి, ఆ దేశాల లక్ష్యాలనుగురించి, ట్రేడ్‌యూనియన్ల కర్తవ్యాలను గురించి తెలుసుకోవాలంటే. ఈ దేశాలన్నిటినీ మనం రెండు ప్రధానమైన గ్రూపులుగా విభజించవలసి యుంటుంది.

మొదటిగ్రూపు: స్వాతంత్ర్యం సంపాదించుకున్న దేశాలు - ఉదా: ఇండియా, ఇండొనేషియా, సుడాన్, ట్యునీషియా, మొరాకో, ఘనా, మలయా మొదలైనవి — లేదా స్వతంత్ర ప్రభుత్వాలను కలిగి యుంటూ, లాటిన్ అమెరికా దేశాల్లోవలె సామ్రాజ్యవాదుల రాజకీయ ఒత్తిడికి లేదా కంట్రోలుకు లోనయ్యే దేశాలు.

రెండవగ్రూపు: రాజకీయ స్వాతంత్ర్యంకొరకు, జాతీయ సర్వం సహాధికారంకొరకు యింకా పోరాడుతున్న దేశాలు.

మొదటి గ్రూపుయొక్క సమస్యలూ, రెండవగ్రూపు సమస్యలూ ఒకటి కావు. ఐతే, రెండుగ్రూపుల దేశాలూ ఆర్థికంగా వెనుకబడి యున్నవే. అందుచేత అవి వలసవిధానానికి వ్యతిరేకంగా పోరాడవలసిందే. కాని ఆ పోరాటం విభిన్నరూపాల్లో కొనసాగుతుంది.

రాజకీయ స్వాతంత్ర్యాన్ని కలిగియుండి, సర్వం సహాధికార ప్రభుత్వాలున్న దేశాల్లో — ఇండియా, ఇండొనేషియా, బర్మా, ఈజిప్టు, సిరియా, లాటిన్ అమెరికా గ్రూపు — ప్రధాన సమస్య ఏమంటే, త్వరితంగా ఆర్థికాభివృద్ధి జరిగేందు కవసరమైన ప్రణాళికలను అమలు జరపడంద్వారా వలసదోపిడీయొక్క అవశేషాలను నిర్మూలించడం. ఈ దేశాలు తమ జాతీయస్వాతంత్ర్యాన్ని పటిష్ఠ మొనర్చుకోడానికి,

దారిద్ర్యంతో అలమటిస్తున్న ప్రజల స్థితిగతులను బాగుపరచడానికీ, ప్రాతిపదిక యిదే నని చెప్పాలి.

కొత్తగా స్వాతంత్ర్యం పొందిన దేశాల ప్రభుత్వాలు వెనుకబాటుతనం నుంచీ, పరాధీన స్థితినుంచీ బయటపడేందు కవసరమయే అభివృద్ధి ప్రణాళికలను తయారుచేసేటప్పుడు రెండు సమస్యలు ఆ దేశాల నెదుర్కొంటున్నాయి.

మొదటిసమస్య, యిప్పటికే సరకులను ఉత్పత్తి చేస్తూన్న జాతీయ పరిశ్రమలపై విదేశీ గుత్తపెట్టుబడిదార్ల పెత్తనాన్ని రద్దు పరచడం యెలాగు - అనేది. సామ్రాజ్యవాదులు తమ క్రింద పరాధీన స్థితిలో వుంటూ వచ్చిన దేశాలకు రాజకీయ స్వాతంత్ర్యం యిచ్చివేయ వలసిన పరిస్థితు లేర్పడ్డాయి. కాని రెండోవైపున వారు తమ ఫ్యాక్టరీల పైన, గనులపైన, ప్లాంటేషన్లు (తేయాకు, రబ్బరు వగైరా తోటలు) మొదలైన వాటిపైన గల యాజమాన్యాన్ని వెంటనే ఒదులుకోలేదు. వీటి మీద చాలకాలం పెత్తనం చెలాయించారు. వీటిమీద వచ్చిన లాభాలు విదేశీ గుత్తపెట్టుబడిదార్ల ప్రయోజనాలను కాపాడ్డానికి యితర దేశాలకు పంపబడుతూ వచ్చాయి; తత్ఫలితంగా పరాధీనదేశాల ప్రజలు నేడు దారిద్ర్యంతో కుములుతున్నారు.

రెండవ సమస్య, వెనుకబడియున్న తమ ఆర్థిక వ్యవస్థను అభివృద్ధి పరచుకోడానికి కావలసిన యంత్రసామగ్రిని, సాంకేతిక సహాయాన్ని అభివృద్ధిచెందిన దేశాలనుంచి యెలా పొందాలి - అనేది.

కొత్తగా స్వాతంత్ర్యం పొందిన దేశాల్లో అధికారానికి వచ్చిన ప్రభుత్వాలను ప్రజలు మొత్తంమీద బలపరుస్తున్నారు; ఆర్థికంగా తమ దేశాలను అభివృద్ధిచేసుకోవాలని ఆ ప్రభుత్వాలు కోరుతున్నాయి. కాని వాటిలో చాల ప్రభుత్వాలు జాతీయ పెట్టుబడిదారీ వర్గంయొక్క బలమైన పలుకుబడిక్రింద ఉండడమో, ఆ వర్గం యొక్క నాయకత్వం క్రింద వుండడమో కనిపిస్తుంది. అందుచేత ఆ ప్రభుత్వాలు ఎవరినుంచి రాజకీయ స్వాతంత్ర్యం పొందాయో ఆ సామ్రాజ్యవాదుల నుంచే ఆర్థిక సహాయం కూడా పొందవచ్చునని ఆశిస్తాయి. తమ క్రింద చాలాకాలం బానిసలుగా ఉన్నవారు స్వాతంత్ర్యం సంపాదించుకున్నందు కెంతో సానుభూతి

ఉన్నట్లు, సర్వవిధాల వారికి సహాయం చేసేటట్లు సామ్రాజ్యవాదులు నటిస్తారు. ఆర్భాటంతో కూడిన ప్రకటనలు అనేకం చేస్తారు. వాటిని యీ ప్రభుత్వాలు నమ్ముతాయి, అందుచేతనే ఈ ప్రభుత్వాలు తమ దేశాల్లో వున్న విదేశీ గుత్తపెట్టుబడులను జాతిపరం చేయడానికిగాని, వాటి దోపిడీని గట్టిగా అదుపులో పెట్టడానికిగాని వెంటనే చర్యలు తీసుకోవు.

ఐతే యిట్టి విధానంవల్ల ఆ దేశంయొక్క ఆర్థిక వ్యవస్థను అభివృద్ధి పరచుకోడాని కవసరమైన, విస్తృతమైన, శక్తివంతమైన వనరులు లేకుండా పోతాయి; ఆర్థిక యిబ్బందులలో ఆ ప్రభుత్వాలు యిరుక్కోవలసి వస్తుంది; అవి రూపొందించే అభివృద్ధి ప్రణాళికలు ధ్వంసమవుతాయి. అంతేకాదు. విదేశీగుత్తాధిపతులు తమ పలుకుబడిని మరింత కోల్పోతామన్న భయంతో ఉత్పత్తిని ధ్వంస మొనర్చాలని లేదా సంపదను నాశన మొనర్చాలని చూస్తారు. ఉదాహరణకు గనులలో ఎప్పటికప్పుడు పని సక్రమంగా జరగడాని కవసరమైన సాంకేతిక యేర్పాట్లను అమలు జరపరు; ఫ్యాక్టరీలలో పాత యంత్రాలస్థానే కొత్తయంత్రాలను స్థాపించరు; తేయాకు, రబ్బరు వగైరా తోటల్లో ఎప్పటికప్పుడు క్రమబద్ధంగా నాట్లు వేయరు.

ఇట్టి పరిస్థితుల్లో విదేశీ పెట్టుబడులమీద ఆ ప్రభుత్వాలు ఏవైనా నిబంధనలు విధించదలచుకుంటే, లేదా వాటిని జాతిపరం చేయదలచుకుంటే సామ్రాజ్యవాదులు సైనికబలంతో మీద పడతామని బెదిరిస్తారు. అంతవరకు వారు ప్రదర్శిస్తూవచ్చిన "సానుభూతి" అంతర్ధానమవుతుంది; వారి సామ్రాజ్యవాద ఆత్మ అసలురంగుల్లో బయటపడుతుంది.

ఇందుకు వివరాలతో ఉదాహరణ లీయనవసరంలేదు. అవి ప్రజలందరికీ తెలుసు. ఇరాన్ ప్రభుత్వం పెట్రోలుగనులను జాతిపరం చేయడానికి సిద్ధమైనప్పుడు అమెరికా, బ్రిటన్‌లు సైనికచర్యలు తీసుకోడానికి కుట్రలు సల్పాయి; బ్రిటన్ నూనెగనులపై తనకున్న పెత్తనంలో కొంత అమెరికాకు యివ్వవలసి వచ్చింది. కర్నల్ నాజర్ ఈజిప్టు ప్రజల ఆస్తి అయిన సూయెజ్ కెనాల్ కంపెనీని జాతిపర మొనర్చినప్పుడు బ్రిటిష్, ఫ్రెంచి సేనలు ఈజిప్టుమీద దండెత్తాయి. దీన్నిబట్టి, సామ్రాజ్యవాదులు వెనుకబడిన దేశాలపట్ల చూపే సానుభ

కపటత్వంతో కూడుకొన్నదని తెలుసుకోవచ్చు. అంతేకాదు. దృఢ నిశ్చయులైన ప్రజలు, ఐక్యతతో పురోగమించే ప్రజలు ప్రపంచదేశాల లోని అభివృద్ధికరశక్తుల సహాయంతో ఏ విధంగా తమదేశాన్ని రక్షించు కోగలరో నిరూపింపబడింది. లాటిన్ అమెరికాలో పెట్రోలుగనులను, తదితర గనులను ఆయా ప్రభుత్వాలు జాతిపర మొనర్చడానికి సిద్ధపడి నప్పుడు అమెరికన్ సామ్రాజ్యవాదులు ప్రతిఘటించారు; అరబ్బుదేశాలు తమ సొంత ఆస్తి ఐన పెట్రోలుగనులమీద వచ్చే లాభాలన్నిటినీ అనుభ వించడానికి చర్యలు తీసుకొంటున్న సమయంలో "ఐసెన్ హోవర్ సిద్ధాంత"మనే దురాక్రమణ పూరిత పథకంతో ముందుకొచ్చి, తమ ఆగ్రహావేశాలను ప్రదర్శించారు. భారతప్రభుత్వం గనులను, ప్లాంటేష న్లను, పెట్రోలు ఎనరులను, బ్యాంకు పెట్టుబడులను, ఇన్సూరెన్స్ పెట్టు బడులను జాతిపరం చేయదలచుకున్నప్పుడు బ్రిటిష్ సామ్రాజ్యవాదులు తీవ్రంగా వ్యతిరేకించారు. వాటిలో బ్రిటిష్ పెట్టుబడి అనేక కోట్లపౌన్లు విలువగలది ఉంది. సామ్రాజ్యవాదుల ప్రతిఘటనవల్ల భారత ప్రభుత్వం జీవితభీమాను, ఇంపీరియల్ బ్యాంకును మాత్రమే జాతిపరంచేసి ఊరుకో వలసి వచ్చింది. ఒకవైపు ప్రజలు గనుల్నీ, ప్లాంటేషన్లనూ జాతిపరం చేయాలని డిమాండుచేస్తూంటే, మరోవైపు ప్రభుత్వం ఆ స్కీముకు పరిమితులను విధించింది. అలాచేస్తే సామ్రాజ్యవాదులు పంచవర్షప్రణా ళికకు సహాయంచేస్తారనీ, తద్వారా ఆ దేశంయొక్క ఆర్థికాభివృద్ధికి తోడ్పడతారనీ వారు ఆశించారు.

తమ్ము ఆర్థికంగా పరాధీనతలో ఉంచేందుకు ఉద్దేశింపబడ్డ యీ సామ్రాజ్యవాద కుట్రలను కొత్తగా స్వాతంత్ర్యం పొందిన దేశాల ప్రజలు శక్తివంతంగా ఎదుర్కొంటున్నారు. అందుచేత వారు విదేశీ పెట్టుబడుల పెత్తనంక్రింద ఉన్న సంస్థలన్నిటినీ జాతిపరం చేయాలనీ, ఆర్థికంగా తాము అభివృద్ధి చెందడానికిది అవసరమనీ డిమాండు చేస్తు న్నారు. జాతీయాభివృద్ధికి ముప్పుతెచ్చే విధంగా విదేశీ పెట్టుబడిదారులు సాగించే వర్తక వ్యాపారాన్నీ తదితర కార్యకలాపాలనూ అదుపులో పెట్టాలని కోరుతున్నారు. ఈ విధంగా అనేకదేశాల్లో వలస విముక్తిని

సాధించుకొనేందుకు, జాతీయ స్వాతంత్ర్యాన్ని పటిష్ఠ మొనర్చుకొనేందుకు జరిగే పోరాటం విదేశీ పెట్టుబడులను జాతీయ మొనర్చాలనే కోర్కెలో, విదేశీ గుత్తపెట్టుబడుల యినుప పిడికిలినుంచి సహజ సంపదను విముక్తి చేయాలనే డిమాండులో వ్యక్తమవుతోంది.

వెనుకబడిన దేశాలకు యంత్రసామగ్రి, సాంకేతిక సహాయం ఎంతో అవసరమని గుర్తెరిగిన సామ్రాజ్యవాదులు యీ దేశాల స్వాతంత్ర్యాన్ని బలహీనమొనర్చడానికి సర్వవిధాలా ప్రయత్నిస్తున్నారు; అట్టి సహాయానికి చాలా కఠినమైన షరతులు విధిస్తున్నారు.

వలసరాజ్యాధిపతులు తమ దోపిడీ విధానాన్ని కొనసాగించేందుకు కొత్తబురఖాలు ధరిస్తున్నారు. ఆర్థికసహాయం పేరుతో ఆయా దేశాలమీద పెత్తనం చేయడానికి ప్రయత్నిస్తున్నారు. ఉదాహరణకు అగ్నేయాసియా దేశాలకు కొలంబో ప్రణాళిక; అర్జంటైనాకు ప్రెబిష్‌ప్లాను; పోర్రీస్‌ప్లాను; చిలీకి క్లీన్‌సాక్స్‌ప్లాను; క్యూబాకు ట్రూలోప్లాను; అంతర్జాతీయ ఫైనాన్స్ కార్పొరేషన్, ప్రపంచబ్యాంకు తయారుచేసిన వివిధ ప్రణాళికలు. బ్రిటిష్, ఫ్రెంచి పాలకవర్గాలు ప్రత్యక్షమైన రాజకీయ పెత్తనంద్వారా కొనసాగించిన పాతకాలపు వలసవిధానానికిబదులు అమెరికన్ వలస రాజ్యాధిపతులు ఆర్థిక సహాయంద్వారా, కమ్యూనిస్టు ప్రమాదాన్నెదుర్కొనే పేరుతో కుదుర్చుకొంటున్న సైనిక ఒడంబడికలద్వారా, సాంకేతిక బృందాలద్వారా, యింకా అనేక పద్ధతులలో వలసదోపిడీని కొనసాగించేందుకు ముందుకు వస్తున్నారు. వారు చేయదలచుకున్న సహాయం కొత్తగా స్వాతంత్ర్యం సంపాదించుకున్న దేశాలను ఆర్థికంగా అభివృద్ధిచేయదు, సరికదా, అలా "సహాయంచేసే" సామ్రాజ్యవాదుల పెత్తనాన్ని లేదా కంట్రోలును విధిలేక అంగీకరించవలసిన స్థితి ఆ దేశాలకు ఏర్పడుతుంది; అవి స్వతంత్రమార్గంలో అభివృద్ధిచెందడానికి వీలు లేకుండా పోతుంది.

అనేకదేశాల్లో జాతీయ పెట్టుబడిదారీవర్గం, ప్రజలు తమ దేశాలను ఆర్థికంగా అభివృద్ధి చేసుకోవాలంటే వివిధ స్థాయిలలో, విభిన్న రూపాలలో పెట్టుబడులపై ప్రభుత్వ యాజమాన్యం అవసరమని తెలుసుకుంటున్నారు. అట్టి యాజమాన్యంవల్ల ప్రజలు పెట్టు-

కార్యకలాపాలను ప్రజాస్వామ్యయుతమైన కంట్రోలులో ఉంచగల్గుతారు; రెండోవైపున కార్మికులు, కార్మిక సంఘాలు ఆర్థిక వ్యవస్థను, ప్రజా జీవితానికి సంబంధించిన ప్రభుత్వ కార్యకలాపాలతో ప్రత్యక్ష సంబంధ మేర్పరచుకోగల్గుతారు.

కాని కొత్తగా స్వాతంత్ర్యం పొందిన యీ దేశాల్లో జాతీయ ఆర్థిక వ్యవస్థ యీ విధంగా విస్తరించడమంటేగాని, అభివృద్ధి చెందడ మంటేగాని సామ్రాజ్యవాదులకు యిష్టంలేదు. ఈ దేశాల్లో విదేశీ పెట్టు బడుల కార్యకలాపాలమీద విధింపబడే కంట్రోళ్ళను లేదా పరిమితులను వారు ఏవగించుకొంటున్నారు.

అందుచేత యీ దేశాలు ఆర్థికసహాయ మడిగినప్పుడల్లా తమ పెట్టుబడులు తమ యాజమాన్యం క్రిందనే ఉండేటట్లు, యిప్పుడుగాని, యికముందుగాని వాటిని జాతిపరం చేయకుండేటట్లు హామీ యివ్వ మని డిమాండు చేస్తున్నారు. తాము సంపాదించే లాభాలను విదేశాలకు పంపించుకొనేందుకు స్వేచ్ఛ, తమ నిపుణులు ప్రత్యేకాధికారాలను అనుభవించేందుకు స్వేచ్ఛ అవసరమంటున్నారు. వీటికి అంగీకరించడ మంటే దేశీయ పెట్టుబడులకు, దేశీయ నిపుణులకు, దేశీయ కార్మికులకు నష్టం వాటిల్లజేయడం తప్ప మరొకటికాదు. అందుచేత, కొత్తగా స్వాతంత్ర్యం పొందిన దేశాలు ఆర్థికంగా అభివృద్ధి చెందడాని కవసర మయిన చర్యలు సమగ్రంగా, ప్రజాస్వామ్య పద్ధతుల్లో దేశానికీ, ప్రజ లకూ ఉపయోగపడేవిధంగా తీసుకోదలిస్తే—వలస విధానానికి వ్యతి రేకంగా యికముందుకూడ పోరాటం కొనసాగించవలసి యుంటుంది.

అంటే, సామ్రాజ్యవాదం నుంచి రాజకీయంగా విముక్తి చెంది నంత మాత్రాన వలసవిధానానికి వ్యతిరేకంగా సాగించవలసిన పోరాటం సమాప్తమవదన్నమాట; పోరాటరూపం, పోరాట పరిధి మాత్రమే మారుతుంది.

అందుచేత, యీ దేశాలు తమ స్వాతంత్ర్యాన్ని పటిష్ఠ మొనర్చు కోడానికి ఏవిధంగా ఆర్థికరంగంలో అభివృద్ధి చెందవచ్చు? ఈ పరి ణతకు కార్మికవర్గ మేవిధంగా తోడ్పడగల్గుతుంది? కొత్తగా [స్వాతం]త్ర్యం పొందిన దేశాలూ, అంతకుముందే స్వాతంత్ర్యం పొందిన

దేశాలూ ఆర్థికంగా అభివృద్ధి చెందడానికి ట్రేడ్‌యూనియన్ ఉద్యమం ఏవిధంగా దోహదం చేయగల్గుతుంది ? కార్మికవర్గం తన హక్కుల కోసం తాను పోరాడుతూనే సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా కొత్త రూపంలో జరిగే యీ పోరాటంలో నిర్వహించవలసినపాత్ర ఏదైనా ఉందా ? ఇండియా, ఇండొనేషియా, బర్మా, సింహళం, ఈజిప్ట్, తదితర అరబ్బుదేశాల్లోగాని, బ్రెజిల్, మెక్సికో మొదలైన లాటిన్ అమెరికా దేశాల్లోగాని, కొత్తగా స్వాతంత్ర్యం పొందిన ఆఫ్రికాదేశాల్లోగాని కార్మికవర్గం ముందడుగు వేయడానికి, దేశం అభివృద్ధి చెందడానికి మార్గమేమిటి ?

* * *

మొన్నటివరకు వలసదేశాలుగా ఉంటూ యీమధ్యనే స్వాతంత్ర్యముపొందిన దేశాల్లో కార్మికవర్గం ఆర్థికాభివృద్ధి విషయంలోను, తన పరిస్థితుల్ని బాగుపరచుకొనే విషయంలోను కొత్తసమస్యల నెదుర్కోవలసి వచ్చింది.

కొత్తగా స్వాతంత్ర్యం పొందిన దేశాల ప్రభుత్వాలు ఉత్పత్తిని అధికం చేయడానికి, జాతీయాదాయాన్ని పెంచడానికి, ఉద్యోగావకాశాలను హెచ్చించడానికి, వేతనాలను అధికం చేయడానికి కావలసిన అభివృద్ధి ప్రణాళికలను తయారుచేస్తే, కార్మికవర్గం వాటిని బలపరచి తీరుతుంది; దేశాన్ని అభివృద్ధిచేసే విషయంలో తన విధుల్ని తాను నిర్వర్తించడానికి సంసిద్ధత ప్రకటిస్తుంది. ఈ దేశాలు ఆర్థికంగా అభివృద్ధి చెందితేనే జాతీయ సంపద వృద్ధిచెందుతుందనీ, తాముకూడా అభివృద్ధి చెంది విముక్తిని సాధించడం సాధ్యపడుతుందనీ ట్రేడ్‌యూనియన్లకు తెలుసు. కనుకనే అవి జాతీయార్థికాభివృద్ధికి అవసరమయే ప్రణాళికలను ఉత్సాహంగా బలపరుస్తాయి. ఒకానొకదశలో అట్టి అభివృద్ధి పెట్టుబడిదారీవర్గంయొక్క దోపిడీమీద ఆధారపడి యుండవచ్చు. అయినప్పటికీ, అలాంటి పరిస్థితుల్లోకూడా పారిశ్రామికాభివృద్ధి దేశాన్ని ముందుకు తీసుకుపోడానికే ఉపయోగపడుతుంది; వలసవిధానానికి వ్యతిరేకంగా పోరాడ్డంలో కార్మికులకు బలం చేకూర్చుతుంది; కార్మికవర్గం ఇంకా యెక్కువ పోరాటాలు జరపడాని కవసరమైన పరిస్థితులను కల్పిస్తుంది.

కనుకనే ఇండియా, ఇండొనేషియా, ఈజిప్ట్, సిరియా, ఇరాన్, లాటిన్ అమెరికా మొదలైన దేశాల ప్రభుత్వాలు విదేశీ గుత్తపెట్టుబడిదార్లకు వ్యతిరేకంగా సాగిస్తూ వచ్చిన పోరాటాలను ట్రేడ్‌యూనియన్ ఉద్యమం, కష్టజీవులైన ప్రజాసామాన్యం బలపరిచారు; ఆర్థికంగా అభివృద్ధి చెందడానికి ఆ ప్రభుత్వాలు తయారుచేసిన ప్రణాళికలను హృదయపూర్వకంగా బలపరిచారు.

ఈ దేశాలు వలసవిధానానికి వ్యతిరేకంగా ఆర్థికాభివృద్ధి కొరకు సాగించే పోరాటంలో ట్రేడ్‌యూనియన్లు విదేశీ గుత్తపెట్టుబడిదారీ సంస్థలను జాతీయం చేయాలని, లేదా కనీసం వాటి ప్రాబల్యాన్ని తగ్గించడంద్వారా అందు కవసరమైన తొలిచర్యలు తీసుకోవాలని డిమాండు చేయడం సహజం; యిది వాటి ప్రధాన నినాదాల్లో ఒకటిగా ఉండడం కూడా సహజమే.

అంతేకాదు; జాతీయం చేయబడిన ఉత్పత్తిరంగాలను ఆధారంగా చేసుకొని ఆయా దేశాల ఆర్థిక వ్యవస్థను క్రమపద్ధతిలో మరింత అభివృద్ధి చేయాలని ట్రేడ్‌యూనియన్లు కోరడం ఎంతో అవసరం, సహజం.

అలాంటి చర్యలను విదేశీ గుత్తపెట్టుబడిదారీ సంస్థలు అతి తీవ్రంగా ప్రతిఘటిస్తాయనడంలో సందేహంలేదు. అయితే, జాతీయ పెట్టుబడిదారీవర్గం గట్టిగా నిలబడి ప్రజలందరి సహకారం తీసుకున్నట్లయితే — అలా తీసుకోడం తప్పనిసరి అవుతుంది — వీలైనచోట్ల సోషలిస్టుదేశాల సహాయం తీసుకోడానికికూడా సంకోచించకుండా ఉన్నట్లయితే, వలస రాజ్యాధిపతుల్ని వెనక్కు తగ్గేటట్లు చేయవచ్చు.

విదేశీ గుత్తపెట్టుబడిదార్ల సంస్థలను జాతీయంచేసి, లేదా వాటి ప్రాబల్యాన్ని తగ్గించి, ప్రభుత్వరంగం ఆధారంమీద దేశాన్ని అభివృద్ధి చేస్తే—ఆర్థికంగా అభివృద్ధి చెందడానికి ముందడుగువేయగల శక్తిని యీ దేశాలు సంపాదిస్తాయి.

ఐతే దీనిఅర్థం అభివృద్ధిచెందిన దేశాలనుంచి యంత్రసామగ్రి, సాంకేతిక పరిజ్ఞానం మొదలైన రూపాల్లో యీ దేశాలకు ఎట్టి సహాయం అవసరం ఉండదనికాదు. తప్పకుండా అట్టిసహాయం వాటికి అవసరమే. ఐతే అందుకు వెనుకబడినదేశాలు తమ స్వాతంత్ర్యాన్ని, భవిష్యత్తును

తాకట్టు పెట్టడానికి మాత్రము అంగీకరించకూడదు. విదేశాలనుంచి అసలు సహాయమే తీసుకోరాదని కార్మికవర్గం చెప్పదు. అయితే అట్టి సహాయం ఏవిధమైన షరతులకూ లోబడి ఉండకూడదని, సహాయం తీసుకునే దేశంయొక్క స్వాతంత్ర్యానికి హాని కలుగకూడదని, అట్టి సహాయం ఆ దేశానికి, దేశప్రజలకు మేలుకలిగించే విధంగా నిజమైన ఆర్థికాభివృద్ధికి తోడ్పడేటట్లుండాలని కార్మికవర్గం పట్టుపట్టాలి.

విదేశీ గుత్తపెట్టుబడిదార్ల బ్యాంకులు తమకు సహాయం చేస్తాయని అనేక దేశాలు గంపెడాశతో ఎదురుచూడ్డం, ఆ సహాయం పరిశ్రమల అభివృద్ధికి నిజంగా వినియోగింపబడుతుందని తెలుసుకోగానే బ్యాంకులు నిరాకరించడం ఎన్నోసార్లు జరిగింది. ఒకవేళ నిరాకరించకుండా ఉన్నప్పటికీ, సరకుల ఖరీదును విపరీతంగా పెంచివేయడంవల్ల ఆ దేశాలూ, వాటి వనరులూ అప్పులలో కూరుకుపోవడమో, అభివృద్ధి ప్రణాళికలు ఆలస్యంగా అమలుజరగడమో, అనుకున్న వ్యవధిలో అవి పూర్తికాకపోవడమో, లేదా అవి వక్రరూపంలో తయారవడమో జరుగుతోంది. ఫలితమేమంటే, ఆ దేశాల ఆర్థికాభివృద్ధి కుంటుపడుతోంది; వెనుకబడిన దేశాలలో కొందరు గుత్తపెట్టుబడిదార్లు మాత్రమే కొద్దిపాటి లాభాలు సంపాదించుకో కల్గుతున్నారు.

ఇట్టి ప్రతిష్టంభననుంచి బయటపడే మార్గంలేదా ?

ఉంది. సోషలిస్టు శిబిరానికి చెందిన దేశాలు బడుగుదేశాలకు సహాయం చేయడానికి సిద్ధంగా ఉన్నాయి. బడుగుదేశాల కృషికి తోడ్పడగల కొత్త స్నేహితులు యీ దేశాలు.

వివిధ దేశాల జాతీయ పెట్టుబడిదారీ ప్రభుత్వాలు సైతం యీ రోజున ఒక చారిత్రక సత్యాన్ని గుర్తిస్తున్నాయి. అది ఏమంటే ఆర్థికాభివృద్ధికై జరిగే కృషిలోను, వలన విముక్తి పోరాటాల్లోను సహాయం పొందగోరే దేశాలు యికపై సామ్రాజ్యవాద దేశాలమీద, అవి యిచ్చే సాంకేతిక సహాయంమీద ఆశలు పెట్టుకోరాదు.

భారతదేశంలో ఉక్కు కర్మాగారాల, ఇంజనీరింగ్ కర్మాగారాల నిర్మాణంలోను, నూనెగనుల పరిశోధనలోను, సాంకేతిక నిపుణుల తరిఫీదులోను సోవియట్ పరిశ్రమలుచేసే సహాయాన్ని పెట్టుబడిదార్లతో

సహా యావన్మంది ప్రజలు గుర్తిస్తున్నారు. బ్రిటిష్, జర్మన్, అమెరికన్ బ్యాంకర్లు భారతదేశాని కిచ్చే రుణంమీద 100 కి 4 లేక 5 వరకు వడ్డీ డిమాండుచేస్తూంటే, సోవియట్ యూనియన్ 100 కి 2 1/4 రేటు మాత్రమే అడిగిందని తెలుసుకున్నప్పుడు భారతప్రజలు సంతోషపడ్డారు. ఇండియాలో నూనెగనుం పరిశోధనకు సోవియట్ యూనియన్, రుమేనియా దేశాలు సహాయం చేయడాని కంగీకరించాయి. బ్రిటన్, అమెరికాల గుత్తాధిపత్యాన్ని పడగొట్టడానికి భారతప్రభుత్వం, ప్రజలు చేసే కృషికి యీ సహాయం దోహదమీయగలదని చెప్పవచ్చు.

బ్రిటిష్‌వారు సింహళదేశపు రబ్బరును కొనడం మానివేసి, తద్వారా తమ ధరలను సింహళంమీద బలవంతంగా రుద్దదలచు కున్నప్పుడు చైనా సింహళదేశపు రబ్బరును కొని తన బియ్యాన్ని చౌకగా పంపింది. ఈ వార్త సింహళప్రజల్ని ఎంతో ఉత్సాహపరచింది. బర్మా విషయంలోకూడా యిలాగే జరిగింది.

ఈజిప్టు, సిరియా మొదలైన మధ్యప్రాచ్య దేశాలు స్వాతంత్ర్యం కోసం పోరాడుతున్న సమయంలో సోషలిస్టు శిబిరానికి చెందిన జెకోస్లోవేకియా, సోవియట్ యూనియన్ మొదలైన దేశాలు వాటికి సహాయం చేశాయి. సోవియట్ నిపుణులు సూయెజ్ కాలువను కాపాడ్డానికి వెళ్తామని పేరు యిచ్చినప్పుడు సామ్రాజ్యవాదులు ఎంత గగ్గోలు చేశారు! అలాగే, సోవియట్ వాణిజ్యబృందాలు కొన్ని లాటిన్ అమెరికా రిపబ్లిక్కులకు వెళ్ళినప్పుడు అమెరికన్ గుత్తవ్యాపారస్తు లెంత హడలెత్తిపోయారు!

సోషలిస్టుదేశాలు చేస్తున్న సహాయం ఈరోజున అధికంగా లేకపోవచ్చు. కేవలం సుహృద్భావ సూచకంగాచేసే సహాయంకూడా గుత్త పెట్టుబడిదార్ల ఆగ్రహావేశాలకు కారణమవుతోంది. కొన్ని వెనుకబడిన దేశాల్లో ప్రభుత్వాలు జాతీయ పెట్టుబడిదారీవర్గంయొక్క పెత్తనంక్రింద ఉన్నాయి. అవి సాధారణంగా సోషలిస్టుదేశాల సహాయాన్ని కోరవు. ఎందుచేతనంటే, యితర పెట్టుబడిదారీ దేశాలతో వాటికిగల సంబంధాలు చెడిపోవచ్చునని భయపడతాయి. అలాంటి ప్రభుత్వాలుకూడా యీ సహాయానికి కృతజ్ఞత తెలియజేస్తున్నాయి. కారణ మేమంటే, గుత్త

పెట్టుబడిదార్లనుంచి అనుకూలమైన షరతులపై సహాయం పొందేటందుకు సైతం యీ సహాయం తోడ్పడుతుంది. సోషలిస్టుదేశాలను అడుగుతాము సుమా అని బెదిరించడానికైనా యిది వాటి కవసరం. అంతేకాదు. ఈ ప్రభుత్వాలు గత అనుభవంనుంచి నేర్చుకున్న విషయమేమంటే సామ్రాజ్యవాద గుత్తాధిపతులతో చేసే వ్యాపారంవల్ల చాల నష్టం కలుగుతుంది. ద్రవ్యం హరించుకుపోతుంది. సోషలిస్టుదేశాలతో వ్యాపారం అలాకాక సమాన హోదాపైన నిజాయితీతో జరుగుతుంది.

అందుచేత సోషలిస్టుదేశాలుచేసే సహాయానికి కార్మికవర్గం స్వాగత మివ్వాలి. ఆయా దేశాలు తమ స్వాతంత్ర్యాన్ని రక్షించుకొనే విషయంలో యిట్టి సహాయం ఎంత రాజకీయ ప్రాముఖ్యాన్ని కలిగియుందో కార్మికవర్గం జనసామాన్యానికి వివరించి చెప్పాలి.

అంతేకాదు, సోషలిస్టుదేశాలకు చెందిన సాంకేతిక నిపుణులు బడుగుదేశాల కార్మికులయెడ ఎలా ప్రవర్తిస్తారో కార్మికవర్గం ప్రత్యక్షంగా చూస్తూనే ఉంది; యితరులకు ఆ విషయం తెలియజెప్పవచ్చు. వారి వైఖరికీ, పెట్టుబడిదారీదేశాలనుండి వచ్చే నిపుణుల వైఖరికీ ఎంత వ్యత్యాసముందో వారు స్పష్టంగా చూడవచ్చు.

సహాయం రూపంలో మనకు లభించేది సోషలిస్టుద్రవ్య మొక్కటే కాదు; సోషలిస్టు సాంకేతికపద్ధతు లొక్కటేకాదు. శ్రామికవర్గ అంతర్జాతీయత అనే మహోన్నత భావంతో ఉత్తేజితులయిన సాంకేతిక నిపుణుల సహాయం మనకు లభిస్తోంది. వారిలో పాలకజాతుల అహంభావంగాని, మనస్తత్వంగాని ఉండదు. పైవారి నుంచి పని తీసుకొనేటప్పుడు, క్రిందివారికి పనియిచ్చేటప్పుడుకూడా వారు సహాయంచేసే వ్యక్తులుగా, కార్మికులుగా వ్యవహరిస్తారు. పెట్టుబడిదారీదేశాల నిపుణులంటారా ? వారు "నాటు" కార్మికులయెడ సామ్రాజ్యవాద వైఖరితో మెలగుతారు.

ఆర్థికంగా వెనుకబడియుండే ఒకదేశం — చైనా రిపబ్లిక్ — సహాయంకోసం సామ్రాజ్యవాదుల్ని దేవురించకుండా, లంచగొండితనాన్ని నిర్మూలిస్తూ, ఉత్పత్తిని అధికం చేస్తూ, కష్టజీవుల జీవనప్రమాణాన్ని పెంచుతూ, స్వయంకృషిద్వారాను, సోవియట్‌యూనియన్

మొదలైన సోషలిస్టుదేశాల సహాయంతోను పరిశ్రమలనే కాకుండా వ్యవసాయాన్నికూడా అభివృద్ధి చేసుకొంటూ, పెద్ద పెద్ద అడుగులు వేసుకుంటూ ముందుకు నడుస్తోంది. అట్టిదేశానికి ఐక్యరాజ్యసమితిలో సామ్రాజ్యవాదులు స్థాన మివ్వడానికి నిరాకరిస్తున్నారంటే ఆశ్చర్యపడ వలసిన అవసరంలేదు. కాని, వారు చైనా పురోగమనాన్నెంతో కాలం ఆటంకపరచలేరు.

పై విధాలైన సహాయంతోబాటు బడుగుదేశాల్లో విస్తారంగా లభించే మనుష్యబలాన్నీ, ఆర్థిక వనరులనూకూడ సమీకరించడానికి మార్గాలేవో కార్మికవర్గం, ప్రజలు జాతీయ పెట్టుబడిదారీవర్గంతో కలిసి గాని, యితరవర్గాలతో కలిసిగాని తెలియజేస్తూ ఉండవచ్చు. తద్వారా ఆర్థికాభివృద్ధికి దోహదం చేయవచ్చు.

ఈవిధంగా, వెనుకబడిన దేశాలు విదేశీ గుత్తపెట్టుబడిదార్ల వనరులను వినియోగించుకోడంద్వారాను, షరతులను విధించకుండా వారు చేసే సహాయాన్ని స్వీకరించడంద్వారాను, సోషలిస్టుదేశా లిచ్చే సహాయంతోను, తమదేశాల్లో లభించే వనరులతోను అర్థికంగా అభివృద్ధి చెందవచ్చు; తమ స్వాతంత్ర్యాన్ని పటిష్ఠమొనర్చుకోవచ్చు.

ఈ విధానాన్ని బాండుంగ్ మహాసభలో పాల్గొన్న రాజ్యాలలో కొన్ని యీనాడు అమలుజరుపుతున్నాయి. ఆ దేశాల్లో కార్మికవర్గం, ట్రేడ్‌యూనియన్లు యీ విధానాన్ని బలపరుస్తున్నాయి.

* * *

ట్రేడ్‌యూనియన్ ఉద్యమం వలసవిధానానికి వ్యతిరేకంగాను, కార్మికప్రయోజనాలను రక్షించేటందుకు పోరాడేటప్పుడు ఒక ముఖ్యమైన సమస్యను ఎదుర్కోవలసి యుంటుంది. అది ట్రేడ్‌యూనియన్లకూ, జాతీయ పెట్టుబడిదారీవర్గానికీ మధ్య ఉండవలసిన సంబంధం. ఈమధ్యనే స్వాతంత్ర్యంపొందిన దేశాలలో ఆర్థిక రాజకీయాధికారం తరచు జాతీయ పెట్టుబడిదారీవర్గం చేతుల్లో ఉంటుంది. స్వాతంత్ర్యం యింకా సంపాదించని దేశాల్లో జాతీయ పెట్టుబడిదారీవర్గం తరచు జాతీయ స్వాతంత్ర్యోద్యమంలో ఒక ప్రధానశక్తిగా ఉంటుంది. జాతీయ

పెట్టుబడిదారీవర్గం తీసుకొనే చర్యలు సామ్రాజ్యవాదాన్ని దెబ్బకొట్టేవి గాను, దేశస్వాతంత్ర్యాన్ని పటిష్ఠమొనర్చేవిగాను, పారిశ్రామికాభివృద్ధికి తోడ్పడేవిగాను ఉన్నంతకాలం వాటిని ట్రేడ్‌యూనియన్ ఉద్యమం బలపరచాలి; వాటిని అమలు జరపటంలో ప్రత్యక్షపాత్ర వహించాలి.

ఐతే జాతీయ పెట్టుబడిదారీవర్గం ద్వంద్వ స్వభావం గలది. ఒకవైపు అది దేశభక్తియుత సామ్రాజ్య వ్యతిరేకశక్తి; రెండోవైపు తన స్వార్థపూరితమైన సంకుచిత ప్రయోజనాలను కాపాడుకోడానికి అది కుతూహలపడుతుంది. అందుచేత అది సామ్రాజ్యవాదాన్ని వ్యతిరేకించ డంలో సంకోచించే ధోరణిని, ఊగిసలాడే ధోరణిని ప్రదర్శిస్తుంది. ముఖ్యంగా పెద్దపెద్ద జాతీయ గుత్తపెట్టుబడిదార్లు యీవిధంగానే వ్యవహరిస్తారు. వారు తమ జేబులు నింపుకోడానికి కార్మికుల ప్రయోజ నాలను, ప్రజల హక్కులను కాలరాయడానికి సర్వవిధాలా ప్రయ త్నిస్తారు. అందుచేత ట్రేడ్‌యూనియన్ ఉద్యమం సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా జాతీయ ప్రయోజనాలను కాపాడ్డానికి, వాటిని మరింత విస్తృతపరచడానికి జాతీయ పెట్టుబడిదారీ వర్గంలోని సామ్రాజ్య వ్యతి రేక శక్తుల్ని బలపరచవలసి యుంటుంది. ఐతే ట్రేడ్‌యూనియన్లు కార్మికుల హక్కులను కాపాడ్డానికీ, వాటిని విస్తృతపరచడానికి జాతీయ పెట్టుబడిదారీవర్గం యొక్క స్వార్థపూరిత చర్యలను, కార్మికుల్ని పీడించే విధానాన్ని వ్యతిరేకించవలసి యుంటుంది, ముఖ్యంగా జాతీయ పెట్టుబడి దారీవర్గం సామ్రాజ్యవాదుల విషయంలో ఊగిసలాడే ధోరణిని, రాజీ చేసుకొనే పోకడను బహిర్గతం చేయవలసి యుంటుంది; వీటికి వ్యతి రేకంగా పోరాడవలసి యుంటుంది. అట్టి రాజీలు జాతీయ ప్రయోజనాల దృష్ట్యా అవసరమని జాతీయ పెట్టుబడిదార్లు సమర్థించుకుంటారు. జాతీయ పెట్టుబడిదారీవర్గం యెడల ట్రేడ్‌యూనియన్లు యీ వి[illegible] రెండు రకాలయిన వైఖరిని ప్రదర్శించవలసి యుంటుంది. వా[illegible] సహజంగా వైరుధ్యం ఉంటుంది. ఈ వైరుధ్యాన్ని చక[illegible] చేసుకొని సవ్యంగా పరిష్కరిస్తేనే వలస విముక్తి [illegible] మించడం, ట్రేడ్‌యూనియన్ ఉద్యమం బలపడ్డం[illegible]

ఇట్టి పరిస్థితుల్లో ట్రేడ్‌యూనియన్లు తమ కోర్కెలను సాధించుకో డంతోపాటు ఆర్థిక వ్యవహారాల్లో కొన్ని కర్తవ్యాలను నిర్వర్తించవలసిన అవసరంకూడ ఉండదా అని ఆలోచించవలసి యుంటుంది.

స్వాతంత్ర్యంపొందిన దేశాల్లోని ప్రత్యేక పరిస్థితుల్నిబట్టి, ప్రజా స్వామ్యహక్కుల హెచ్చుతగ్గులనుబట్టి, కార్మికోద్యమం యొక్క బలాన్నిబట్టి ఆ దేశాల ఆర్థికాభివృద్ధికి కావలసిన ప్రణాళికలను తయారు చేయడంలోను, వాటిని అమలుజరపడంలోను ట్రేడ్‌యూనియన్లు సర్వ విధాల పాల్గొనవలసి యుంటుంది. అంతేకాదు; వలసవిధాన అవశేషా లను నిర్మూలించడానికి, దేశంయొక్క వెనుకబాటుతనాన్ని అధిగమించ డానికి తీసుకోబడే చర్యలలో లంచగొండితనం, దుబారా మొదలైనవాటిని అరికట్టవలసియుంటుంది: ఇందుకు ట్రేడ్‌యూనియన్లు ప్రజాస్వామ్యయుత చొరవను పెంపొందించుకోవాలి. ముఖ్యంగా జాతీయ యాజమాన్యం క్రింద ప్రారంభింపబడి, ప్రజలనుండి పన్నులరూపంలో వసూలు చేయ బడిన ధనంతో నిర్మింపబడిన సంస్థల కిది చక్కగా వర్తిస్తుంది. ట్రేడ్ యూనియన్లు జాతీయసంపదను కాపాడేందుకు, ప్రజల జీవితానికీ, దేశం అభివృద్ధికీ అవసరమైన సంస్థలను రక్షించడానికి ప్రజాస్వామ్యయుతమైన చొరవను ప్రదర్శించాలి. అంతేగాక, విదేశీ గుత్తపెట్టుబడిదార్లు, వారి స్నేహితులు కొత్తగా స్వాతంత్ర్యంపొందిన యీ దేశాలు వలసవిధానాన్ని రూపుమాపడానికి ముందుకు వెళ్ళడం చూడలేక, పైవిధమైన సంస్థలను దుర్వినియోగపరచడానికి, వాటితాలూకు ధనాన్ని అపహరించడానికి, వాటిని ధ్వంసమొనర్చడానికి, లేదా విచ్ఛిన్నం చేయడానికి పూనుకో వచ్చు. అలాంటి ప్రమాదంవున్న సంస్థలను కాపాడ్డం ట్రేడ్‌యూనియన్ల కర్తవ్యం.

ట్రేడ్‌యూనియన్ ఉద్యమం యీ కర్తవ్యాలను నిర్వర్తిస్తూ ..ల ప్రయోజనాలను కాపాడగలిగితే, దేశంయొక్క ఆర్థిక .. నిర్మించడానికి, పెట్టుబడిదార్ల ప్రయోజనాలను మాత్రమే ..రి ప్రయోజనాలను కాపాడ్డానికీ మొత్తం జాతి అంతా ..మైక్యమయేటట్లు చూడగల్గుతుంది. "పెట్టుబడిదార్ల ..త్రమేకాక" అని యెందు కనవలసివచ్చిందంటే,

వలసవిధానాన్ని ప్రతిఘటించడంలోను, దేశీయార్థిక వ్యవస్థను ప్రణాళికా బద్ధ మొనర్చటంలోనూ తానే నాయకత్వం వహిస్తున్నట్లు ఆ వర్గం చెప్పుకొంటుంది.

ఇదివరకే స్వాతంత్ర్యం పొందిన దేశాల్లో జాతీయ స్వాతంత్ర్యాన్ని కాపాడ్డానికి, జాతీయార్థిక వ్యవస్థను నిర్మించడానికి జాతీయ పెట్టుబడిదారీవర్గంతోను, దాని ప్రభుత్వంతోను సహకరించేటప్పుడు ట్రేడ్‌యూనియన్లు కార్మికుల హక్కులను రక్షిస్తూ వారి స్థితిగతులను మెరుగుపరుస్తూ ఉండాలి. అనేక సంవత్సరాలు సామ్రాజ్యవాదుల క్రింద బానిసత్వం అనుభవించిన యీ దేశాల్లో కార్మికులు అత్యంత కష్టమైన పరిస్థితుల్లో జీవిస్తున్నారు. అటువంటప్పుడు, కార్మికుల స్థితిగతులను వెంటనే మెరుగుపరచేటందుకు. వారి న్యాయమైన హక్కులను కాపాడేటందుకు తగు శ్రద్ధ తీసుకోనిదే. సామ్రాజ్య వ్యతిరేక పోరాటంలోను, ఆర్థిక వ్యవస్థను పటిష్ఠ మొనర్చడంలోను కార్మికవర్గం అత్యంత విస్తృతంగా కార్యాచరణకు పూనుకొనేటట్లు చేయలేకపోతాం.

అందుచేత జాతీయ పెట్టుబడిదారీవర్గం, దాని ప్రభుత్వం కార్మికుల ఆర్థిక సాంఘిక పరిస్థితులను మెరుగుపరచేందుకు బాధ్యత తీసుకోవలసి యుంటుంది. కార్మికుల ప్రధానావసరాలను అవి నిర్లక్ష్యం చేస్తేగాని, కష్టజీవుల హక్కుల విషయం పట్టించుకోకుండా ఎంతసేపూ స్వార్థబుద్ధితో వ్యవహరిస్తూంటేగాని ట్రేడ్‌యూనియన్లు వాటికి వ్యతిరేకంగా కార్మికుల్ని సమీకరించి పోరాటం నడపవలసి యుంటుంది. కార్మికుల ప్రయోజనాలను కాపాడనిదే సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా జరిగే పోరాటంలోను, దేశాన్ని అభివృద్ధి చేసేందుకు జరిగే కృషిలోను కార్మికులు పాల్గొనేటట్లు చేయలేం.

జాతీయ పెట్టుబడిదారీవర్గం ఊగిసలాడుతూ, సామ్రాజ్యవాదులతో రాజీపడుతూంటే కార్మికవర్గం ఇంకా యెక్కువ దృఢనిశ్చయంతో పోరాడవలసి యుంటుంది. తిరిగి జాతీయ ప్రయోజనాల కనుగుణ్యంగా వ్యవహరించేటట్లు చేయవలసి యుంటుంది.

అయితే మనం గుర్తించవలసిన విషయమేమంటే, ఇట్టి పోరాటాల లక్ష్యం కార్మికులయెడ జాతీయ పెట్టుబడిదారీవర్గం అనుసరించే

అపసవ్య వైఖరిని మార్చేదిగా ఉండాలి; ఆ వర్గంతో మన సామ్రాజ్య వ్యతిరేక సాహచర్యం మెరుగుపడేటట్లు ఉండాలి. అందుచేత జాతీయ పెట్టుబడిదారీవర్గం యెడల మన వ్యతిరేకత సామ్రాజ్య వ్యతిరేక ఐక్య సంఘటనలో ప్రధాన చీలికకు కారణం కాకూడదు; ఆ విధంగా మన ప్లాను ఉండాలి. ఇట్టి పోరాటాల్లో జాతీయ పెట్టుబడిదారీవర్గం సామ్రాజ్యవాదం యెడల, కార్మికులయెడల అనుసరించే వైఖరికూడా నిర్ణయాత్మకమైన విషయమేనన్న విషయం మరచిపోకూడదు.

* * *

(1957 అక్టోబరులో లీప్జిగ్‌లో జరిగిన నాల్గవ ప్రపంచ ట్రేడ్ యూనియన్ మహాసభలో శ్రీ డాంగేచే ప్రవేశపెట్టబడి ఆమోదింపబడిన నివేదిక నుండి)



— సమాప్తం —

★

# ట్రేడ్ యూనియన్ కార్యకర్తలంతా చదవవలసిన పుస్తకాలు

ట్రేడ్ యూనియన్లు : వలస విధాన అంత్యదశ
— ఎస్. ఏ. డాంగే 0.62

త్రైపాక్షిక ఒప్పందాలు : వాటి వివరాలు 0.44

మూడవ ప్రపంచ కార్మిక మహాసభ తీర్మానాలు 0 25

భారతప్రభుత్వ కార్మిక విధానం — బ్యాంకు వివాదం
— ఎస్. ఏ. డాంగే 0.19

చేనేత వుద్యమం — మన కర్తవ్యాలు 0.12

చేనేత దర్పణం
— పుత్సల సత్యనారాయణ 1.50
(పోస్టేజి అదనం)

---

ప్రతులకు :

విశాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవాడ.

Wrapper Printed at Swatantra Art Printers, Vijayawada-2.

BC

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA 109 B 173 |
| పుస్తకం పేరు | జాతీయ పునర్నిర్మాణం |
| తారీఖు | 26-10-24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 243 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | BCT |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Aswini |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | akshaya |
| పరీక్ష చేసినది | ASWINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |